## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంథాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంథాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంథాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంథాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంథాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంథాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 99999990128931

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంథముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |

**Author's Last Name**

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |

**Year**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |

**Subject**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |

**Language**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయసూచిక



రుద్ర వీణ - జీవన్ ఖాన్ బీన్కర

# ముందు మాట

వాయిద్యాలని గురించి, పండితులకుపయోగించే ప్రత్యేక గ్రంథాలున్నాయి, కాని ఆ విషయాల్ని గూర్చి అట్టే తెలియని సామాన్యులకు తెలియజెప్పే గ్రంథాలేవీ లేవు. శిల్పాలలో చూసే వాయిద్యాలు, జానపద వాయిద్య విశేషాలు, వస్తు ప్రదర్శనశాలలో దొరికే వాయాద్య గ్రంథాల పట్టికలు, ఇంకా తదితరమైనవన్నీ కూడ, వాయిద్య జాలాన్ని గూర్చి లోతైన పరిశోధన చేసే పండితులకు, వాటి ప్రత్యేకతలు, సాంకేతిక సమాచారం, అందజేస్తాయి. ప్రస్తుతం ఈ పుస్తకం వాయిద్య జాలాన్ని గురించి అనేక రకాలైన సమాచారాన్ని సమకూర్చి, దాన్ని సంక్షేపంగా, తేటతెల్లంగా చదువరుల కివ్వడానికి ఉద్దేశించినది.

మనలో చాలామందికి ఒక అనాలోచితమైన అలవాటుంది. సంగీత సభలకి పోతాం, అక్కడ తళతళ మెరుస్తూ, క్లిష్టంగా తీర్చిదిద్దిన వీణ, సితార్, మృదంగం, తబలా మొదలైన వాయిద్యాలను ఆనందంగా వింటాం, చూస్తాం; వాటిని గూర్చి కుతూహల మున్నవారు ఏ సంగీత గ్రంథంలోనే చదువుతారు. అంతే, వాటిని, వాటి చరిత్రను గురించి మన పరిశీలన అంతటితో ఆగిపోతుంది. ఆ చరిత్ర వెనుక కొన్ని వేల సంవత్సరాల నుంచి, మనకు తరతరాల సంస్కృతి ద్వారా సంక్రమిస్తూన్న జానపదులు, ఆటవికులు మొదలైన వారుపయోగించే ఎన్నో రకాలైన సంగీత వాయిద్యాలు; యుద్ధ ప్రకటలకు, నృత్యాలకు, ఉత్సవాలకు సంబంధించే వారి వాయిద్య విశేషాలు, ఈ నాటి సంగీత సభల్లో మనం చూసే వాయిద్యాలకు ముందుద్భవించిన ప్రాథమిక స్వరూపాలనే విషయం మనం ఊహించనైనా ఊహించలేం. విభజన చేసే పాక్షికదృష్టి, అంటే, శాస్త్రీయ లేక అశాస్త్రీయ జానపద వాయిద్యాలనీ, లేక హిందూస్థానీ కర్ణాటక వాయిద్యాలని, ఇత్యాది విభజన దృష్టి, లేక పాక్షిక దృష్టి మనల్ని ఆవరించేస్తోంటుంది.

కాని సమాజమూ అలా ముడుచుకుపోయి, తన పరిసర ప్రభావాల నుంచి విడిపోయి ముందుకు సాగలేదు. ఇతరలను అర్థం చేసుకునే శక్తి, రాకపోకల సౌకర్యాలు మొదలైన వాటి మీద ఆధారపడి, ప్రతి సంస్కృతి తాను కొంత ఇతరులకు ఇచ్చి, ఇతరుల నుంచి తాను కొంత గ్రహించి పుచ్చుకునే నిరంతర ప్రవాహంతో ముందుకు సాగుతూంటుంది. అందుచేత ఈ రకమైన సాంస్కృతి కాంతర్యాహినికి లోబడే మన సంగీత వాయిద్యాలని గురించి తెలుసుకోవడం మనకు కొంత కుతూహల పోషకమూ,

జ్ఞానదాయకమూ అవుతుంది. పైగా మన సంగీత వాయిద్యాలు పురాణ గాథలతో బాగా పెనవేసుకున్న సంస్కృతి చిహ్నాలు. వీటిలో ఆ గాథల్లోని ప్రజల శాలూకు ఆనవాయితులూ, నిషేధాలూ వ్యక్తమవుతూంటాయి. కనుక సంగీత వాయిద్యాల్ని గురించి తెలుసుకోవడం అంటే ఆ ప్రజలను గురించి తెలుసుకోవడమే.

ఇదంతా మనసులో ఉంచుకుని ఈ చిన్న 'ముందు మాట' సంగీత వాయిద్యాన్ని కేవలం సంగీతానికి పనికివచ్చే పరికర జంత్రాలుగా కాకుండా, సాంఘిక జీవితంతో అవినాభావంగా పెనవేసుకుపోయిన సంస్కృతి చిహ్నాలుగా భావించి, వాటి స్వరూపాన్ని పాఠకుల ముందుంచడమైంది.

సంగీత శాస్త్రపరంగా సాంకేతిక దృష్టితో వాయిద్యాల్ని పరిశీలించ కుతూహలమున్న వారు, ఈ గ్రంథకర్త ఇంత క్రితం రచించిన భారతదేశ సంగీత వాయిద్యాలు; వాటి చరిత్ర, స్వరూపావతరణం' *(Musical Instruments of India : their History and Evolution)* అనే గ్రంథాన్ని చదివి తెలుసుకోగలరు. ఈ గ్రంథం చివరి పేజీలో వాటిని పేర్కొనడమైంది.

ఈ గ్రంథంలో బ్రాకెట్టులలో సూచించిన సంఖ్య బొమ్మలకు సంబంధించినది. పైన చెప్పిన విషయం గ్రంథకర్తకు ఎంత ముదావహంగానూ, జ్ఞానదాయకంగాను అవగతమైందో, పాఠకులకు కూడా అంత జ్ఞానాన్ని, తృప్తిని ఇస్తుందని ఆశిస్తూ,

**బి. చైతన్య దేవ**

# 1
# ఉపోద్ఘాతము

సంగీత కచ్చేరిలకు పోతాం, అక్కడ కూర్చుని ఏ వీణ కచేరీయో, ఏ సితార్ మొదలైన వాయిద్యాలకు పూర్వ స్వరూపాలు, ఆంధ్ర దేశంలో కనపడే 'రాంజగొంటాం' అనే వాయిద్య విశేషాన్నుంచిగాని, అస్సాం ప్రాంతంలో కనపడే 'జటాంగ్' అనే వాయిద్యాన్నుంచి గాని, ఈ నవీనమైన సితార్, వీణ వాయిద్యాలు ఉద్భవించాయని కలలోనైనా అనుకోగలమా? ఓ చిన్న వెదురు కర్రమీద పైపెచ్చు కొంచెం ఊడదీసి, దాన్ని 'తంతి'గా ఉపయోగించి, దాని చిగురున ఏ ఆనపకాయ బుర్రో బిగించి, చిన్న పుల్ల ముక్కతో ఆ వెదురు మీద కొట్టి వాయించేది, 'రాంజగొంటాం', 'జింటాంగ్' కూడ అలాటివే. లేకపోతే, మంచి తబలా వాయిద్యం వింటూంటాం అనుకోండి. ఈ తబలా నిర్మాణం మన ఇంట్లో వంట చేసుకునే కుండ నుంచి పుట్టుకొచ్చిందంటే నమ్మలేము కదూ! అలాగే ఫిడేలు వాయిద్యంలో కమాను, ఫిడేలు తంతుల మీద రాసి ధ్వని పుట్టించడం, ఆది మానవులు నిప్పు తయారు చేయడం కోసం, కర్ర కర్ర రాపాడించేటప్పుడు కలిగిన ధ్వని వల్ల ఈ అభిప్రాయం పుట్టిందని అనుకోగలమా?

సంగీతం, సంగీత వాయిద్యాలు ఈ రోజుల్లో ఎంతో నైపుణ్యంతోను, ప్రత్యేక నేర్పరితనంతోను తయారవుతున్నాయి. ఆ వాయిద్యాలు చూస్తుంటే మనకు సంఘంలో వాటి నిర్మాణాన్ని గూర్చిన అభిప్రాయాలు ఎంతెంత చిన్న చిన్న దైనందిన కార్యాల నుంచి బయలు దేరాయో మనం ఊహించలేం. ఇది బాగా యోచన చేయవలసిన విషయం. అలా యోచన చేస్తే మనకి తోచేదేమంటే, ఈ వాయిద్యాల ప్రాథమిక దశ, సంగీతానికి ఏమీ సంబంధం లేని నిత్యావసరమైన కార్యకలాపాల్లోంచి పుట్టుకొచ్చిందని తెలుస్తుంది.

మన దేశానికి తూర్పున వున్న రాష్ట్రాల్లోని 'నాగాలు', తమిళనాడు నీలగిరి పర్వత ప్రాంతాల్లోని 'తోడాలు', పాడే పాటలు మనలో కొంతమంది విని ఉండవచ్చు. వాళ్ళ నృత్యాల్లో ఒక విధమైన నృత్యం, పురుషులు, స్త్రీలు ఒకరినొకరు ఒరుసుకుంటూ కలిసిపోయి చేసేది. ఈ నృత్యంలో పాడే పాటలు, వాళ్ళ వేట సమయాల్లో వినిపించే అనేక రకాలైన కేకలు, కూతలు, అరుపులతో కలిసి వుంటాయి. మళ్ళీ అందులో ఒక రకమైన లయ, అక్కడక్కడ రాగచ్ఛాయలు గూడ వినిపిస్తూ ఉండవచ్చు. అలాగని ఆ సంగీతాన్ని మనం సంగీత కచేరీల్లో వినే సంగీతంతో ఏ విధంగాను పోల్చలేము. ఏమో,

ఆ విధమైన ఆటవిక సంగీతంలోంచే ఎన్నో రకాలైన రాగచ్ఛాయలు, తాళపు మెళుకువలు బయలుదేరి ఉండవచ్చు. లేకపోతే, 'చెంచు కాంభోజి', 'కొండమలహరి' అని రాగాల పేర్లేమిటి?

సంగీతానికి సంబంధించే ఈ రకమైన సంబంధం, వాయిద్యాల విషయంలో మరింత స్ఫుటంగా కనిపిస్తుంది. చాలా మంది పండితులు, కాదనే వాళ్ళున్నారనుకోండి, అనుకునే దేమంటే, వేటల్లోను, యుద్ధంలోను ఉపయోగించే విల్లు, అమ్ముల తాలూకు 'నారీ ఝుంకార ధ్వని' నుంచి పుట్టిందే 'హార్పు' అని చెప్పబడే ఒక రకమైన వీణా విశేషం అని. అంతవరకు ఎందుకు, రామాయణంలో రావణుడు రామునితో యుద్ధానికి వెళ్ళబోయే ముందు అంటాడు, 'రాముడికి నా యుద్ధ నైపుణ్యం తెలియదు. నా విల్లు, అమ్ములతో 'ఝుం' అని వీణానాదం లాగ మ్రోగిస్తే, శత్రు సైనికులు భయపడి, వణికిపోతూ, కకావికలై పారిపోతారు' అని. 'తంతుని' అనే తంతీ వాయిద్యం జంతువులను వేటలో పట్టుటకు ఉపయోగించే బోను చూసి, ఆ ఆకారంలతో చిన్నదిగా తయారు చేసిందే అంటారు. 'పులయనులు' అనే ఆటవిక జాతి సోదరులను చూడండి. వాళ్ళు గుణుపులున్న వెదురు కర్రను ఇంకొక వెదురు కర్రతో రాపాడి నిప్పు పుట్టిస్తారు. ఈ వెదురునే పైశాచిక నృత్యాలలో ఒక వాయిద్య విశేషంగా వాడతారు. దాన్నే 'కొక్కర' అని, 'గగ్గర' అని, 'గర్గర' అని, 'రుగ్రబియ' అని, 'కిరికిట్టక' అని,'సూక్తివాయిద్యం' (సోది వాద్దెం) అనే పేర్లతో వ్యవహరిస్తారు. వంట సామగ్రిలోని కుండలు మొదలైన పాత్రలను, కూజాలను తోలుతో ఒక వైపు కప్పి తాళవాయిద్యాలుగా ఉపయోగిస్తారు. 'తబలా', 'దగ్గ' మొదలైన తాళవాయిద్యాలు ఈ విధంగా పుట్టుకొచ్చినవే. అంటే ఆశ్చర్య మేముంది? తినడానికి పనికి వచ్చే కంచం మీద కర్రపుల్లతో వాయించడం మొదలు పెడితే, 'తాపి' అనే జానపద వాయిద్యం ప్రచారంలోకి వచ్చింది. రోడ్లు వేసే పనివాళ్ళు ఉపయోగించే 'దిమ్మిస' రోడ్లను చదును చేయడానికి పని చేస్తూ, చేస్తూ కొంతసేపటికి ఆ శబ్దంతో సరితూగే మాటలతో ఒక పాట పాడ్డం మొదలుపెడతారు. ఈ దిమ్మిస వేస్తూ, దీనికే 'టిప్పణి' అని కూడ పేరుంది, పాట పాడుతూ, దానికి అనుగుణంగా అడుగులు వెయ్యడం మొదలుపెడితే 'టిప్పణి నాచ్' అనే ఒక రకమైన నాట్యంగా తయారైంది.

అలాగ నిత్యం జరిగే, సంగీతంతో సంబంధం లేని కార్యకలాపాల్లోంచి సంగీత వాయిద్యాలు రూపొందాయి.

ఇంకొక విషయం, ఈ వాయిద్యాలు, ఒక్క సంగీతానికే గాక ఇతర పనుల్లో కూడ ఉపయోగపడుతున్నాయి. శంఖం చూడండి! కేరళ, కర్ణాటక, ఒరిస్సా రాష్ట్రాలలో 'పంచవాద్య' అని చెప్పుకొనే వాద్యగోష్ఠికి ముఖ్యమైన అంగం. ఆ శంఖమే పూర్వం బాకా మొదలైన వాయిద్యాలతో గూడ యుద్ధ ప్రకటనకు, ఇతరమైన ప్రకటనలకు ఉపయోగించేవారు. హిందువులు దాన్ని భగవత్సాన్నిధ్యంలో పవిత్రమైన వాయిద్యంగా

వాడడం మనకు తెలుసు. 'పంచ వాద్య' లేక 'పంచ మహాశబ్ద' వాయిద్యాలు అధికార ప్రకటనకు మహారాజుల కాలంలో ఉపయోగించేవారు. ఒక 'మహా మండలేశ్వరుడు' యుద్ధంలో ఓడిపోతే, ఆయన తన సర్వస్వంతో పాటు బాకాలు, శంఖాలు, బూరాలు, భేరీ మొదలైన వాయిద్యాలను గూడ విజేతకు అప్పగించాలట. డప్పును గురించి చెప్పనే అక్కరలేదు. ఈ నాటికి కూడ గ్రామాల్లో ప్రభుత్వం తాలూకు ప్రకటనలకు, భూమి పన్ను, నీటి పారుదల ప్రకటలకు, కోర్టులలో ఏలంవేసే సమయాల్లో కూడా వాడుతూంటారు గద! ఆఫ్రికా దేశంలో అలాగే 'మాట్లాడే డోళ్ళు' ప్రచారంలో ఉన్నాయట. అంటే ఆ డప్పుల పెద్ద, చిన్న శబ్దాల్ని బట్టి, హెచ్చు స్థాయి, మంద్ర స్థాయి శబ్దాల్ని బట్టి, ఎక్కువ దూరంలో నివసించే వాళ్ళు కూడా వాటి అర్థాలు గ్రహించే అలవాటుందట. తమిళ నాడులో 'స్వంత తమ్మటై' (to beat the tammatai) అనే సూక్తి (తెలుగులో స్వంత డప్పు అన్నట్లుగా) ఒకటుంది. అంటే, తనని గురించి స్వోత్కర్ష చేసుకునేవాడని అర్థం. ఇలాగ డప్పులు, బాకాలు మొదలైన వాయిద్యాలు సంగీత గోష్ఠుల్లోనే గాక ఇతరత్రా కూడా ఉపయోగపడుతున్నాయి. త్రిపురా రాష్ట్రంలో 'లెబాంగ్ గుమని' (Lebang Gumani) అనే వాయిద్య విశేషాన్ని ఇతర వాయిద్యాలతో కలిపి వాయిస్తారుట. 'లెబాంగ్ గుమని' అంటే ముఖ్యంగా వెదురు కర్ర ధ్వనితోను, మీటే తంతులు, వాటి శబ్దంతోను వినిపించే వాయిద్యం. ఈ లెబాంగ్ గుమని ఇతర వాయిద్యాలతో కలిపి పొలాల్లో వాయిస్తే, పంటలను నాశనం చేసే కీటకాలు,



1. లెబంగ్ గుమాని

పక్ష్యాదులు కూడ ఈ చప్పుళ్ళు వినడానికి వస్తాయట. అలా వాటిని బంధించి, చంపడానికి ఈ వాయిద్యాన్ని ఉపయోగిస్తారుట. ఈ విధంగా ఇవి సస్యరక్షణకు ఉపయోగపడుతున్నాయి. దొంగలు ఉపయోగించే ఇంకొక వింతైన తంతి వాయిద్యం, 'కాకలి' అనేది ఉండేదిట. కటిక చీకట్లో తిరిగే దొంగలు ఆ కాకలి వాయిద్యాన్ని ఇళ్ళ వద్దకు వచ్చి మీటితే ఒక చిన్న శబ్దం ధ్వనించి ఇంట్లో నున్నవారు నిద్రిస్తొన్నదీ లేక మేలుకొని ఉన్నదీ తెలిసేదట. మహాకవి దండి వ్రాసిన దశకర చరిత్ర కావ్యంలో ఒకానొక యువరాజు తాను ఏ రీతిగా దొంగవేషం వేసుకుని దొంగతనానికి బయలుదేరాడో వర్ణించి చెపుతాడు. 'పట్టణాన్ని గురించి ముందు బాగా తెలుసుకుని, నీలకంఠుని కంఠంలా నల్లనైన చీకట్లో, నల్లని వస్త్రంతో శరీరమంతా ఆచ్ఛాదన చేసుకుని, కావలసిన పనిముట్లు, పదునైన కత్తి, ఇంకా 'కాకలి' అనే తంతి వాయిద్యంతోను, మర దివ్వె మొదలైన పరికరాలతో బయలుదేరేను. వ్యాపార ధనికుడైన ఒక లుబ్ధుని ఇంటికి వెళ్ళి, గోడలో కన్నం పెట్టి, ముందుగా కన్నంలోంచి ఇల్లంతా కలియచూసి, మెల్లిగా, ఇంట్లోకి, స్వంత ఇంట్లో ప్రవేశించినట్లు ప్రవేశించి, ఆ లుబ్ధుని వద్ద నుంచి చాలా పెద్ద మొత్తాన్ని దొంగిలించి, తప్పించుకు వచ్చేశాను.' అని చెప్పేడు.

పై విషయాలన్నీ ఎందుకు చెప్పానంటే, సంగీత వాయిద్యాలు ఒక్క సంగీతానికే కాక ఇతరత్రా కూడా ఉపయోగపడుతున్నాయి, కనుక సంగీత వాయిద్యాలను నిర్వచనం చెయ్యడం ఎలాగ అని ప్రశ్న. సంగీతం మానవుని ఆది కాలంలో కామక్రోధా ద్యావేశ జనితమైన, రాగ లయబద్ధమైన ఆనంద స్వరూపమైతే, ఆ సంగీతానికి పరికరాలైన వాయిద్యాలు కూడా ఆ ఆదికాలపు నీలి నీడల్లోంచి రూపం దాల్చినవే. అసలు మానవుని ఆది వాయిద్యం, అతని శరీరమే. నృత్యంలో పాద తాడనం, హస్తాలతో చప్పట్లు చరచడం, తొడల మీద వాయించడం మొదలైన లయబద్ధమైన పనులు గాక, గాత్రం అంటే శరీరంతో పాడే పాటలు రాగ రూపాలు, లయబద్ధాలు గద! అందుచేతనే శరీరానికి 'గాత్రవీణ' అనే పేరుతో పురాతనులు వ్యవహరించే వారు. ఇక్కడ 'వీణ' అనే పదం సర్వసామాన్యంగా వాడిన పదం అని అర్థం చేసుకోవాలి. అలాగే 'గాత్రవీణ', 'శైవీవీణ' (భగవద్దత్తమైనది) పదాలు అమలులోకి వచ్చాయి. మిగిలిన వీణలను 'దారవీ వీణ' అంటే కర్రతో చేసిన వీణలని చెప్పుకునేవారు. అందుచేత 'సంగీత వాయిద్యము' అనే మాటకి నిర్వచనం చేయాలంటే సంగీతాన్ని వినిపించగల ఏ రకమైన సాధనమైనా, ఆఖరుకి, రాళ్ళు రప్పలు, మట్టి మొదలుకుని విద్యుచ్ఛక్తి నుపయోగించే ఆధునిక సాధనాలనైనా సంగీత వాయిద్యాలనే అనాలి.

ఈ రోజుల్లో వీణ అంటే మనకి తంతులను సాగదీసి, మీటి వాయించే వాయిద్య విశేషం అనే తెలుసు. కాని ఈ 'గాత్ర వీణ' అనడం ఏమిటి? రాగచ్ఛాయను లేక రాగ రూపాల్ని పలికించగల్గిన ఏ యంత్రమైనా లేక వాయిద్యమైనా, ఆఖరికి గొంతుని కూడ 'వీణ' అని అనేవా రన్నది తెలుస్తూంది. అలాగే తంతి వాయిద్యాల్ని అన్నిటినీ, గాలిని

పూరించి సంగీతాన్ని పలికించగల నాదస్వరం, శహనాయి మొదలైన వాయిద్యాల్ని గూడ 'ముఖవీణ' అని అన్నారు. తంతి వాయిద్యాలలో చిత్ర, విపంచి మొదలైన 'హర్పు' రకాలు; మీటి వేళ్ళతో వాయించుట కేర్పాటైన చెక్క (fingerboard) అంటే ఫింగర్ బోర్డ్ కల్గిన రుద్ర వీణ, సరస్వతీ వీణ, కచ్ఛపి వీణ మొదలైన రకాలు; విల్లుతో వాయించే తంతి వాయిద్యాలైన రావణ హస్తవీణ, పినాకి వీణ మొదలైన రకాలు; అన్నిటినీ కూడ 'వీణ'లనే వ్యవహరించారు. ఈ నాటికి గూడ హిందీ భాషలో, 'బీన్' అంటే రుద్ర వీణ అని, పాముల వాళ్ళు వాయించే నాగస్వరం (Pungi) 'పుంగి' అనే పదంతో వాడుకలో ఉంది. ఈ మాదిరి అనిశ్చయమైన కలగాపులగపు అభిప్రాయమే మధ్యప్రదేశ్‌లోని ఆటవికులు వాయించే 'మర్దల్' లేక 'మదల్' అనే డోలును గురించి కూడ కనిపిస్తుంది. రెండు ముఖాలు గల ఈ డోలే దక్షిణాదిన 'మద్దళం', మద్దళ' అనే పేరుతో ఉంది కాని, దాని ఆకారం, తయారీ వేరుగా కనుపిస్తుంది. అలాగే 'మురజ' అంటే రెండు ముఖాలు గల పెద్ద 'డమరు'లా కనిపించే వాయిద్యమనుకోవాలా లేక ఈ రోజున మనకు తెలిసిన 'మృదంగ' మనుకోవాలా? వాయిద్య నామకరణంలో ఈ రకమైన గందరగోళం సంగీత విద్యార్థులకు ఆర్భాటంగా కనిపించవచ్చు గాని వాయిద్య చరిత్రకారులకు మాత్రం ఈ విషయ నిర్ణయం అతి ముఖ్యం. గతంలో 'వీణ' నామకరణంలో, ఈ గందరగోళ అభిప్రాయం బాగా తేటతెల్లగా తెలుస్తూనే ఉంది.

ప్రస్తుత కాలంలో వీణంటే మెట్లున్నవి గాని, లేనివి గాని తంతివాయిద్యాలైన 'జిథర్' అనే వీణలు, 'లూట్' అనే వీణలు, అనే మనకు తెలుస్తోంది. 'జిథర్' వీణలంటే దండి కింద భాగంలో ఆనపకాయ బుర్రలు గాని, కర్రతో చేసిన బుర్రలు గాని (Resonators) అమరినవి. 'లూట్' వీణలంటే బుర్రలకు పక్కనే, వాటితో కలిసి వున్న దండి అమర్చినవి. పూర్వ గ్రంథాల్లో ఈ వ్యత్యాసాన్ని గమనించకుండా అన్నింటికీ ఒకటే పేరు 'వీణ' అని వర్ణించే వారు. ఆధునిక వాయిద్య చరిత్రకారులకు ఇదంతా గందరగోళంగా కనిపించి, వీణంటే ఏ రకమైన వీణ అనేది తెలియడం లేదు. వీణల్లో ఈ నిర్మాణ వ్యత్యాసాలు, వాట్లకు ప్రత్యేక నామకరణం తర్వాత కాలంలో కొంతవరకు జరిగింది. మధ్యయుగ సంగీత గ్రంథకర్తలు వాయిద్యాలను గురించి నిశితమైన అభిప్రాయాలు లేకపోవడం వల్ల, ఒకే వాయిద్యానికి వేర్వేరు పేర్లు, వేరు వేరు వాయిద్యాలకు ఒకే పేరు ఉపయోగించి వాయిద్య చరిత్ర కథనంలో కొంత గందరగోళానికి తావిచ్చారు. ఈ రకమైన గందరగోళం వల్లనే, నవీన వాయిద్య చరిత్రకారుల్లో కూడ, వేర్వేరు అభిప్రాయాలేర్పడి, అనేక రకాలైన తర్క వితర్కాలకు, వాదోపవాదాలకు దారి తీస్తోంది.

పై కారణం వల్ల పూర్వ సంగీత గ్రంథాల్లోలా పరిశీలనలో అప్రమత్తులమై జాగ్రత్తగా గమనించడం, అర్థం చేసుకోవడం అవసరం. సంగీత వాయిద్యాల్ని గురించి ఏ సమాచారమైనా, ఇతరమైన ఆధారములతో సరి జూసి, ఆ విషయాన్ని గ్రహించి అర్థం చేసుకోవడం, నమ్మడం జరగాలి. ఇతరమైన ఆధారాలంటే, సాహిత్యంలోని సామెతలు,

సూక్తులు మొదలైనవి; జానపద గేయాలు, కథలు, ఇతర చరిత్ర గ్రంథాలు మొదలైనవి; గ్రంథాలయాల్లో దొరికే సంగీత గ్రంథాలు, వ్రాతప్రతులు మొదలైనవి; బొమ్మల్లోను, శిల్పాల్లోను కనిపించే ఆధారాలు; జానపదులు, ఆటవికులు వాడే అనేక రకాలైన సంగీత, నృత్య వాయిద్యాలు, ఇవన్నీ ఇతర ఆధారాలే.

తెలుగులో 'స్వంత డబ్బా' అంటే చాలామందికి తెలుసు. ఇంగ్లీషులో 'to blow one's own trumpet' అంటే స్వంత డబ్బాకి సరియైన ఇంగ్లీషు సూక్తి. కన్నడంలో కూడ 'జాగంతె బారిసు' అనే లోకోక్తి ఉంది. 'జాగంతె' అంటే పళ్ళెం అన్న మాట. 'బారిసు' అంటే దాన్ని వాయించడం. ఇది కూడ స్వంత డబ్బాలాంటి సూక్తే. 'ఒరవోన్' (Oraon) జాతి గిరిజనులు పాడే పాటల్లో, ఓ కుర్రాడు పాడే పాట అలా ఉంటుంది. 'కోటలో గోడ మీదికి చిక్కుడు తీగె పాకి బాగా కాయలు కాచింది. అది తినడానికి ఒక కోతి కాసుకుని చూస్తోంది. దాన్ని నా విల్లు ఎక్కుపెట్టి, బాణంతో చంపి, దాని చర్మంతో 'మందర్' తయారు చేసి వాయిస్తాను. అది విని గ్రామంలో ఆడపిల్లలంతా నా దగ్గరకి పరుగెత్తుకొస్తారు! అని పాడతాడు. చూడండి, కోతి చర్మంతో 'మందర్' తయారుచేసి వాయిస్తాడట. 'సంతాల్' అనే ఆటవికులు, 'తుమ్డా' (Tumda) అనే డప్పు తయారుచేయడానికి కోతి చర్మం వాడతారట. కోతి చర్మం కోసం కోతులుండే అడవుల్లోకి వెళ్ళి, 'హనుమాన్' మంత్రం చదువుతారట. కోతులు స్పృహ తప్పి పడిపోగానే, వాటిని పట్టి చంపి, ఆ తోలుతో డప్పులు తయారు చేస్తారట. ఇలాటి సూక్తులు, జానపద గేయాలలోను, కథల్లోనే కాక, గ్రంథాల్లో కూడ వేదకాలం నుంచి, అనేక రకాలైన సమాచారం మనకు లభిస్తుంది. ఉదాహరణగా వేదంలోని పదాలు కొన్ని, 'అఘాటి' (తాళాలు); 'ఆడంబర' (డప్పులు); 'నాడి' (మురళి); 'కర్కరి', 'వన' (తంతి వాయిద్యాలు) మొదలైనవి ఉన్నాయి. రామాయణంలోను, మహాభారతంలోను, 'నూపుర (కాళ్ళకు కట్టుకునే గంటలు, గజ్జెలు); 'భేరి', 'దుందుభి', 'మృదంగ', 'పటహ' (డోళ్ళు, డప్పులు); 'శంఖ'; 'వేణు' (మురళి); 'వల్లకి' (ఏడు తంతుల వీణ) మొదలైన పదాలే. ఇలాగే ఇతర భాషా గ్రంథాల్లో కూడ దొరుకుతాయి. ఇవి గాక శిల్పాల్లోని దర్శనీయ దృశ్యాలు, విగ్రహాలు, ఉబ్బెత్తు చెక్కడాలు, తైల వర్ణచిత్రాలు, రేఖా చిత్రాలు, గుహల్లోని కుడ్య చిత్రాలు, దేవాలయాల మీద చిన్ని బొమ్మల చెక్కడాలు, బొమ్మలతో కూడిన వ్రాతప్రతులు మొదలైన వాటి నుంచి ఎన్నో విధాల ప్రయోజనకరమయిన సమాచాన్ని సంగ్రహించవచ్చు. దీన్నంతా సమీకరించి, క్రోడీకరించి, పరిశీలన చేయవలసిన ఆవశ్యకత చాలా వుంది. దేశంలోని వివిధ భాషల్లో దొరికే ఈ అనంతమైన సమాచార సంపద నంతటినీ, సేకరించడం, దాని వివరాలన్నీ పరిశీలించడం, ఆ పరిశీలనాన్ని సరిగా సమన్వయించడం ఒక్క సంగీత శాస్త్రకారుల వల్ల కాదు. దీనికి పురావస్తు శాస్త్రజ్ఞులు, కళా శాస్త్రవేత్తలు, వివిధ భాషావేత్తలు, మత సాంప్రదాయ పరిశీలకులు, సంగీత శాస్త్ర పారంగతులు కూడ వారందరితో సహకరించి పరిశోధన

చేయాలి. ప్రస్తుతం ఒకరిద్దరు మాత్రం ఆ రకమైన సమగ్ర పరిశీలన ప్రారంభించారు. కాలం గడిచిన కొద్దీ ఈ ప్రయత్నం కొంతవరకు ఫలోన్ముఖమైతే, మన సంగీత వాయిద్య చరిత్ర ఎంత అనాదిగా వస్తున్నదో, ఎంత వైవిధ్యమైనదో మనకు తెలిసి రావచ్చుని ఆశిద్దాం.

ఇంతవరకు లభించిన వాయిద్యాలను గురించిన సమాచారం వల్ల, వాయిద్యాల్ని ఏ విధంగా విశ్లేషించి, ఎలాగ విభజన చేయాలి అనేది సమస్యగా తయారైంది. వాయిద్యాలు ఏ విధమైన పదార్థాలతో తయారయ్యాయో ఆ విధంగా విభజించాలా? లేక అవి వాయించే విధానాన్ని బట్టి విభజించాలా? లేకపోతే వాటి సంగీత శైలిని బట్టి విభజించాలా? సమస్య చాలా క్లిష్టమైంది. మన దేశంలోను, ఇతర దేశాల్లోను కూడ అనేక రకాలైన విభజనలు జరిగాయి.

మన దేశంలో సంగీత ప్రయోజనాన్ని బట్టి వాయిద్యాల్ని మూడు రకాలుగా విభజించారు. పాటను అనుసరించే వాటిని 'గీతానుగము'అని, నృత్యానికి పనికివచ్చే వాటిని 'నృత్యానుగము'లని, ప్రత్యేకంగా వాయించడానికి పనికివచ్చే వాయిద్యాన్ని 'శుష్క' వాయిద్యాలని మూడు రకాలుగా విభజించారు.

చైనా దేశంలో వాయిద్యాలని తయారైన పదార్థాల్ని బట్టి విభజించారు. 'కిన్' అంటే లోహాలతో తయారైనవి; 'ఛే' అంటే రాతిలో తయారైనవి; 'తు' అంటే మట్టితో తయారైనవి; 'ఘు' అంటే వెదురుతో తయారైనవి, మొదలైన రకాలేర్పడ్డాయి. పంథొమ్మిదవ శతాబ్దంలో పాశ్చాత్య పండితులు ఇంకో విధానం అనుసరించేరు. 'మహిల్లన్' అనే ఆయన వాయిద్యాల్ని నాలుగు రకాలుగా విభజించారు. 'ఆటోఫోన్సు' లేక 'ఇడియోఫోన్సు' (autophones or Idiophones) స్వయం వాదకాలు అంటే శ్రుతి మళ్ళీ మళ్ళీ చెయ్యనక్కర లేకుండా తయారయ్యేవి. ఉదాహరణకు ఘంటలు, తాళాలు, నిడివిగా ఉండే 'రాడ్సు' (Rodes) అనే కర్రలు, గుండ్రటి రింగులు లేక వలయాలు మొదలైనవి ఒక రకం; చర్మంతో తయారయ్యే డప్పులు (membrenophones) మొదలైనవి ఇంకో రకం; తంతులతో ఏర్పడ్డ వాయిద్యాలు (chordophones) మూడో రకం; గాలి ఊది వాయించేవి (aerophones) నాలుగో రకం. ప్రసిద్ధమైన సంగీత గ్రంథాల్లో పైన చెప్పిన 'ఆటోఫోన్సు'ను, చర్మ వాయిద్యాలైన 'మెంబ్రెనోఫోన్సు'ను ఒకే తరగతిలో, 'ఆఘాత' అంటే కొట్టి వాయించే వాయిద్యాలు (Percussion)గా కూడ వర్ణించారు.

ప్రపంచ మొత్తంలో ప్రస్తుతం ఆమోదించి, అనుసరిస్తున్న ఈ విభజన మన దేశంలో రెండు వేల సంవత్సరాల క్రితమే జరిగినట్లు తెలుస్తుంది. క్రీస్తుకు రెండు వందల సంవత్సరాల క్రితమో, తర్వాతనో ఆయిన మధ్యకాలంలో జీవించినట్లుగా పరిగణించబడుతున్న మన భరతుని నాట్య శాస్త్రంలో ఈ విషయం చెప్పబడింది. అందులో నాలుగు రకాల విభజన, అంటే - (1) ఘనవాయిద్యములు (solids or

idiophones); (2) అవనద్ధ వాయిద్యాములు (covered vessels like drums etc.); (3) సుషిర వాయిద్యములు (wind instruments like flute & Nadaswaram etc.) (4) తత వాయిద్యములు అంటే తంతి వాయిద్యములు (stringed instruments) అని చెప్పబడింది. తర్వాత గ్రంథకర్తలు వేర్వేరు రకాలుగా విభజన చేశారు. ఒకానొక గ్రంథకర్త 'తత' (strings), 'వితత' (drums), 'తతవితత' అని మూడు రకాలుగా చెప్పితే, ఇంకొకాయన 'చర్మ' (leather), 'తంత్రిక' (strings), 'ఘన' (solids) అనా మూడు విధాలుగా చెప్పేరు. ఆరవ శతాబ్దానికి పూర్వం నివసించిన కోహలుడు తన గ్రంథంలో 'ఘన', 'సుషిర', చర్మబద్ధ', 'తంత్రి' అని నాలుగు విధాలుగా వర్ణించాడు. తమిళంలో సంగం గ్రంథాల్లో అయిదు రకాలుగా, అంటే 'తోలెక్కరువి' 'తోలె=చర్మం); 'నరంబుక్కరువి' (నరంబు=తంతి); 'తుళైక్కరువి' (తుళై=కన్నం); 'కంచక్కరువి' (కంచం=లోహం); 'మిత్రుక్కరువి' (మిత్రు=గొంతు) అని అయిదు విధాలుగా విభజించ బడ్డాయి. తమిళ భాషలో 'కరువి' అటే యంత్రం, పనిముట్టు అని అర్థం. గొంతుని కూడ ఇందులో వాయిద్యంగా చెప్పడం సంస్కృత గ్రంథాల్లోని 'గాత్రవీణ' పదాన్ని జ్ఞాపకం చేస్తూంది.

ఈ రోజుల్లో భరతుని నాట్య శాస్త్రంలో చెప్పిన నాలుగు రకాలైన విభజన దేశమంతటా ఆమోదిస్తున్నారు; కాని వాయిద్యాల సంఖ్యా విస్తరణ వల్ల సాంకేతిక దృష్టితో చూస్తే ఇంకా వివరాలతో కూడిన నిశితమైన విభజన అవసరమనిపిస్తోంది. ఆధునికంగా జరిగిన విభజన చూస్తే, ఘన వాయిద్యాలు 16 రకాలుగాను, అవనద్ధవాయిద్యాలు 11 రకాలుగాను, సుషిర వాయిద్యాలు 12 రకాలుగాను, తత వాయిద్యాలు 15 రకాలుగాను కనిపిస్తున్నాయి. ఇంకా ఇందులో ఆధునికంగా వెలువడుతూన్న 'ఎలెక్ట్రానిక్' (electronic musical instruments) సంగీత వాయిద్యాల్ని చేర్చనే లేదు.

పూర్వకాలంలో సంగీత గ్రాంథాల్లోను, ఇతర సాహిత్యంలోను కూడ వాడిన 'వాద్య' పదమే చాల సర్వసామాన్యంగా, స్థూలంగా చేసిన సూచన అని మనం గ్రహించాలి. సంస్కృత గ్రంథాల్లోను, ఇతర సాహిత్యంలోను వాడిన 'అతోద్య', 'తుర్య' పదాలు కూడ వాయిద్య పదానికి సమానార్థకాలే అనిపిస్తుంది.

సంగీతాన్ని సువిశాల దృష్టితో సమీక్షచేస్తే, వాయిద్యాలు, వాటి పూర్వ చరిత్ర ఎందుకు తెలుసుకోవాలి, దాని ప్రాముఖ్య మేమిటి అనేది తెలుస్తుంది. మొట్ట మొదట గుర్తించ వలసిన విషయం, - వాయిద్యాల్ని వదిలేస్తే అసలు సంగీతశాస్త్రంగాని, వ్యాకరణం గాని ఏముంది అనిపిస్తుంది. ఎవరైనా గానం చేస్తుంటే ఆ గొంతులో ఏయే స్వరాలు పలుకుతున్నాయి? అవి ఏయే క్రమంలో ఉన్నాయి? ఆ స్వరాల్లోని గమకాలేమిటి మొదలైన వివరాలన్నిటినీ కొలవడానికి, గుర్తించడానికి మనకి ఏమి సాధనాల్లేవు. ఏదైనా వాయిస్తూంటే పై వివరాలన్నీ స్పష్టంగా మనం గ్రహించగలం.

అందుకోసమే ఒకానొక గ్రంధకర్త, గానం మాటవంటిదైతే, వాయిద్య వాదనం వ్రాతవంటిదన్నారు. ఉదాహరణకు వీణ తీసుకుంటే, వీణ నిర్మాణం ఎలా వుంది? దాని మీద తీగె ఎంత పొడవుండాలి? ఎన్ని తీగెలుండాలి? వాటిని ఎలా సాగించి బిగించాలి? వాటిని ఏ విధంగా శృతి చేయాలి? మెట్లు ఎన్ని ఉన్నాయి? ఏ విధంగా అమర్చి ఉన్నాయి? వీణా వాదనలోని కష్టనిష్ఠూరాలేమిటి? వీణానాదంలోని సంగీతసిద్ధి, రసోత్పత్తి ఎలాంటిది? ఈ విధమైన వివరాలన్నీ శాస్త్రంకాదూ? అలాగే వేణువు నిర్మాణం; ఏ విధమైన వెదురు దాని తయారీకి పనికి వస్తుంది; కన్నాలు ఎన్ని ఉండాలి; వాటి ఏర్పాటు ఎలా చేస్తారు; దాని వాదనలోని విశేషాలేమిటి; వేణు నాదంలోని సౌందర్యం ఎలాంటిది; మొదలైన వివరాలన్నీ శాస్త్ర విషయాలు కావూ? వీణ మీది మెట్లను, వేణువు యొక్క కన్నాలను పరిశీలిస్తే, స్వర మేళాలు, స్థాయిలు, స్వరాంతర పరిమాణాలు మొదలైన ఎన్ని వివరాలు తెలుస్తాయి? అదంతా శాస్త్ర విషయమే గదా! అలాగే ప్రతివాయిద్యం మనకి ఎంతో సంగీత విజ్ఞానాన్నిస్తుంది. భరతుని నాట్యశాస్త్రంలో గూడ ఈ విషయాలు వివరింప బడ్డాయి. ధ్రువవీణ, చలవీణ అనే రెండు వీణలువయోగించి ఆయన సూచించిన ప్రయోగంలో స్వరాలు, స్వరాలతరాలు, గ్రామాలు, గ్రామభేదాలు మొదలైన ఎన్ని వివరాలు మనకు తెలిశాయి? నారదులు వేదంలో వినిపించే స్వరాలకు, ఇతరత్రా వినిపించే వాటికి గల సంబంధాన్ని వేణువు సహాయంతో నిరూపించారు. 17వ శతాబ్దంలోని అహెూబలుడు తన గ్రంథంలో అప్పటికి అమలులోనున్న వీణ మెట్టు, వాటి స్థాన భేదాలు, వర్ణించి నందువల్లనే మనకు ఆ కాలపు స్వరమేళాలు, వాటి అన్యోన్య సంబంధాలు అర్థమయ్యాయి.

రెండో విషయం – ఈ సంగీత శాస్త్రవివరాలే గాక, వాయిద్య నిర్మాణ స్వరూప, స్వభావాలే మన సంగీతాభివృద్ధికి ఎంతగానో దోహదం చేశాయి. ఈ వివరాలన్నిటినీ ఇక్కడ చర్చించడం కష్టం, కాని ఒక్క విషయం చెప్పాలి. 10వ శతాబ్దం వరకు బహుళ వ్యాప్తిగా కనుపించిన 'హార్పు' లేక 'యాళ్' అనే వీణ రకాలు (Harps), ఒక్కసారిగా సంగీత ప్రపంచంలో కనిపించకుండా మాయమైపోయాయి. 'హార్పు' అంటే ఒక స్వరానికి ఒకే తంతి చొప్పున బిగించి, అన్య స్వరాలు ఆ తీగ మీద పలికించడానికి వీలు లేకుండా, అలాంటి 7 లేక 9 తంతులతో ఏర్పాటైన వీణలు ( polychords). అవి వేలితో మీటిగాని, కుణప లేక కోణం (plectrum) అనే త్రికోణాకారపు పలచని చెక్కతో గాని వాయించడానికి అనువైనవి. భరతుని కాలపు ప్రాచీన వీణలలో రుద్రవీణ, కిన్నరి, కచ్ఛపి మొదలైన హార్పువంటి వీణలు మాయమైపోయి, వాటి స్థానంలో సితార్, సరోద్, సరస్వతీ వీణ (monochords) మొదలైనవి వాడుకలోనికి వచ్చాయి. ఇందువల్ల మన సంగీతం శాస్త్ర పరంగాను, వాయిద్య వాదన విధానాల్లోను ఎంతగానో మారిపోయింది.

పై రెండు కాక మూడో విషయం – వాయిద్య నిర్మాణంలో ఏయే వస్తువులు,

పదార్థాలు వాడి తయారు చేస్తారో, ఆ సమాచారమంతా ఆ ప్రజల అభిరుచులు, నైపుణ్యం, సాంకేతిక పరిజ్ఞానం, తద్వారా వారి సంస్కృతిని సూచిస్తుంటుది. కర్రతో చేసిన వాయిద్యాల వల్ల ఆ ప్రజలు ఏ కర్ర ఎరివిగా వాడారు, ఆ దేశంలో ఏ యే రకాల వృక్షాలు పెరుగుతాయి, వాటి ప్రత్యేక లక్షణాలు, మొదలైన అంశాలు తెలుస్తాయి. చర్మంతో చేసిన వాయిద్యాల వల్ల అక్కడ పెరిగే జంతు జాలం, అంటే పశువులు, లేళ్ళు, దుప్పులు, కోతులు, మొసళ్ళు, కణుజాలు, ఉడుములు మొదలైన వాటి చర్మాన్ని ఎలా తయారు చేసి వాడారో తెలుస్తుంది. ఇలాగే వాయిద్య నిర్మాణంలో ఉపయోగించిన లోహాలు, మట్టి, వెదురు మొదలైన పదార్థాల వల్ల ఆ ప్రజ యొక్క నైపుణ్యం, సాంకేతిక పరిజ్ఞానం ఎంతగా వృద్ధి చెందిందో తెలుస్తుంది.

# 2
# సాంస్కృతిక దృష్టి

ఈ వాయిద్యాల తరగతులు, వాటి చరిత్ర తెలుసుకునే ముందు, మన దేశపు సామాన్య నాగరికత, సంగీతం, సంగీత వాయిద్యాలను గూర్చి కొంత చర్చించడం అవసరం. ఇంత వరకు మనం తెలుసుకున్న విషయాన్ని బట్టి అది మరింత ముఖ్యం. వాయిధ్యాల చరిత్ర వ్రాయాలంటే సంగీత గ్రంథాలు మటుకు చదివితే మనకు తెలిసేది చాలా తక్కువ. దేశంలో నివసించే గిరిజనులు, ఆటవికులు, గ్రామీణుల జీవన విధ్యాలు, ఆ దేశ సామాన్య భాషలు, సాంఘికాచారాలు, నిషేధాలు, సంస్కృతి, మార్పులు, ఇంకా ఎన్నో విషయాలు మన ముందుంచుకోవాలి. అప్పుడే సరియైన పరిశీలనకి, పర్యవేక్షణకి తావుంటుంది.

సంగీత వాయిద్యాలని గురించి ఇది ఒక పుస్తకం. కాని సంగీత వాయిద్యాల నిర్వచనమే ఎంత క్లిష్టంగా, అస్పష్టంగా చెయ్యవలసి వచ్చిందో, - వెదురు కర్ర మొదలు ఆధునిక ఎలక్ట్రానిక్ సంగీత వాయిద్యాల వరకు, సంగీతం వినిపింప జేసే వాటినన్నిటినీ, సంగీత వాయద్యాలే అనేశాం; పైగా వాటిలో చాలా వాయిద్యాల ప్రాదుర్భావం, సంగీతానికి సంబంధంలేని పనుల్లోంచి జరిగింది. చాలా వాయిద్యాల ఉపయోగంకూడ అలాగే ఉంది. ఇంక ఈ గ్రంథం విస్తరించకుండా సంక్షిప్తంగా చెప్పడం ఎలాగ? సంగీత వాయిద్యాలు, వాటి చరిత్ర కోసం, మనదేశ సంస్కృతిని గురించి చర్చించడం అవసరం అన్నాం. అసలు 'మనదేశం' అని ఏయే సరిహద్దులలోని భూభాగాన్ని అనాలి? ఏమంటే మూడు, నాలుగు దశాబ్దాల క్రితం 'భారతదేశం' ఈ వేళ రెండు, మూడు రాష్ట్రాలుగా మారింది గద! ఈ విషయం మనసులో గ్రహించకపోతే 'దేశం' అనగానే ఆ దేశ ప్రజలకు ఆ దేశం మీద స్వాభిమానం, భక్తి, జాతీయ దృష్టి ఇంకా అనేక రకాలైన గుణాలన్నీ ఉంటాయి. ఉదాహరణకు ఈ రోజుల్లో హార్మోనియం, వయొలిన్ మన దేశపు వాయిద్యాలనే అనుకుంటున్నాం. కాని ఇవి రెండు పాశ్చాత్య దేశాలనుంచి దిగుమతి అయినవే అని మనలో చాలామందికి తెలుసు. కాని హార్మోనియంలో పలికే ఇత్తడి రేకు లేక బద్ద (reed), - మణిపూరు ప్రాంతాల్లో ప్రచారంలోనున్న 'ఖంగ్' లేక 'రూసెమ్' '(Khung or Rusem) వాయిద్యాలతో వాడే వెదురు లేక ఒక విధమైన చొప్పబద్దల నుపయోగ పరచే పద్ధతి మీద ఆధారపడిందని విచక్షణతో పరిశీలిస్తే తెలుస్తుంది. ఈ బద్దల్ని ఉపయోగించి ఊదే వాయిద్యాలుగా చెయ్యడం కొన్ని వేల సంవత్సరాలనుంచి

మనకు తెలుసు. ఇదే పద్ధతి నుపయోగించి వెదురు బద్దలకు బదులు ఇత్తడి రేకులతో హార్మోనియం వాయిద్యాన్ని పాశ్చాత్యులు తయారుచేసుకున్నారు. ఆ హార్మోనియంను మనం దిగుమతి చేసుకుని, అది పాశ్చాత్య దేశాల్లో తయారైన వాయిద్యం అనుకుంటున్నాం. వాయిద్యాల్నిగురించి ఈ విధమైన అభిప్రాయాలు, అనుసరణలు ఒక దేశం నుంచి మరొక దేశానికి ప్రయాణం చేసి, కొత్తకొత్త మార్పులతో వాయిద్యాలు తమారై, వేరువేరు పేర్లతో ప్రచారం అవుతున్నాయి. మన దేశంలోని వాయిద్యాలు గూడ ఇలాగే ఇతర దేశాల్లోని వాయిద్యాలను చూసి, వాటి ప్రాతిపదికతో తయారైనవనవచ్చు. వాయిద్యాల్ని తయారుచేసిన వారు తమ అహంభావం తృప్తి కోసం ఆ వాయిద్యాల నిర్మాణం 'మా స్వంత బుద్ధి, నైపుణ్యం ఉపయోగించి మేము వాటిని కనిపెట్టేమని' చెప్పడం సాధారణంగా జరిగే విషయం. అలా చూస్తే ఈ హార్మోనియం మన దేశానికి సంబంధించినదా లేక పాశ్చాత్యుల నిర్మాణమా? ఈ విషమం పాఠకులే తేల్చాలి.

సంగీత వాయిద్యాల నిర్మాణం, వాటి ప్రయాణం పైన చెప్పినట్లుగా, ఒక దేశం నుంచి ఇంకొక దేశానికి కన్నుగప్పినట్లు, చల్లగా, అతి తేలికగా జరుగుతూంటుంది ప్రపంచ మొత్తం మీద దేశాల్లోని సంగీత వాయిద్యాలు, వాటి నిర్మాణం ఈ విధంగా మార్పులు చెందుతూనే ఉంటాయి. అందుచేత ప్రతి దేశంలోని సంగీత వాయిద్యాలు, - కొన్ని అక్కడే పుట్టి, వృద్ధి చెందినవి; మరికొన్ని ఇతర దేశాల లేక చుట్టు పక్కల దేశాల్లోని వాయిద్యాలను చూసి, ఆ విధంగా తాము తయారుచేసుకోవడమో, లేక కొద్ది మార్పులతో ఇంకొక వాయిద్యంగా మార్చి, వేరే పేరు పెట్టి, 'ఇది మా స్వంతం' అనడమో జరుగుతూంటుది.

ఇంక సంగీత వాయిద్యాల పుట్టుకకు ఈ రాజకీయ పరమైన దేశాలు, దేశ విభజనలు, భౌగోళిక సరిహద్దులు, పరిధులు ప్రాతిపదికగా పనికి వస్తాయా? పైన చెప్పినట్లు యాభై సవత్సరాల క్రితం మన దేశమనిపించుకునే భూభాగం ఈ వేళ మూడు రాష్ట్రాలుగా మారిందిగద! అయితే ఈ విభిన్న జాతులు, సంస్కృతి మొదలైన వాటి హద్దుల మాటేమిటి?

భౌగోళిక స్థితిని బట్టి, రాకపోకల సౌకర్యాన్ని బట్టి, ఒక దేశంలోని ప్రజలు ఇంకొక దేశానికి వర్తక వ్యాపారాల నిమిత్తం గాని, ఒకొక్క దేశంలోని ప్రత్యేకోపాధుల నాశించి గాని, రాకపోక లేర్పడ్డం, వలసలు వెళ్ళడం మనకు కొత్త విషయమేమీ కాదు. ఇలాంటి సంచారాల్లో ఒక దేశ ప్రజలు ఇంకొక దేశానికి పోతే అక్కడి భాష, ఆ ప్రజల అలవాట్లు, ఆచారాలు, వారు ఉపయోగించే వస్తువులు, దుస్తులు అన్నీ అవశ్యంగా గ్రహిస్తూనే ఉంటారు గద! ఇటువంటి సాంఘిక సంపర్కాల్లో ఒక సంస్కృతి ఇంకొక సంస్కృతి కెదురై, కొంత ఘర్షణకు లోనై, అందులోని మంచి చెడులు, లాభ నష్టాలు ప్రజలకు తెలిసినందువల్ల కొంత జ్ఞానదాయక మవుతుంటుంది. ఉదాహరణకు మన దేశం నంచి అగ్నేయేషియాకు ప్రజలు తరతరాలుగా వలసలు వెళ్ళడం మనకు కొత్త కాదు. ఉత్తర

దిశలో టిబెట్, చైనా మొదలైన దేశాలకు బౌద్ధమత ప్రచారం నిమిత్తం వెళ్ళడం కూడ మనం విన్న విషయమే. భౌగోళికంగా దేశాల సరిహద్దుల్లో మార్పు త్వరితంగా కనబడకపోయినా, జన ప్రయాణాల వల్ల జీవన విధానాలు, అలవాట్లు బాగా దగ్గిరౌతూంటాయి. పెద్ద పెద్ద పర్వత శ్రేణులు, జలాంతర్భాగాలు దేశాన్ని విడదీయగలవు కాని జనప్రవాహాన్ని నిలుపు చేయలేవు. మన కాశ్మీర సంగీతం, నృత్యం దక్షిణ రష్యాలోని సంగీతానికి, నృత్య విధానాలకి దగ్గరగా వుంటుంది. ఇండోనీషియాలోని సంగీతం, నృత్యం, సాహిత్యం, సంగీత వాయిద్యాలు మన దేశ పౌరాణిక గాథల్ని బాగా ప్రతిబింబిస్తూటాయి. అలాగే, ఇది ఒక ఊహే కావచ్చు, ఆఫ్రికా దేశపు ఆటవికులకు, మన దేశంలో వారికి అనేక పోలికలు కనుపిస్తాయి. అందుచేత సంగీత వాయిద్యాల విషయ పరిశీలన కోసరం, మన దేశ సరిహద్దులు లేక సాంస్కృతిక సరిహద్దులు, ఈ క్రింద వివరించినట్లు నిర్ణయించి, ఆమోదిస్తే బాగుంటుంది. ఉత్తరాన హిమాలయాలు, ఆఫ్గన్ పర్వతాలు, పడమరసింధు నదీ ప్రాంతం; తూర్పున మేఘాలయ పర్వతాలు; దక్షిణాన హిందూ మహాసముద్రం, దానిలోని ద్వీపాలు, ద్వీపకల్పాలు అన్నీ కలిసి ఉండాలి. ఈ సరిహద్దుల మధ్యనున్న విభిన్న జాతుల సంచలనాల వల్ల, వారి విభిన్న సంస్కృతులను ఇతర సంస్కృతులతో పోల్చి చూసుకోవడం, ఇతరుల మంచిని కొంత గ్రహించడం, తమ మంచిని కొంత ఇతరులకు పంచి పెట్టడం జరుగుతూనే వచ్చింది

మన దేశంలో ఆదిమ నివాసులైన వారిని గురించి తెలుసుకునే ఆధారాలేమీ లేవు. ఆఫ్రికాలో నీగ్రో జాతుల వలెనే వీరు కూడ ఉండేవారేమో! వాళ్ళ సంగీతాన్ని గురించి గాని, సంగీత వాయిద్యాల్ని గురించిగాని మనకేమీ తెలియదు. ఆఫ్రికా దేశంలోని నీగ్రో జాతి వారికి, మన దేశంలోని ఆదిమానవుల సాంఘికాచారాల, పోలికలు, వ్యత్యాసాలు గురించి ఇంతవరకు ఏ విధమైన పరిశోధనలు జరిగినట్లు లేదు. జాతులు, జాతి లక్షణాలు మనకు తెలియకపోయినా, మన దేశ ద్రవిడుల భాషల నుంచి, ఆఫ్రికాలోని 'వాలోఫ్' జాతి (Wolof) వారి భాష నుంచి కొన్ని సామాన్య పదాలు ఈ క్రింద సూచించబడ్డాయి :

| | వాలోఫ్ (Wolof) | ద్రావిడ భాషలు |
|---|---|---|
| వ్రేలు | బరమ్ లేక వరమ్ | బెరల్ (కన్నడ)<br>విరల్ (తమిళం) |
| కాలు | యేల్ | కాల్ (కన్నడ, తమిళం, తెలుగు) |
| వంకాయ | బతన్నే | బదనే (కన్నడ) |
| కుండ | వన | పానై (తమిళం) |
| ఏనుగు | నై | ఆనై (తమిళం)<br>ఆనె (కన్నడ) |

ఈ పదాలు ఉదాహరణకు మాత్రం చెప్పినవి. ఇలాంటివి ఇంకా చాలా మాటలున్నాయి.

అయితే మనకి కావలసిన ముఖ్య విషయ మేమంటే, ఈ భూభాగంలోని కొన్ని సంగీత వాయిద్యాల పోలికలు. ఆఫ్రికాలోని రువాండా ఉరుండి, బెల్జియన్ కాంగో, ప్రాంతాల్లోని సంగీత వాయిద్యాలలోని పది వాయిద్యాలైనా మన దేశంలోని మధ్యప్రదేశ్, ఒరిస్సా, ఆంధ్ర రాష్ట్రాల్లోని వాయిద్యాలు మాదిరిగా తయారయినవే. ఈ పోలికల్ని చూస్తే మన దేశ ప్రజలకు, ఆ ప్రజలకు ఏవైనా సాంస్కృతిక సంబంధాలు ఉండేవా? లేక అది మన ఊహాగానమేనా? ఒకానొకప్పుడు ఇదంతా ఏక సంస్కృతిగా వుండి, ఆ తర్వాత ఏవైనా భూకంపాలు, జల ప్రళయాల వంటి సంక్షోభాల వల్ల ఆ సంస్కృతి విడిపోయి చీలిపోయిందా? మనకు తెలిసినంత వరకు 'లెమూరియా' అని (Lemuria) చెప్పబడిన భూభాగం ఆఫ్రికా దేశాన్ని, దక్షిణ భారత దేశాన్ని కలుపుతూ, తూర్పునున్న ఆస్ట్రేలియా వరకు వ్యాపించి, కొన్ని లక్షల సంవత్సరాల క్రితం ఉండేదని కొంతమంది చరిత్రకారుల నిర్వచనం. కాని ఆ రోజుల్లో ఆ ప్రజలు ఒకచోట నుంచి ఇంకొక ప్రదేశానికి ప్రయాణాలు, వలసలు వెళ్ళడం ఎరుగరేమో! ఈ భూభాగాలు ఏదో ప్రళయం వల్ల విడిపోయిన తర్వాతనైనా ఆ ప్రజలు కొంతమంది సముద్రయానం చేసి మన దేశాన్ని చేరుకున్నారా? లేకపోతే ఈ సంగీత వాయిద్యాల పోలికలు ఎలా సమర్థించడం?

తర్వాత ముఖ్యమైన విషయం మన ద్రవిడుల నాగరికత, సంస్కృతి. కాని ఈ ద్రవిడ నాగరికత, సంస్కృతుల గురించి నిర్వివాదమైన ఏకాభిప్రాయం ఏమీ లేదు. ఆఫ్రికాలోని ఆదిమ నివాసులకు, మన దేశపు ఆదిమానవులకు భాషల్లోని కొన్ని సామాన్య పదాలు, సంగీత వాయిద్యాల్లోని పోలికలు పైన చూశాం. ఒక అభిప్రాయం ప్రకారం, క్రీస్తుకు పూర్వం కొన్ని వేల సంవత్సరాల క్రితం, కొంతమంది ఆఫ్రికాదేశం నుంచి సముద్రయానం చేసి, మన దేశం చేరుకుని, ఇక్కడి ఆదిమ నివాసులతో కలిసిపోయిన నాగరికతే ఈ ద్రావిడ నాగరికత అని తెలుస్తుంది. ఇంకొక అభిప్రాయంలో, ఇలా వలస వచ్చినవారు మధ్యధరా ప్రాంతం నుంచి వచ్చారని అంటారు. ఇదీ అదీ కాదు, ఆర్యులు వచ్చి, ఆదిమ వాసులైన మన దేశ ప్రజలతో కలియడం వల్ల ఈ ద్రావిడ నాగరికత ఏర్పడిందని మరికొందరి అభిప్రాయం. ఆఖరి మాటగా ఈ ఆర్యులు, ద్రవిడులు అనే భేదాలు, పోలికలు అంతా వట్టి మాయ, ఊహాగానం మాత్రమేనంటారు కొంతమంది.

ఇన్ని విభిన్న దృక్పథాలు గల ఈ విషయాన్ని, మన అవగాహన కోసరం, రెండు రకాలైన నాగరికతల్ని మాత్రం మనం గుర్తుంచుకుంటే చాలు. ఒకటి, సింధునదీ ప్రాంతం నుంచి, కిందుగా వ్యాపించి ఈ ద్వీప కల్పంలోను, ఆగ్నేయాసియాలోని ద్వీపల్లోను కనిపించే ద్రవిడ నాగరికత, సంస్కృతులు. రెడు, వేద ప్రమాణ ప్రాతిపదికతో బయలుదేరి ఈ నాటి వరకు ఒక అఖండ జ్యోతి వలె వెలుగుతూన్న మన ఆర్య

సాంప్రదాయ నాగరికత, సంస్కృతులు.

సింధు ప్రాంత నాగరికత మొదటిసారిగా 'మొహంజదరో', 'హరప్ప'ల వద్ద గుర్తింపబడినప్పటికీ, ఇప్పుడది ఇతర ప్రాంతాలకు కూడ వ్యాప్తమై క్రీస్తు పూర్వం మూడు వేల సంవత్సరాల నాటిదని తెలుస్తూంది. ఈ త్రవ్వకాలలోని బొమ్మల్లో మనకు తాళాలు, తప్పటలు, ఋడబుడక్కల వాళ్ళ 'ఢమరు' వంటి చిన్న వాయిద్యం, మట్టితో చేసిన బూరాలు, ఒక రకమైన 'హార్పు' వీణల వంటివి కనిపిస్తున్నాయి. కాని ఈ నాగరికతకు మన దేశపు ఆదిమ వాసుల నాగరికతకు ఏ రకమైన సంబంధముండేదో లేక అవి రెండూ కలిసి ఏకమైపోయాయో అప్పుడు మన మూహించుట కాధారాలేమీ లేవు. కాని క్రీస్తుశక ప్రారంభ దశ నుంచి మనకు పరిచితాలైన తమిళ గ్రంథాల్లో 'యాళ్' (Yazh) వీణ, 'కుళళ్' (Kuzhal) వేణువు, 'మద్దలం' (Maddalam) డోలు మాత్రం పేర్కొనబడ్డాయి. ఈ యాళ్ వీణ గ్రీకుల వీణ వంటిదని కొందరి అభిప్రాయం. ఏమైనా అది పరిశోధించవలసిన విషయం.

ఆర్యులు మన దేశానికి రావడం మాత్రం మన దేశ చరిత్రలో చాలా ముఖ్యమైన ఘట్టం. క్రీస్తుకు పూర్వం రెండు వేల అయిదు వందల సంవత్సరాల క్రితం వచ్చేరని చెప్పుకునే ఆర్యుల వేద సాంప్రదాయం, మన దేశాన్ని, అతః పూర్వ సాంప్రదాయాల్ని ఎంతగానో మార్చివేసిందని చెప్పాలి. అటు క్రితమందుండిన ఈ దేశపు ప్రజల జీవన విధానాలు, సాహిత్యం, మతం, కళలు అన్నీ గూడా వేద ప్రభావితాలై ఎంతో ఔన్నత్యాన్ని, నాగరికతని పుంజుకున్నాయి. వేద సంహితలన్నీ మానవ జీవన విధాల వర్ణనలే. ఉదాహరణకు మన సంగీతం ఋగ్వేద, సామవేద జనితమని చెపుతారు. నిజం కూడ అలాగే కనుపిస్తుంది. సామవేద పఠనాన్ని సామగాన మన్నారు. సుస్వర బద్ధమైన ఈ సామగానం ఎంతో రంజకమైన, అతి పురాతన గానం అనవచ్చు. అయితే మధ్య ప్రాంతంలోని కొన్ని దేశాల్లోని గానం కూడ ఈ విధంగానే వినబడుతుంది. ఈ ఆర్యుల సామగాన పద్ధతి వారి ప్రత్యేక సృష్టి లేక విధానం అని చెప్పడానికి మనకి ఆధారాలేమీ లేవు. వీరీ పద్ధతిని ఇతర సాంప్రదాయాల నుంచి గ్రహించినదేమో! ఏమైనా ఆ సాంప్రదాయం ఆర్యుల ద్వారా మన దేశంలో ప్రవేశించి, మన జీవన విధానంతో పెనవేసుకునిపోయి మనదై పోయింది. ఇలా ఇతర సాంప్రదాయాల నుంచి విషయాల్ని గ్రహించే, ఒక దేశ సంస్కృతి ముందుకు పయనిస్తూంటుందని మనకు తెలుసుగద!

ఇంక మన విషయానిక వస్తే, వేద సంహితల్లో ఆ రోజుల్లో ఆ ప్రజలు, పూజా పునస్కారాల్లో, ఉత్సవ సందర్భాల్లో, సంగీత నృత్యాల్లో ఉపయోగించిన సంగీత వాయిద్యాలు అనేకంగా పేర్కొన బడ్డాయి : (1) 'అఘటి' అంటే తాళాలు; (2) 'భూమి దుందుభి', 'దుందుభి', 'వనస్పతి' మొదలైన డప్పులు; (3) 'తూనవ', 'నాడి' మొదలైన వేణువుల రకాలు; (4) 'వన', 'కఃద', 'గోధ' మొదలైన వీణ రకాల వాయిద్యాలు. ఈ వాయిద్యాల్ని వారు ఎలా నిర్మించారో, వాటిలో రెండు, మూడు

తప్పిస్తే, వాటిని ఎలా ఉపయోగించారో తెలుసుకోవడానికి మనకి వర్ణన లేమీ లేవు. ప్రస్తుతం మనం వాడే వాయిద్యాలకి వీటికి ఏమీ పోలికలు లేవని తెలుస్తోంది. పైన చెప్పిన పేర్లన్నీ నామ మాత్రాలుగానే మిగిలి పోయాయి. అయితే ఈ నామాల్లోని పోలికలు మాత్రం ఆర్యుల నాగరికతలో ఇతర ఆసియా సాంప్రదాయాల ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. ఉదాహరణకు వీణ అనే సంస్కృత పదానికి, పురాతన ఈజిప్షియన్ భాషలోని పదం, 'బిన్టు' (Beent). సుమేరియన్ భాషలోని పదం 'గిస్బన్' (Gisban). జపానీయుల భాషలో అది 'బివా' (Biwa) అయితే, చైనీయుల కది 'పిపా' (Pipa) అయింది. ఈ రకమైన పోలికల్ని ఊరికే ఆషామోషీగా తోసిపారవేయ వలసిన విషయం కాదు.

ఉత్తర భారత దేశము మీదికి, పెర్షియనులు, మంగోలు జాతి సైన్యాలు దాడులు, జరిపిన కాలంలో మన దేశమున కొక వినూతనమైన అనుభూతి, చైతన్యము కలిగాయి. అట్రుకితం మన దేశవాసులకు ఆయా దేశాలతో వాణిజ్య, మత పరిచయాలు లేకపోలేదు. కాని ఈ దాడులు జరిగిన తర్వాత వారిలో కొంత మంది మన దేశంలో నివసించడం జరిగింది. వారి ద్వారా మన సంగీతం, సంగీత వాయిద్యాలు కొన్ని మార్పులకు లోనైయాయని తెలియవచ్చింది. అటు తర్వాత వచ్చిన శిల్పాల్లోను, బొమ్మల్లోను కూడా మన దేశపు సంగీత వాయిద్యాలు, మధ్యేషియాలోని వాయిద్యాలు ఒకే మాదిరిగా చిత్రింపబడడం, సంగీతంలో కూడ సామాన్య పదాలు వాడుతూండడం జరిగింది. పదకొండవ శతాబ్దం నాటికి ఆ ప్రభావం మరింత స్పష్టంగా మహమ్మదీయ సాంప్రదాయం వలె నున్న ఒక ఛాయ (Islamic influence) తెలియవచ్చింది. అయితే దీనిని 'సూఫీతత్వ వ్యాప్తి' అనాలి కాని మహమ్మదీయ లేక ఇస్లాం సాంప్రదాయమని చెప్పలేము. మన పురాణ గాథల్లో ప్రత్యేకించి చెప్పబడిన డమరు, వీణ, వేణువు వంటి వాయిద్యాల్ని 'అవి మన దేశపు వాయిద్యాలే' అని గుర్తించగలం. కాని పై చెప్పిన దాడుల తర్వాత మన సంగీత లోకంలో 'దాఫ్' (Daff), 'సితార్' (Sitar), 'శహనాయ్' (Shehanai) మొదలైన వారి వాయిద్యాలు మన దేశంలో చోటు చేసుకుని, వ్యాపించడం జరిగింది. కాని, కొన్ని ఇతర దేశస్థుల వాయిద్యాలు మన సంగీతంలోకి ఎలా ప్రవేశించాయో, అలాగు ప్రత్యేకంగా మన దేశపు వాయిద్యాలు అనిపించుకునేవి ఇతర దేశాలకు ప్రయాణం చేశాయి. వర్తక, వాణిజ్యాల కోసం ఇతర దేశాలకు పోయిన మన దేశస్థుల ద్వారాను, బౌద్ధమత ధర్మ ప్రబోధం కోసం వెళ్ళిన వారి ద్వారాను మన దేశ సంగీత వాయిద్యాలు తూర్పు దేశాల్లో బాగా వ్యాపించాయి. అలాగే మధ్యధరా ప్రాంతానికి కూడ చేరుకున్నాయి. విల్లు ప్రాతిపదికగా వుండే వాయిద్యాలన్నీ కూడ మన దేశం నుంచి వ్యాపించినవే అని బహుదేశ పండితాభిప్రాయం. 8వ శతాబ్దం నుంచి 15వ శతాబ్దం వరకు యవద్వీపం, సువర్ణద్వీపం, అంటే ప్రస్తుత ఇండోనీషియా దేశం మన దేశపు నాగరికత ననుసరించి తమ కళాజీవనాన్ని దిద్దుకంది. ఆ దేశంలోని

కొన్ని సంగీత వాయిద్యాల పేర్లు ఇలా వున్నాయి : (1) 'పడహ' (సంస్కృం=పటవా); (2) 'మురవ' (సంస్కృతం=మురజ; తమిళ్=మురసు); (3) 'వంగ్సి' (సంస్కృతం=వంశి); కాహల, ఘంట, భేరి మొదలైన పేర్లు ఇంకా ఉన్నాయి.

ఈ రోజుల్లో పాశ్చాత్య దేశాల్లో మన సితార్, తబ్లా వాయిద్యాలు బహు ప్రచారంలో ఉన్నాయి. పాశ్చాత్య దేశాల సంపర్కం వల్ల మన సంగీతంలో అనేక మార్పులు వచ్చాయి గాని అదంతా ప్రస్తుతం మనం ఇక్కడ చర్చించడం సమంజసం గాదు. కొన్ని నిజాల్ని గుర్తించి, పేర్కొనడం మాత్రం అవసరం. వారి సంగీత వాయిద్యాలు మన దేశంలో బాగా చోటు చేసుకున్నాయి. వయొలిన్, హార్మోనియం, బ్యాండ్ మేళములోని (band troupes) వివిధములైన వాయిద్యాలు, క్లారినేట్, బాగ్పైప్, మొదలైన వాయిద్యాలన్నీ మనవారికి స్వాధీనమయ్యాయి. ముఖ్యంగా వయొలిన్, - విల్లునుపయోగించే పద్ధతి మనదేశంలో పుట్టిన అభిప్రాయమేనైనా ఆ విల్లుపయోగంతోనే తయారైన వయొలిన్ మనవారు వాడడం మొదలుపెట్టారు. సుమారు ఒక శతాబ్దానికి పూర్వం, మద్రాసు ఫోర్టుసెంట్ జార్జిలో పని చేసే బ్యాండ్మేళమువారి వద్దనుంచి, ఈ వయొలిన్ వాయిద్యమును, బాలుస్వామి దీక్షితులు అనే ఆయన గ్రహించి, దాని నభ్యసించి, దానిపై మనకర్ణాటక సంగీతమును వాయించుట ఆరంభించినట్లు తెలియవస్తూంది. బాలుస్వామి దీక్షితుల వద్ద ఈ వయొలిన్ వాయిద్యంలో శిక్షణపొందిన వడివేలు అనే విద్వాంసుని, తిరువాన్కూరు మహారాజావారు ఆయన పాండిత్యానికి సంతోషించి, దంతపు వయొలిన్తో ఆయన్ని బహూకరించినట్లు తెలుస్తూంది. అలాగే క్లారినెట్ (Clarionet) వాయిద్యంగూడ, - అది బ్యాండుమేళంలోని వాయిద్యమైనా, - మనవారు అలవాటుచేసుకుని లలితమైన పాటలకు, తదితరమైన జానపద గేయాలకు ఉపయోగించేవారు. క్లారినెట్ వాయిద్యంలో స్వరాలు పలికించడానికి మీటలు (keys) నొక్కి వాయించాలి. క్రమేపీ, దానితో శాస్త్రీయ సంగీతం కూడ వాయిస్తున్నారు. మీటలుపయోగించే క్లారినెట్ వాయిద్యంలో, హార్మోనియంలోవలె కేవలం వట్టి స్వరాలు పలుకుతాయి కాని శాస్త్రీయ సంగీతం పలికించడం కష్టసాధ్యం. రాను రాను, నాదస్వరంలోని కన్నాల్ని వేళ్లతో కప్పి వాయించినట్లు, క్లారినెట్ కన్నాల్నికూడ కావలసినంతగా మూసి, తెరిచి వాయిచడం వల్ల సాంప్రదాయశుద్ధమైన శాస్త్రీయ సంగీతాన్ని వాయించడం కూడ నేర్చుకున్నారు.

హార్మోనియం వాయిద్యం వెల తక్కువగా వుండి, సులువుగా నేర్చుకునేదే కాకుండా, సులభంగా ఒక చోట నుంచి మరో చోటికి తీసుకుపోవడానికి వీలైన వాయిద్యం. ఆ కారణాల చేత ప్రజలు దాని నతి సులువుగా నేర్చుకుని, లలిత సంగీతం, జానపద సంగీతాల్లోను, హిందూస్థానీ సంగీతంలో కూడా ఉపయోగించడం మొదలుపెట్టారు. కాని కర్ణాటక సంగీతానికి దాని వినియోగం బహు తక్కువై పోయింది. పైన చెప్పినట్లు, శాస్త్రీయ మైన, గమక సాంప్రదాయ సంగీతానికది అట్టే ఉపయోగించలేదు. అదీకాక

హార్మోనియంలోని స్వర విభజన పద్ధతి పాశ్చాత్యుల పద్ధతి (equal tempermental scale) ననుసరించినది. అందువల్ల దానిలో మన సాంప్రదాయ స్వర విశేషాలు, గమకాలంకారాలు వాయించుట కంతగా పనికి రాలేదు.

పాశ్చాత్య సంపర్కం వల్ల మన కేర్పడిన కొత్త దృక్పథం 'వాయిద్య గోష్ఠు'లని చెప్పాలి. అది మనకు ఏమీ కొత్త విషయం కాదు. కాని పాశ్చాత్య సాంప్రదాయం ప్రకారం, వందల కొలది వాయిద్యము లుపయోగించిన ప్రత్యేక కచ్చేరీలు (orchestras) చేయడం, వాయిద్య వివిధ నాద విశేషాల్ని ఏకీకరణ చేసిన (harmonized) సౌందర్యాన్ని ప్రదర్శించడం, మన సాంప్రదాయానికి కొంత విరుద్ధమని చెప్పాలి. మన సంగీత మంతా భక్తి మార్గంతో నాదోపాసన చేసి, ఒక భక్తుడు తాను తరించి, ఇతరులను తరింప జేయుట కేర్పాటైన విధానం. అందువల్ల మన దేశంలో, పాశ్చాత్య దేశములలో వలె, గోష్ఠిగానములు, ప్రత్యేక వాయిద్య కూటముల కచ్చేరీలు (chorus singing and orchestral performances) విరివిగా ప్రచారం కాలేదు. వాయిద్య కూటముల కొరకు మన దేశములో ప్రత్యేక రచన లేమీ లేవు (orchestral compositions).

అయినా వాయిద్య కూటాలు మన దేశానికి కొత్త విషయమేమీ కాదు అని చెప్పడానికి అనేక నిదర్శన లున్నాయి. ఒకానొక సమయంలో 'కూటప' అనే పేరుతో వాయిద్య కూటము లుండేవి. క్రీస్తు పూర్వం 200 సంవత్సరముల నాడు, భరతుడు తన నాటకానికి తాను వాయిద్య కూటప విన్యాసముల నుపయోగించినట్లు చెప్పబడింది. ఈ గోష్ఠిలో వీణలు వాయించే వారే విధంగా కూర్చోవాలో, తాళ వాయిద్యము లెట్లమరవలెనో, పాడే వారెక్కడ నుంచి పాడ వలెనో సవిస్తరంగా చెప్పబడింది. ఇటువంటి గోష్ఠులు మనకు కొత్త కాదు. 'పంచమహాశబ్ద' వాయిద్య గోష్ఠి భగవత్సాన్నిధ్యంలో ఆయన్ని సేవించుటకు పయోగించే వారు. ఈ పంచ వాయిద్యగోష్ఠు లీనాటికి గూడ కర్ణాటక, ఒరిస్సా, కేరళ రాష్ట్రములలో ప్రచారంలో వున్నాయి. పంచ వాయిద్యము లంటే - (1) కొమ్ము; (2) శంఖము; (3) ముఖవీణ లేక మొహారి (oboes); (4) ఢోలక్, తిమిల, ఇడక్క మొదలైన తాళ వాయిద్యాలు; (5) ఝాంజ్ లేక తాళాలు (Cymbals). ఇవి భగవంతని పూజా సమయంలో ఉపయోగించేవి. ఇవికాక తమిళనాడులో 'నయ్యాడి' మేళం, కర్ణాటకలో 'కరగ' మేళం ప్రచారంలో వున్నవే. ఈ రోజుల్లో వివాహాది శుభ కార్యములకు విస్తారముగా బ్యాండు (band troupes) మేళముల నుపయోగించుచున్నారు గద! అయినా, ఆకాశవాణి వంటి కళాపోషక సంస్థలు వాయిద్య గోష్ఠులను ప్రత్యేక శ్రద్ధతో నేర్పరచి, 'వాద్యవృంద' అనే పేరుతో కార్యక్రమాలు నిర్వహిస్తూ బహుళ ప్రచారంలోకి తెచ్చినారని చెప్పక తప్పదు. మిలిటరీ బ్యాండు మేళములు తప్ప, ఇతర బ్యాండు మేళములన్నీ కూడా మన దేశీయ సంగీతాన్ని వాయిస్తున్నారు. కాని ఈ విషయంలో పాశ్చాత్య దృక్పథం వేరుగా వుంది. వారు వాయిద్య

గోష్ఠులను కేవలం పాశ్చాత్య సంగీత కచ్చేరీల కొరకు ఏర్పాటు చేసుకున్నారు. పాశ్చాత్య సంగీతం చాలా భాగం స్వర సముదాయాల్ని వేర్వేరు వాయిద్యములలో వాయించడం, వేర్వేరు శృతుల మార్పుతో (shift of tonic note) వాయించడం, అవి అన్నీ కలిసి ఒక ఆహ్లాదకరమైన, సుందరమైన నాద విశేషంతో 'ఏకీ కృతగీతము'గా (harmonized music) రంజింప చేయడాని కేర్పడిన పద్ధతి.

మన దేశములో స్వర మేళ పద్ధతి, 'షడ్జపంచమ' భావము, 'షడ్జమధ్యమ' భావముల వల్ల ఏర్పర్చం చేత, మన సంగీతంలోని స్వరాలు అతి శుద్ధమైన నాద సౌందర్యంతో, శ్రోతల కనిర్వాచ్యమైన ఆహ్లాదాన్ని, ఆనందాన్ని ప్రసాదిస్తూంటాయి. పాశ్చాత్యు లివిషయంలో, శుద్ధమైన స్వరాల్ని కొద్దిగా మార్చి, వేర్వేరు వాయిద్యములు కలిసి వాయించునపుడు రంజకత్వమున కనుకూలముగ నుండునట్లు (harmonized or equal tempermental scale) పవరించుకొన్నారు. మన సంగీత మందట్లు గాక శుద్ధమైన స్వరములు, గమక విశేషములతో కూడి రాగాలాపన కత్యంతాను కూలములై, ఆనందదాయకము లవుతున్నాయి. మన సంగీతంలోని స్వరాలంకారాలు, నాద సౌందర్యం, పాశ్చాత్యుల పద్ధతికి కొంత వ్యతిరేకంగా ఉంటుందని చెప్పాలి.

పాశ్చాత్య ప్రభావం కొన్ని విధాలుగా మనకి మేలు కూడ చేసింది. మన దేశంలో కూడ వాయిద్య గోష్ఠులు తయారై అనేక ప్రయోజనాలు పొందుతున్నాయి. కేవలం భక్తి ప్రధానంగా విలసిల్లిన మన సంగీత మిపుడు, సినిమాలలో పాటలకు, కథ, కథన సందర్భాల్లోను, సన్నివేశాల్లోను, రంజకమగు కల్పనలతో నాటకీయతని పోషించడానికి, అక్కడక్కడ నైసర్గికమైన విషయాల్ని కూడ సంగీతముతో చిత్రించడానికి ఈ వాయిద్య మేళములు చాలా ఉపయోగకరము లయాయి. ఉదాహరణకు : అశనిపాతం, ఘూకంపాలు, వర్షపాతం, పక్షుల కూతలు, అరణ్యక ధ్వనుల చిత్రణ మొదలైన అనేకానేక సందర్భాల ప్రదర్శనానికి ఈ వాయిద్య గోష్ఠులు చాల ఉపయోగంగా వుండి ప్రచారంలోకి వచ్చాయి.

మన సాంస్కృతిక దృష్టిని గురించిన ఈ చిన్న సమీక్ష, మన సాంఘిక జీవితంలోని వైవిధ్యము, దానితో పాటు కలిసిపోయిన నాగరికతను పెంపొందించే లక్ష్యాన్ని జ్ఞాపకం చేయాలనే కోరికతో చేసిన సమీక్ష. ఈ లక్ష్య సిద్ధికోసం మన దేశపు విభిన్న జాతులు ఎంతెంతగా తోడ్పడి, పురోగమనానికి దోహదాలవుతున్నాయో తెలుసుకోవడం మన కవశ్య కర్తవ్యం గద! నాగరికత, సంస్కృతులు ఎంత అనాది సిద్ధంగా మనవైతే అంత ప్రత్యేక దృష్టితో వాటిని సంరక్షించుకోవడం మన విధి గద!

# 3
# ఘన వాయిద్యములు

లోపల గుల్ల లేకుండా లేక కాళీస్థలం లేకుండా, గట్టిగా వుండే వాయిద్యాలు ఘన వాయిద్యాలు (idiophones). మొదటి ఘన వాయిద్యం, ఇదివరలో చెప్పినట్లు, మన శరీరమే. దానితో మనం పాడేటపుడు గొంతును, నోటిని, చేతులను ఉపయోగిస్తున్నాం. నృత్యంలో కాళ్ళతో తాళానికి సరిపడే అడుగులు వేయడం, చేతులతోను, ముఖంలోను హావ భావ ప్రకటన, నవరసాల ప్రదర్శన మొదలైనవి జరుగుతాయి. వేద పఠనంలో గూడ 'గానక' అని చెప్పబడే ఒక వ్యక్తి, కరతాళముతో వేద పఠన గమనాన్ని సూచిస్తూ, పఠన గోష్ఠిలోని వాదని వేదంలో చెప్పబడిది. ఈ రోజుల్లో నాదస్వర మేళాల్లోను, బ్యాండు మేళాల్లోను ఒక వ్యక్తి తాళం సూచించడానికి ఉంటాడని మనకు తెలిసిన విషయమే ఇంక చేతులు తప్పిస్తే, పాటలు పాడేటప్పుడు కాల గమనాన్ని సూచించడం, కర్రతోనో, రాతితోనో, లోహంతో చేసిన వాయిద్యాలతోనో ఆదిలో జరిగి వుండవచ్చని మనం ఊహించుకోగలం. అలాగ అనాదిగా తాళగమన సూచన కోసం ఉపయోగించిన వాయిద్యాలు ఘన వాయిద్యాలే.

ఘన వాయిద్యాల్లో నాదం - కంచుతో తయారైన తాళాలు, ఘంటల్లోను తప్ప - నిలిచి వినిపించదు. నాదం నిలిచి వినిపిస్తే దానిలో స్వరస్థాయి, స్వరరంజకత్వం ఉంటాయి. జలతరంగం, కాష్ఠతరంగం మొదలైన వాయిద్యాల్లో నాదం కొద్దిగా నిలిచి వినిపిస్తుంది గనుక వాటితో పాటలు, ఇతరమైన సంగీతం వాయించవచ్చు.

ఘన వాయిద్యాల్లో అతి సామాన్యమైన వాయిద్యాలు కర్రలు, గుండ్రటి రింగులు, గజ్జెలు, మువ్వలు, చప్పుళ్ళు చేసే వాయిద్యాల్ని ముందర చెప్పాలి. గట్టి వెదురు కర్రకు రంగు వేసిగాని, వెయ్యకుండా కాని కోలాటంలో ఉపయోగిస్తారు. కాని కర్రలకి ఓ వైపున చిన్న మువ్వలు కూడ కడతారు. ఈ కోలాటం వెదురు కర్రకి 'దండ' అని, 'దండి' అని, 'కోలు' అని పేర్లున్నాయి. ఈ కోలాటాన్ని అనేక రకాలుగా మన ఆంధ్ర, కర్ణాటక, కేరళ, తమిళ్‌నాడు, గుజరాత్ రాష్ట్రాల్లో బహుళ ప్రచారంగా మనం చూసే నృత్య విశేషమే. గుజరాత్‌లో దీనిని 'దండియారాస్' (Dandirya Ras) అనే పేరుతో కోలాట నృత్యం చేస్తారు.చాలా మంది కలిసి, పైనుంచి తాళ్ళు వేళ్ళాడతీసి, పాటపాడుతూ, ఒక్కొక్కళ్ళు కర్రతో ఇంకొక పక్కనున్న కర్రను కొట్టి తాళం వేస్తూ, పైనుంచి వేళ్లాడే తాళ్లను వింతైన జడలు మాదిరిగా అల్లి, తిరిగి పాట పాడుతూనే ఆ అల్లిన జడను

విప్పేస్తారు. ఈ దండియారాస్ కోలాట నృత్యంలో దీన్నే తమిళనాడులో 'పిన్నల్ కోలాటం' అంటారు. (చిత్రం : 2)

కేరళ రాష్ట్రంలో 'ఓణం' ఉత్సవాల్లో 'విల్లుకొట్టు' లేక 'ఓణవిల్లు' తయారు చేసుకుని దాంతో ఆడతారు. సన్నటి కొబ్బరి మట్టను విల్లు మాదిరిగా వంచి, విల్లులో తాడుకు బదులుగా వెదురు కర్ర కట్టి, అది ఒక చేత్తో పట్టుకుని, ఇంకొక వెదురు కర్రతో దీన్ని కొడుతూ పాటపాడుతూ ఒక నాట్య విశేషాన్ని చేస్తారు.



2. కోలు లేక దండ

కాశ్మీర్‌లో 'లద్దిషా' పాటలు పాడే వారున్నారు. మన వాహ్యాళికోసం ఉపయోగించే వంపున్న చేతికర్ర వంటి ఇనప పూచకి వంపుకు కొంచెం అవతల అడ్డంగా ఒక కర్ర ముక్క బిగించి, ఆ మధ్య స్థలంలో లోహపు చక్రాలు చిన్నవి అమరుస్తారు. పాట పాడుతూ కర్ర ఊపితే, తాళాని కనుకూలంగా ఓ ఇంపైన ధ్వని వినిపిస్తుంటుంది. దీన్నే 'దహారా' లేక 'లద్దిషా' (Dahara or Laddishah) వాయిద్య మంటారు. ఉత్తర భారతదేశంలో బిచ్చగాళ్లు 'చుడియా' (Chudiya) అనే ఇంకొక వాయిద్యాన్ని వాయిస్తూ, పాటలు పాడుకుంటూ వస్తారు. ముంజేతిలో రెండు, మూడు లోహపు చక్రాలు తగిలించుకొని, చేతిలో ఒక కర్ర ముక్కుచ్చుకుని, వెనక దెబ్బతో ఆ ముంజేతిలోని చక్రాల్ని కొడుతూ, పాటలు పాడతారు. లోహం తాలూకు ఒక రకమైన జల్లినాదం విన సొంపుగా వినిపిస్తూంటుంది ఈ పాటల్లో.

ఇంకా ఇలాంటి వాయిద్యాలు ఏ రకానికి చెందనివి కొన్ని ఉన్నాయి. అస్సాం రాష్ట్రంలో 'ఆవోనాగు' లనబడే ఒక జాతి గిరిజనులు పయోగించే 'సాంకాంగ్' (Song Kong) అనే వాయిద్య విశేషముంది. దీన్నే 'బంగ్‌టేన్' లేక 'షేకు' అను కూడ అంటారు. సుమారు **37** అడుగుల పొడుగు, **4** అడుగుల చుట్టు కొలత గల లావుగా, గుండ్రంగా వున్న, బాగా ముదిరిన కర్ర మొద్దుని ఓ వైపున ఎంతో శ్రమపడి తొలుస్తారు. తొలిచిన ఆ కర్ర మొద్దు అర్ధ చంద్రాకారంలో అంచుల దగ్గర కొంచెం పల్చగాను, లోపల మొద్దు లాగా ఉంటుంది. ఈ గిరిజనులలో ఒక ఆచారం ఉంది. బ్రహ్మచారులు, అవివాహితులు అయిన యువకులంతా 'మూరుంగ్' (Moorung) అనే ఒక ప్రత్యేక స్థలంలో పడుకుంటారు. వీళ్లుండే చోట ఈ సాంగ్‌కాంగ్ వాయిద్యాన్ని ఉంచుతారు. దీని

అంచుల మీద చిన్న కర్ర ముక్కలతో కొట్టి వాయిస్తారు. ఈ వాయించే విధానాన్ని బట్టి, అనేక రకాలైన సందేశాలు అందరికీ చేరుతూంటాయి. ఉత్సవాలు, నృత్యాలు మొదలైన వేడుకలకి ఒక మాదిరిగా వాయిస్తారు. ఎవరైనా శత్రువులు వస్తున్నారు, జాగ్రత్తగా ఉండాలి అని చెప్పడానికి ఇంకొక మాదిరిగా వాయిస్తారు. ఈ సాంగ్‌కాంగ్ వాయిద్యం బాగా.ముదురు కర్రతో చెయ్యడం వల్ల 'ఖంగ్' మని బాగా మోగుతూ ధ్వని వినిపిస్తుంది. ఈ శతాబ్దారంభంలో 'మిల్స్' అనే పాశ్చాత్యుడు ఈ గిరిజనులు నివసించే ప్రదేశానికి పోయి, వాళ్ళ ఆచార వ్యవహారాల్ని, ప్రత్యేకించి వాళ్ళ సాంగ్‌కాంగ్ వాయిద్యాన్ని ఎంతగానో మెచ్చుకుంటూ వర్ణించారు. ఈ వాయిద్యానికి ఒకవైపుకు, నోరు తెరుచుకుని, వాలుక చాపి వున్న గెద ముఖం (Motif) బొమ్మ చెక్కి తయారు చేస్తారట. మొత్తానికిది చూడ్డానికి చిన్న నావ ఆకారంలో ఉంటుంది 'ఫిజి, పపువా' (Fiji and Papua) ద్వీప వాసులకి, ఇలాగే వాళ్ల నావల అంచుల మీద కర్రలతో గాని, తెడ్లు తిరగేసి వాటితో గాని వాయిస్తూ, సందేశాలివ్వడం, నృత్యాలకి, ఉత్సవాలకి గూడ ఇలా వాయిస్తూండడం అలవాటుందట. మిల్స్ దొరగారు ఈ అస్సాం గిరిజనులు, ఈ ద్వీప వాసుల అలవాటు చూసి ఈ సాంగ్‌కాంగ్ వాయిద్యాన్ని తయారు చేసుకున్నారేమోనంటారు.

పైన చెప్పిన సాంగ్‌కాంగ్ వాయిద్యా కారంలోనే, సుమారు రెండడుగుల పొడవైన వెదురు కర్రను, రెండు గుబుపుల మధ్యనుండే దాన్ని అర్ధ చంద్రాకారంగా వుండేట్లు కొంచె కోసి, దాని అంచుల మీద ఇంకో కర్రముక్కతో కొట్టి వాయిస్తారు. మన దేశపు ఈశాన్య భాగంలో, ఈ వాయిద్యం 'తుక్ దుల్రుంగ్' (Tak Dulrung) అనే పేరుతో ప్రచారంలో ఉంది.

మధ్యప్రదేశ్‌లో 'అబుజ్ మరియ' లనే (Abuj Marias) గిరిజనులు ఉపయోగించే 'కటోలా', (Katola) అనే ఇంకొక వాయిద్యముంది. త్రిభుజాకారంగా వుండే ఈ కర్ర వాయిద్యాన్ని, రెండు భుజాల్ని గుల్లగా తొలిచి, పొడుగైన ఇంకొక భుజాన్ని అర్ధ చంద్రాకారంగా తొలిచి, తయారు చేస్తారు, దీన్ని మెడలో కట్టుకుని పుల్లముక్కతో కొట్టి వాయిస్తారు.

కొట్టి వాయిస్తే చిత్రమైన ధ్వనులిచ్చే స్తంభాలు, విగ్రహాలు కలిగిన దేవాలయాలు, మన దక్షిణ దేశంలో అనేక క్షేత్రాల్లో కనిపిస్తాయి. కర్ణాటకలోని హంపీ క్షేత్రంలోను; ఆంధ్రలోని లేపాక్షి, తాడిపత్రిలోను; తమిళనాడులోని మధుర, తిరునల్వేలి, అళగర్‌కోయిల్, తెన్కాశి, కుర్తాళం, ఆళ్వార్ తిరునగరి, సుచీంద్రంలోను ఇంకా ఇతరత్రా కూడా అనేకం ఉన్నాయి. తిరునల్వేలి గుడిలోని మండపంలో ఎన్నో స్తంభాలు చక్కటి శబ్దాల్నిస్తూంటాయి. చూడ్డానికి కనుల వైభవంతో బాటు, అవి వాయిస్తే వినడానికి కూడ వీనుల విందుగా వుంటాయి. ఇటువంటి కళా ఖండాల్ని సృష్టించిన మన శిల్పుల నేర్పరితనాన్ని ఎంతైనా కొనియాడాలి. తంజావూరు గణేశ విగ్రహంలో అలా కొట్టి వాయిస్తే చక్కని ధ్వని వినవస్తూటుంది. అలాగే నంగు నేరిలో మన్మధుడు,

రతిదేవి విగ్రహాలు చెప్పుకోతగ్గవి. అయితే ఇవి మన సంగీతానికి ఏమన్నా ప్రయోజనమున్న కళాస్వరూపాలా అంటే, అది సందేహాస్పదమే అవుతుంది. వాటి నుంచి ఇంపైన ధ్వనులే తప్ప, సుస్వర మేమీ వినిపించదు. వాటిని కేవలం వింత వస్తువులుగా పరిగణించవచ్చు. పైన చెప్పిన స్తంభాల్లో సప్తస్వరాలు పలికే స్తంభాలున్నాయి, కాని వాటి నాదం నిలిచి వినిపించే రకం కాకపోవడవల్ల సంగీత ప్రయోజనమేమీ ఉండదు.

వాద్య గోష్ఠుల్లో, 'కాష్ఠతరంగ్' అనే వాయిద్యాన్ని మనలో కొంత మంది చూసివుండవచ్చు. ఇది మన దేశపు వాయిద్యంలా తోచడం లేదు. బహుశః దీన్ని ఇతర దేశాల్నుంచి తెప్పించి ఎవరో మన దేశపు పేరు పెట్టి వుండవచ్చు. ఏమంటే మన దేశపు గిరిజనుల్లో కాని, జానపదుల్లో కాని ఈ రకం వాయిద్యం కనిపించదు. కాష్ఠతరంగ్ అన్నది కర్ర చెక్కలతో చేసిన వాయిద్యంలా కనిపిస్తుంది. పొడుగైన రెండు కర్ర చెక్కల మీద, వేరు వేరు పొడవు, దళసరి గల చిన్న కర్ర ముక్కల్ని అమరుస్తారు. ఈ పలచని కర్ర చెక్కలు, ఒక్కొక్క స్వరానికి ఒక్కొక్క చెక్క ఉంది. స్వరస్థాయి హెచ్చిన కొద్దీ వీటి పొడవు, దళసరి తగ్గుతూ వస్తాయి. ఈ కర్ర చెక్కల కింద వాయించే స్వరానికి తగ్గ లావు, సన్నము కలిగిన లోహపు గొట్టాలు అమర్చబడి వేళ్లాడు తూంటాయి. సన్నటి వెదురు పుల్లలతో ఆ చెక్కల మీద వాయిస్తే, ఆ ధ్వని, కింద అమర్చిన గొట్టాల్లో ప్రవేశించి నాదం నిలిచి వినిపిస్తూ ఇంపుగా ఉంటుంది. ఇంగ్లీషు భాషలో ఈ వాద్యానికి 'గ్జైలోఫోన్' (Xylophone) అని పేరుంది. ఈ గ్జైలోఫోన్‌కు ప్రారంభదశ, ఆఫ్రికా దేశంలోని ఆటవికులు వాయించే వాయిద్యం వంటి తెలుస్తుంది. ఒక స్త్రీ కాళ్ళు బాగా చాపి కూర్చుంటుంది. కాళ్ళ మీద అడ్డంగా కొన్ని సన్నటి రాతి పలకలు అమర్చుకొని వాటి మీద కర్ర పుల్లతో కొట్టి వాయిస్తే అదో రకం పాటలా వినిపిస్తూంటుంది. ఇండోనేషియా దేశంలో ఇదే రకం వాయిద్యం ఇంకా నేర్పరితనంతో తయారైంది, 'గాంబాంగ్' (Gamabang) అనే పేరుతో ప్రచారంలో ఉంది. ఈ గాంబాంగ్ వాయిద్యంలో పైన చెప్పిన రాతి పలకలకి బదులు, కర్ర చెక్క బద్దలు ఉపయోగించి వాటిని ఒక చట్రము పైన బిగిస్తారు. ఇదే దేశంలో కర్ర ముక్కలకి బదులు లోహపు కడ్డీలతో చేసిన వాయిద్యం కూడ 'సరోన్' (Saron) అనే పేరుతో ప్రచారంలో ఉంది. మన దేశంలో 'నల్‌తరంగ్ (Nal Tarang) అనే వాయిద్యాన్ని లోహపు గొట్టాలతో తయారు చేసి వాయిస్తున్నారు.

అస్సాం రాష్ట్రంలో 'టొక్కా' అనే పేరుతో ఒక ఘన వాయిద్య ముంది. ఒక మీటరు పొడుగున్న వెదురు కర్రను ఒక వైపు చీల్చి, రెండో వైపు పట్టుకోవడానికి వీలుగా చెక్కుతారు. అక్కడ దాన్ని ఒక చేతితో పట్టుకుని, రెండో వైపున్న బద్దల్ని, ఒక దాని మీద ఇంకొకటి పడేట్టు వాయిస్తూంటారు. ఇది వాళ్ళ పాటల్లోను, నృత్యాల్లోను ఉపయోగిస్తారు. దీన్నే 'ఖెడ్డా' (Khedda) అనే ఏనుగుల వేటలో ఉపయోగిస్తారు.

ఏనుగులను పట్టుకోవడానికి ఒక గొయ్యి త్రవ్వి, ఆ గోతిని మామూలుగా వట్టి నేలలా కనబడేటట్లు, ఆకు, అలమతో కప్పేస్తారు. చాలా మంది కలిసి ఈ టొక్కా లుచ్చుకుని చప్పుళ్ళు చేస్తూ, కేక లెట్టుకుంటూ ఏనుగును చుట్టేసి ఆ గోతిమీదికి తోలేస్తే, అది ఆ గోతిలో పడిపోతుంది. దీన్నే 'ఖెడ్డా' వేట అంటారు. దారాలతో కట్టిన ఈ టొక్కా లాంటి 'లెబాంగ్ గుమని' అనే పేరుతో వున్న వాయిద్య విశేషాన్ని, ఇటు క్రితమే పరిచయం చేయడమైంది. (చిత్రం : 1)

అతి మనోహరమైన శబ్దాలతోను, నాద విశేషాలతోను శ్రోతల్ని ఆనందపరవశుల్ని చేసే ఘన వాయిద్యం, మనం తరుచుగా కచేరీల్లో వినే 'మోర్సింగ్' లేక మూర్చంగ్ (Moorsing or Moorchang) అనే వాయిద్యం. దీన్ని ఇంగ్లీషులో 'జ్యూస్ హార్ప్' లేక 'జాస్ హార్ప్' అంటారు, కాని హార్పు వీణలకి దీనికి ఏమీ పోలికలు లేవు. ఇది ఊరికే 7, 8 సెంటీమీటర్లు పొడవు గల వాయిద్యం. ఇది రాజాస్థాన్‌లోను, ఉత్తర ప్రదేశ్‌లోని బ్రజ్ జిల్లాలోను ఎక్కువగా కనిపిస్తుంది. దక్షిణాదిన సంగీత కచ్చేరీల్లో తరుచుగా మోర్సింగ్ వాయిద్యం, కంజీర, ఘటం, మృదంగం మొదలైన తాళ వాయిద్యాలతో కలిసి, బాగా ప్రచారంలో వుంది. ముఖ్యాంగం, సన్నటి ఇనుప కడ్డీలతో పరమ శివుని త్రిశూలాకారంలో ఉండి, ఆ కొసల నుంచి 5, 6 సెంటీమీటర్ల పొడుగ్గా, క్రమంగా సన్నగిలే కాడలు ముందుకు సాగి ఉంటాయి. ఈ కాడల మధ్య నుంచి ఒక సన్న నాలిక లాంటి ఊచ ఒకటి ముందుకు చొరుచుకుని కనిపిస్తుంది. ఇది నోట్లో పెట్టుకుని, త్రిశూలాకారంలో నున్న భాగాన్ని ఒక చేతితో పట్టుకుని, మధ్యనున్న సన్నగిలే కాడల్ని పళ్ళతో కరిచి పట్టుకుని, ముందుకు చొరుచుకొని వచ్చిన 'నాలిక'ని చేతితో మీటుతూ వాయిస్తారు. ఇలా వాయిస్తూంటే, ఆ నాలిక నుంచి వచ్చే ధ్వనులు, నోటికి దగ్గిరగా వున్నందువల్ల, వాయించేటపుడు నోటి ఆకారం మార్చి వాయించడం వల్ల, ఈ ధ్వనులకు ఒక విధమైన గురుత్వ సిద్ధి (resonance) లభించి, వినడానికి ఎంతో సొంపుగా ఉంటాయి. ఈ వాయిద్యాన్ని హిందీ సాహిత్యంలో చతుర్భుజదాస్, సూరదాస్ మొదలైన కవులు పాటల్లో 'ముఖచంగ్' అని పేర్కొన్నారు. అహోబల పండితుని సంగీత పారిజాత గ్రంథంలో కూడ దీన్ని 'ముఖచంగ్' అని పేరొన్నాడు. (చిత్రం : 3)



3. మూర్సింగ్

'కిరికిట్టక' వాయిద్యం, దాని రకాలు మనకు చాలా పురాతనమైన వాయిద్యాలు. కఱ్ఱ మీద పెట్టి రాపాడి చప్పుడు చేసే వాయిద్యాన్ని ఇంగ్లీషులో 'స్క్రేపర్, రాస్ప్, స్ట్రిడ్యులేటర్' (scraper, rasp, stridulator) అంటారు. నిప్పు తయారు చేసుకోవడానికి దీని వంటి కఱ్ఱల్ని ఆటవికులు ఉపయోగించేవారని చెప్పబడింది. ఒక కఱ్ఱను చిన్న గుంట లుండేటట్లు చెక్కి, ఇంకో గట్టి కఱ్ఱతో దాన్ని రాపాడిస్తే, ఒక

రకమైన వింత ధ్వని పుడుతుంది. దీన్ని ఆటవికులు, గిరిజనులు పాటలు పాడేటప్పుడు కొన్ని రకాల నాట్యాల్లోను ఉపయోగిస్తారు. ఇతర దేశాల్లో కూడ ఇలాంటివి కనిపిస్తాయి. చైనా దేశంలో 'యు' (Yu) అనే పేరుతో పులి వెన్నెముకతో తయారు చేస్తారట. మెక్సికో దేశంలో ఒక వింతైన పేరు, 'ఒమిచిశహువాగత్లి' (Omichicahuagtli) తో ఎముకతో తయారు చేస్తారు. మన దేశంలో 'రుగ్రబియ' లేక 'దొడ్డురాజన్' అనే ఈ రకం వాయిద్యాల్ని వెదురు కర్రతోనే చేస్తారు. 'కొక్కర' అనేదాన్ని ఇనప గొట్టంతో చేస్తారు. పైన చెప్పినట్లు వెదురు కర్ర మీద గుంటలు పడేట్లు చెక్కి, కొన్నింటిని మధ్యగా చీల్చి గూడ ఈ వాయిద్యాన్ని తయారు చేస్తారు. మధ్య అలా చీలిస్తే చప్పుడు ఇంకా ఎక్కువగా వినిపిస్తుంది. వీటిలో కొన్ని రకాలకి ఓ కొసని ఆనపకాయ బుర్రల్ని కూడ కడతారు. సవర జాతి ఆటవికులు దీన్ని 'రాగబ్దరాజన్' అని అంటారు. వెర్రియర్ ఎల్విన్ అనే పాశ్చాత్యుడు, ఈ సవర జాతివారు దీన్ని పెళ్ళిళ్ళ సమయంలో ఎలా వినియోగిస్తారో వర్ణించి చెప్పేడు. ఎండు ఆనపకాయ బుర్రను ఒక చిప్పలా తయారు చేసి ఈ రాగబ్దరాజన్ వాయిద్యానికి ఒక చిగురున కడతారట. నెమలి కన్నులతో కూడ దీన్ని అలంకరిస్తారట. ఆ మీదట పెళ్ళికొడుకు తరఫు వారంతా ఈ వాయిద్యాన్ని వాయించుకుంటూ పెళ్ళికూతురు ఇంటికి వెడతారట. అప్పుడు పెళ్ళికొడుకుదీనికి తగిలించి వున్న ఆనపకాయ చిప్పను మద్యంలో ముంచి ఆ మద్యాన్ని మామగారి కందించాలిట. మామగారు ఆ మద్యాని తాను తాగి, తిరిగి దాన్ని మద్యంలో ముంచి పెళ్ళికొడుక్కి అందిస్తూ 'నే నీ వేళ నా కూతుర్ని నీ కిస్తున్నాను. నేను అలా చెయ్యక తప్పినట్లయితే; ఈ ఆనపకాయ చిప్ప, ఈ వెదురు కర్ర, నెమలి కన్నులు నా కెదురు సాక్ష్యం పలుకుతాయి.' అని అంటాడట. ఈ వాయిద్యం, సవర జాతి వారిలోనే కాక, శైవులు చేసే కొన్ని నాట్య సందర్భాల్లోను, మంత్ర పరన సమయాల్లోను ఉపయోగ పడుతుందని, పదమూడవ శతాబ్దానికి చెందిన 'జయ' అనే నృత్త రత్నావళి గ్రంధకర్త పేర్కొన్నాడు.శైవులు ప్రత్యేకించి చేసే 'శివప్రియ' అనే దేశియ నృత్యంలో, స్త్రీ పురుషులు కలిసి పవిత్రంగా విభూతి ధరించి, రుద్రాక్ష మాలలతో అలంకరించుకొని నాట్యం చెయ్యడానికి వస్తారుట. వాళ్ళ నాట్యానికి అనుసరణగా మృదంగం, 'కరాట' అనే బాకా, 'కిరికిట్టిక' అనే సూక్తి వాయిద్యం (సోదివాద్దెం) ఉంటాయని చెప్పబడింది. అయితే ఇక్కడ కిరికిట్టిక వాయిద్యాని కిచ్చిన వర్ణన కొంచెం తేడాగా కనిపిస్తుంది. 7, 8 సెంటీమీటర్ల మధ్య కొలత గల లావు, ఒక మీటరు పొడవుగల లోహపు గొట్టాన్ని, ఒక చిగురున పాము పడగ ఆకారంతో (Motif) తయారుచేసి, గొట్టం పైన గుంటలు చేసి, 'కోన' అనే కడ్డీతో రాపాడుతూ వాయించాలి అని చెప్పబడింది. పుస్తకంలోని బొమ్మల్లో కనబరచిన కిరికిట్టిక వాయిద్యం, వ్రాసిన వర్ణన కూడ ఒక మాదిరిగానే ఉన్నాయి కాని, 'సూక్తి' పదం దీనికి ఎలా అన్వయిస్తుందో తెలియడం లేదు.

అయితే అస్సాం రాష్ట్రంలోని 'రపోని' (Raponi) అనేది నిజమైన సూక్తివాయిద్యం. ఇది ఊరికే గుంటలు చెక్కిన వెదురు కర్ర మాత్రమే. గొట్టమేమీ కాదు. ఒక మీటరు పొడుగైన ఈ వెదురు కర్ర మీద నున్న గుంటల మీద ఇంకొక కర్రతో రాసి వాయిస్తారు. కర్ణాటక రాష్ట్రంలోని, పదమూడవ శతాబ్దానికి చెందిన హొయిసాల శిల్పాల్లో ఈ కిరికిట్టిక వాయిద్యాన్ని బాగా చూడవచ్చు. అజంతా, ఎల్లోరా చిత్రాల్లో గూడ చిన్న రకం కిరికిట్టిక వాయిద్యాలు కనిపిస్తాయి.

జానపదుల్లోను, గిరిజన జాతుల్లోను గూడ అనేక రకాలైన పళ్ళాలు, - చిన్నవి, పెద్దవి గూడ సామాన్యంగా కనిపించే ఘన వాయిద్యాలు, 'కథాకళి' బ్యాండు మేళంలో తప్ప, వాటిని ఎక్కడా శాస్త్రీయ సంగీత కచ్చేరీల్లో మనం చూడం. అయితే అందులో చాలా రకాలున్నాయి. ఇవి అన్నీ కూడా ఒక రకం కంచుతో చేసినవి. వాటిలో సర్వ సాధారణమైనవి చిన్న రకం పళ్ళాలులా ఉంటాయి. ఆ పళ్ళాన్ని చేతికి కట్టుకుని ఆ చేతిలోనే ఒక కర్రతో కాని, లేక ఇంకొక చేతితో కాని వాయిస్తూంటారు. ఉత్తర హిందూస్థానంలోని 'తాలి'; కర్ణాటక, ఆంధ్రల్లోని దాసరులు వాయించే 'జగతే' లేక 'జగంటె' అనే పళ్ళాలు; కథాకళి మేళంలో వాయించే 'చెంకల' లేక 'చెన్నల' పళ్ళాలు; తమిళనాడులోని 'సెమ్మన్కలం' పళ్ళాలు; ఆ పళ్ళాలన్నీ ఒకే రకాలు. ఇవన్నీ చదునైన పళ్ళాలే. కాని ఆగ్నేయాసియాలోని 'సీము' అనే పళ్ళెం చాలా పెద్దది, మధ్యభాగం కొంచెం ఎత్తుగా ఉంటుంది. ఈ మధ్య భాగంలో ఒక కన్నం ఉంటుంది. దానిలో నుంచి దారం కాని, తాడు కాని కట్టి వాయిస్తారు. కొన్నింటికి అంచు వద్ద కన్నముంటుంది. వాటిని కూడ దారంతో కాని, తాడుతో కాని వేళ్ళాడదీసి పట్టుకుని కర్ర ముక్కతో వాయిస్తారు. ఈ తాలి, సీము పళ్ళాలనే, అంచుల వద్ద కొంచెం ఎత్తుగా వంగి వున్న వాటిని, భోజనం చెయ్యడానికి వాడుకుంటారు. (చిత్రం : 4)

రాజాస్థాన్‌లో ఒక జానపద వాయిద్యముంది. ఆకారంలో చిన్నవి, పెద్దవి, పలచగానున్నవి, దళసరిగా వుండేవి పళ్ళాలు - అన్ని రకాలైనవి కూడా 1 $^1/_2$ మీటర్ల ఎత్తుగల ఒక ఇనప చట్రానికి కట్టబడి ఉంటాయి. ఈ పళ్ళాల ఆకారం, మందం, వైవిధ్యంగా వుండడంవల్ల, ఆ చట్రం మీద వున్న పళ్ళాలన్నీ కలిసి చేసే ధ్వనులు, సంగీత స్థాయిలో వున్న వేరువేరు స్వరాల్లా వినబడుతూంటాయి. దీన్ని 'కాష్ఠ తరంగ్', 'నవ్‌తరంగ్' వాయిద్యాల వలె 'తాలితరంగ్' అనవచ్చునేమో! ఆశ్చర్యమేమంటే, చైనా దేశంలో కూడ 'యన్‌లో' (Yun Lo) అనే ఇలాంటి వాయిద్యముంది. ఉత్తర భారతదేశంలో కూడ 'చిమ్టా' (Chimta) అనే వాయిద్యం ఒకటి ఉంది. ఒక మీటరు పొడవుగా 'ఫోర్కు' (fork) ఆకారంలో రెండుగా చీలి వున్న ఒక ఇనప వూచకి, చిన్న చిన్న పళ్ళాలు, కట్టబడి ఉంటాయి. దీన్ని భజనల్లోను, జానపద సంగీతాల్లోను, చేతితో పట్టుకొని తాళ వరసలో, ఊపుతూంటారు, లేకపోతే ఇంకో చేత్తో పట్టుకుని చట్రాన్ని



4. సీమూ

కొట్టి వాయిస్తారు. బాగా హెచ్చు స్థాయి ధ్వనులు వినిపిస్తూ చెవులకు చాలా ఇంపుగా ఉంటుంది. (చిత్రం : 5)

ఈ పళ్ళాల కుపయోగించే గుండ్రటి ఇత్తడి రేకు కాని, కంచు కాని కొంచెం వంచి తయారు చేస్తే, అవే మన దేశం మొత్తం మీద ఏ విధమైన సంగీతంలో నైనా వినిపించే తాళాలు. ఇవి కూడ ఆకారాన్ని బట్టి, దళసరిని బట్టి అనేక రకాలుగా తయారవుతున్నాయి.

5 సెంటీమీటర్లు మొదలు, 30 సెంటీమీటర్ల వరకు అర్ధ కొలత గలవి, వాటి వంపులో (concovity) కూడ తేడాల వల్ల అనేక ఆకారాల్లో తయారవు తున్నాయి. వీటి పేర్లు అనేకాలు. జ్వాలా, ఝుల్లరి, కర్తాళ్., తాళి, తాళం, ఎలత్తాళం, కుళిత్తాళం మొదలైన పేర్లున్నవన్నీ చిన్న రకాల తాళాలు. ఝూంజ్, ఝుల్లరి, బ్రహత్తాళం, బ్రహ్మతాళం,



5. చిప్లూ

బోర్తాళ్ మొదలైనవన్నీ బాగా పెద్ద రకాలు. ఇవి దేశమంతటా, ముష్టి వాళ్ళు, భజన గోష్ఠులు, వాయిద్య గోష్ఠులు, హరికథా కాలక్షేపాలు, నృత్య ప్రదర్శనాల్లోను, ఇంకా అనేకానేక గానాలకు వీటి నుపయోగించని వారు లేరు. ఇహ వాటి చరిత్ర చూడబోతే సింధు ప్రాంత నాగరికతని తెలిపే బొమ్మల్లో కూడ ఇవి బాగా విరివిగా కనిపిస్తాయి. వేదంలో కూడా 'అఘటి' అనే పేరుతో ఇవి పేర్కొనబడ్డాయి. (చిత్రాలు : 6, 7)



6. మంజీరా లేక జల్రా

తాళాల్లాగే గంటలు కూడా దేశవ్యాప్తంగా కనబడని ప్రదేశం లేదు. తాళాల్లాగే గంటలు కూడ చిన్నవి, పెద్దవి అనేక రకాలున్నాయి. తాళాలు రెండుచేతులతోను వేయాలి; గంట ఒక చేత్తోనే వాయించవచ్చు; వేళ్ళాడ గట్టి, మధ్యగా వుండే ఇనప ముక్కను కదిపితే గంట మోగుతుంది. ఇంక తాళాలు, గంటలు కూడ ఇత్తడి, కంచులతోనే తయారు చేస్తారు. కొన్ని పెద్ద గంటల్ని, ఒక కర్ర ముక్కతో కొట్టి, గంట అంచు మీద ఆ కర్రను తగులుస్తూ, చుట్టూ తిప్పితే, ఒక రకమైన హెచ్చునాదం ఎంత సేపైనా వినిపిస్తుంది. ఈ రకం గంట వాయిద్యం మన దేశంలో 'జంగాలు' అనే శైవులు వాయిస్తూంటారు.

ఎండిపోయిన సొరకాయలు మొదలైన కొన్ని కాయల్లో, పైపెచ్చు గట్టిపడి, లోపలి పదార్థమంతా హరించుకు పోయి, విత్తనాలు మాత్రం మిగిలిపోతాయి. అవి ఊపి



7. బోర్డల్ లేక బ్రహ్మతల్

వాయిస్తే 'గల, గల' మనే ఒక వింత శబ్దం వేడుగ్గా వినిపిస్తుంది. అదవుల్లో ఇలా గలగల్లాడే కాయలు చాలా దొరుకుతాయి కనుక వాటిని గలగల్లాడించి వినోదించడం అక్కడ నుంచే వచ్చివుండవచ్చు. మన ఆంధ్రదేశంలో చెంచుల వాళ్ళ దగ్గిర ఇలాంటి 'గిలబాదా' (Gilabada) వాయిద్యముంది. ఇంకా కొన్ని ఎండుకాయలు, ఒక కర్రకు కట్టి, అది ఆడించి వినోదిస్తారు. మధ్యప్రదేశ్ లోని 'బైగా' గిరిజనులు, తమ నాట్య సమయాల్లో కొన్ని రకాల చిన్న కాయల్ని, ఎండిపోయి గలగల్లాడే వాటిని, మొలకు కట్టుకొని నాట్యం చేస్తారు. ఓరవోన్ జాతి గిరిజనులు కూడ ఎండిపోయిన 'కనియారి', 'చంపా' కాయల్ని వెదురు కర్రకు కట్టి, పక్షుల ఈకలతో అలంకరించి, ఆ వాయిద్యాన్ని చక్కని వింత శబ్దాలతో వాయిస్తూ నాట్యం చేస్తారు. కొబ్బరి కాయను తొలిచి, లోపల కాళీ చేసి, అందులో చిన్న గులక రాళ్ళను వేసి, పట్టుకోవడానికి దానికి ఒక పిడి కూడ తగిలించి, అది ప్రస్తుతం నాట్యాల్లో 'రాట్లర్' (Rattler) అనే పేరుతో ఉపయోగిస్తున్నారు. ఈ రకం చిన్న వస్తువులు పిల్లలకు ఆడుకోవడానికి కూడ పనికి వస్తాయి. వీటినే 'గిలిగింతల'ని, 'గిలక'లని పిల్లల ఆట వస్తువులుగా తయారు చేసి, ఉత్సవాల్లోను,

తిరునాళ్ళలోను అమ్ముకుంటారు. వీటిని చూసి, ఈ రకంగా లోహంతోను, కర్రతోను తయారైన వాయిద్యాల్లో -'ఝుంజుని', 'ఖుల్‌ఖులా', 'ఖున్‌ఖునా', 'గిల్కి' అని అనేక రకాల వాయిద్యాలున్నాయి. (చిత్రం : 8)



8. జిలఖద

పైన చెప్పిన ఇంపైన చప్పుళ్ళు, చేసే వాయిద్యాల్లోకే వస్తాయి. మన గజ్జెలు, మువ్వలు, చిరుగంటలు కూడ. గంట ఆకారాన్ని సుమారుగా మువ్వ ఆకారంలో తయారైన వాయిద్యమే అనాలి. గంట ఆకారం, దానిలో వేళ్ళాడే ఇనప ముక్క, మువ్వ, మువ్వలోని కీలకం మాదిరిగానే ఉంటాయి. అలాగే గజ్జె కూడ మొగ్గ రూపంలో చేయబడిన దనవచ్చు. వాటి నిర్మాణం ఎలా జరిగినా, అవి మన సంఘంలో బాగా వ్యాపించి, ఎంతో ఆదరణ పొందిన అలంకార వస్తువులు. మనుష్యులకే కాకుండా పశువులకు కూడ అలంకారం వీటితో జరుగుతూంది. నాట్యం చేసే వారికిది ప్రప్రథమ అలంకారం. ఉత్తర హిందూస్థానంలో వీటిని 'ఘూంగ్రూ' అంటే, దక్షిణాది నిది 'గజ్జె' అయింది. అయితే వీటిలో చప్పుళ్ళే తప్ప, సునాదంగల ధ్వనులు లేనందున, నాట్య సమయాల్లో వాడుతున్నారు కాని సంగీత లోకంలో వీటికి స్థానం లేకుండా పోయింది. నాట్యం నేర్చుకుని, ప్రదర్శన లిచ్చే వారి ప్రథమ ప్రదర్శనకు (debut) 'గజ్జెకట్టడ' మని, 'గజ్జెపూజ' అని ఒక ప్రత్యేక వేడుక సాంప్రదాయంగా వస్తూంది.

గంటలు శాస్త్రీయ సంగీతానికి ఏ విధంగాను పనికి రాలేదు. కాని గంటల ఆకారంతో తయారైన పింగాణీ గిన్నెల 'జలతరంగ్' (Jala Tarang) వాయిద్యం మాత్రం గోష్ఠుల్లోను, కొన్ని నాట్యాల్లోను కూడ ప్రచారంలో వున్నదని చెప్పాలి. ఈ గిన్నెల్ని అర్ధ చంద్రాకారంలో పేర్చి. వాయిద్య కారుడు అన్ని గిన్నెలు చేతికి సులువుగా అందేట్లు కూర్చుని ఉంటాడు. గిన్నెల ఆకారం, దళసరి, ఎత్తుల్లోను స్వర స్థానాల్ననుసరించి పెద్దది గాను, హెచ్చు స్వరాలకి చిన్నవి గాను ఉంటాయి. స్వరాలు శుద్ధంగా వినిపించునంతమేరకు, గిన్నెలలో నీరు పోసి వాటిని సవరించి, రెండు చేతుల్లోను రెండు కర్ర పుల్లలతో గిన్నెల అంచుమీద కొట్టి వాయిస్తాడు. ఈ గిన్నెలు నీటిలో వున్నందున, నాదం వినసొంపుగా వుండి, బాగా నిలిచే నాదంగా ఉంటుంది. జలతరంగ్ వాయిద్యంతో

రాగ, కీర్తనలు, , స్వరం మొదలైన అంశాలన్నింటి తోను ప్రత్యేకం కచ్చేరీ చేసే వారున్నారు. ఈ వాయిద్యం మన దేశపు వాయిద్యమేనా అనే విషయం సందేహాస్పదంగా కనిపిస్తుంది. అలెగ్జాండర్ మన దేశం వచ్చి తిరుగు ప్రయాణంలో ఇక్కడ నుంచి ఈ జలతరంగ్ వాయించే వారిని కొంత మందిని తనతో తీసుకు వెళ్ళినట్లు కొంతమంది అభిప్రాయం, గాని దానికి తగ్గ నిదర్శన లేమీ లేవు. వాత్స్యాయనుని కామసూత్ర గ్రంథంలో, చతుష్షష్టి కళలు పేర్కొంటూ 'ఉదక వాయిద్యాన్ని' ఆ విద్యల్లో ఒకటిగా పేర్కొన్నాడు. ఉదక వాయిద్యమంటే 'జలతరంగ్' అని కొందరి అభిప్రాయం. ఇంకా ఈ వాయిద్యాన్ని 17వ శతాబ్దంలోని 'సంగీత పారిజాత' గ్రంథకర్త, కొంతమంది హిందీ కవులు కూడ 'ఉదకవాయిద్య' మనే పేర్కొన్నారు.

మట్టితో చేసిన కుండ జానపదుల కార్యక్రమాల్లోనే కాక శాస్త్రీయ సంగీత కచ్చేరీల్లో కూడా బాగా ప్రచారంలో వుంది. జానపదుల సంగీతాల్లో ఉపయోగపడే 'ఘట' వాయిద్యాల్ని, మట్టితోను, కొన్నింటిని లోహంతోను కూడ తయారు జేస్తారు. వాటికి 'మట్కి' అని, 'గాగ్రి' అని, 'నూట్' అని పేర్లున్నాయి. ఈ నూట్ అనే ఒక రకం ఘటం, కాశ్మీర్‌లోను, సింధురాష్ట్రంలోను బృందగానాల్లో బాగా ప్రచారంలో వుంది. ముఖ్యంగా 'చక్రీ', 'రవూఫ్', 'సూఫియానాకలం' మొదలైన బృందాల్లో ఇది కనిపిస్తుంది. ఈ నూట్ వాయిద్యాన్ని వాయించే వాళ్ళు, దాన్ని ఒళ్ళో పెట్టుకుని కాని, తొడ మీద పెట్టుకుని కాని, దాని మూతి పైకి వుంచి, మూతి మీద, ప్రక్కల మీద చేత్తో కొట్టి, తాళ వరసలతో అనుసరణగా వాయిస్తారు. మన దక్షిణాది సంగీత కచ్చేరీల్లో వినే ఘటం, ప్రత్యేకమైన మట్టితో, అంతటా సమంగా కాల్చి, జాగ్రత్తగా తయారు చేసింది. ఈ ఘటం వాయించే వారు, చొక్కాను తీసివేసి, ఘటాన్ని పొత్తి కడుపుకు ఆనించి వాయిస్తారు. పొత్తికడుపు కదలికలను స్వాధీనంలో వుంచుకొని వాయించి నందువలన ఘట వాయిద్యంలోని నాదం ఎంతో ఇంపుగా, హృద్యంగా మనోహరమైన ధ్వని విశేషాలతో వినిపిస్తూంటుంది.

ఈ ఘన వాయిద్యాల విషయంలో ఒకమాట చెప్పాలి. అవన్నీ ముఖ్యంగా తాళ, లయ పోషకాలు. వాటిలో మనకు సంగీత ప్రయోజనం బహుకొద్ది మాత్రమే అనాలి. మన సంగీతమంతా సుస్వర బద్ధమైన రాగ విరాజితము, గమకయుక్త మైన స్వర రంజకముగా పెంపొందిన ఆనంద రూపం. ఘన వాయిద్యాల్లో చాలవాటికి నాదం నిలిచి వినిపించదు. మన సంగీతాని కతిముఖ్యమైన గమక సౌందర్యం వాటిలో నిలబడలేదు. ఈ కారణాల వల్ల ఘన వాయిద్యాలకు మన శాస్త్రీయ సంగీతంలో విశేష ప్రాధాన్యత లేకుండా పోయింది.

# 4

# డోళ్ళు

చర్మంతో కప్పిన వాయిద్యాలన్నీ 'అవనద్ధ వాయిద్యము'లని మన సంగీత గ్రంథాల్లో చెప్పబడింది. అవనద్ధ అంటే కప్పినవి అని అర్థం. ఒక కర్ర వస్తువునో, గిన్నెనో, చట్రాన్నో తోలుతో కప్పి, దాన్ని వాయిద్యంగా ఉపయోగిస్తే అది అవనద్ధ వాయిద్య మవుతుంది. డోళ్ళకిది సామాన్య పదమైనా, 'పుష్కర' అనె ఇంకొక మాట కూడ సాంప్రదాయంగా వస్తూంది, భరతుని నాట్య శాస్త్రంలో 'పుష్కర' (pond) నామం ఎలా ఏర్పడిందో ఒక కథగా చెప్పేరు. స్వాతి అనే ఒక మహర్షి స్నానార్థం ఒక కొలను దగ్గరకి పోగా, ఇంద్రుడా సమయాన్నే పెద్ద వర్షం కురిపించాడట. వర్షం కురుస్తోండగా, ఆ వర్షపు చినుకులు తామరాకుల మీద పడి, -తామర, అంటే పుష్కర అని కూడా అర్థం వుంది, - ఆ శబ్దా లాయనకెంతో శ్రోత్రపేయగా, లయ బద్ధంగా వినిపించాయట. ఇంటికి వెళ్ళిన తర్వాత, ఆ అనిర్వాచ్యానందాన్ని ఆయన మరచి పోలేక, 'విశ్వకర్మ'ను పిలిచి, తను విన్న శబ్దాల వలె ధ్వనించే వాయిద్యాన్ని తయారుచేసి పెట్టమని కోరగా, విశ్వకర్మ 'పనవ', 'దర్దుర' అనే వాయిద్యాలను తయారు చేసి ఇచ్చాడట.

ఇది వరలో మనం ప్రస్తావించిన ఘన వాయిద్యాలు, అంతగా మన శాస్త్రీయ సంగీతోప యుక్తాలు కాకపోయినా, ఈ అవనద్ధ వాయిద్యాలు మట్టుకు, - ఊదే వాయిద్యాలు (wind instruments) వలె, - మన సంగీతానికి, కచ్చేరిలకు ఎంతగానో తోడ్పడి బహుళ ప్రచారంలో వున్నాయి. వీటిలో శుద్ధమైన నాదం నిలిచి వినిపిస్తుంది. అవసరమైతే ఆ నాదం మొక్క స్థాయిని కాని, స్వరాన్ని కాని మార్చి, ఎన్నో రంజకమైన ధ్వని విశేషాలతో, నిశితమైన హెచ్చు, తగ్గులతో పలికించ వచ్చు. తాళ లయ విశేషాల్ని ప్రదర్శించడానికివి లేకపోతే సంగీతమే సంపూర్ణం కాదు. ఉదాహరణకి మృదంగం, తబ్లా, డోలు మొదలైన వాటిని చెప్పవచ్చు.

డోళ్ళ తయారీలో రెండు రకాల పరిశ్రమలు అమల్లో వుంటూ వచ్చాయి. ఒకటి కర్ర, రెండు మట్టి పరిశ్రమలు. ఒక చెట్టు కొట్టేసి, దాని కాండాన్ని తొలిచి, లావైన గొట్టం లేక సిలిండర్ (cylinder) ను తయారు చేసి, దాన్ని ఒక వైపునో లేక రెండు వైపులనో చర్మంతో కప్పి డోలు తయారు చేయడం చాలా కాలం నుంచీ మనకు తెలిసిన పద్ధతే. బహుశః ప్రారంభ దశలో వీటిని బాగా పెద్ద ఆకారంలో తయారుచేసి, ఒక వైపునే చర్మంతో కప్పి, నేలమీద నిలబెట్టి వాయించడం అలవాటై వుండవచ్చు. అలాటి

వాయిద్యాలు ఈ నాటికి మన ప్రాంతంలో 'రొంజ' లేక 'రుంజ' అనే పేరుతో కనిపిస్తాయి. ఆధునికంగా ఈ 'రుంజ'లను లోహంతో తయారు చేస్తున్నారు. ఆఫ్రికా దేశంలోను, మెక్సికోలోను కూడ, ఇలాంటి డోళ్ళు ఇటీవల కొన్ని కనిపించాయి. వాటిలో కొన్నింటి పొడవు 3 మీటర్ల వరకు కూడ ఉందని చెపుతారు. మన దేశంలో వాటి ఆకారమంత పెద్దగా లేకపోయినా, అస్సాం రాష్ట్రంలో 'ఖ్రరం' అనేది, మన రాష్ట్రంలో రెడ్లు వాయించే 'ఢోల్' మొదలైన వాయిద్యాలు ఈ రకానికి చెందినవే. కేరళ రాష్ట్రంలో కొబ్బరి చెట్లు బాగా విస్తారం కనుక, కొబ్బరి చెట్టు నరికి, దాని మొదలుతో ఈ రకం డోలును తయారు చెయ్యడం అలవాటుగా వుండేదని తెలుస్తూంది. ఆధునికంగా 'లేత్' (Leaths) మొదలైన యంత్రాలు వచ్చిన తర్వాత, వీటిని చిన్నవిగా ఇంకా నైపుణ్యంతో తయారు చేయడం నేర్చుకున్నారు.

మట్టి ముద్దను కుమ్మరి వాని అవసరం కూడా లేకుండానే, ఎలా కావలిస్తే అలా మలుచుకుని, వస్తువులను తయారు చేసుకోవడం సులువే. కుమ్మరి సారె (చక్రం) సహాయం దొరికాక కుండలు, మూకుళ్ళు, కూజాలు మొదలైన ఎన్నో ఆకారాలతో పాత్రలు తయారు కావడం జరిగింది. అందుచేత ప్రారంభ దశలో మట్టితో తయారైన డోళ్ళన్నీ ఒకే ఆకారంలో వుండేవని తెలుస్తోంది. రానురాను కుమ్మరి వాళ్ళ నైపుణ్యంతో, 'దర్దుర' అనే కుండ ఆకారంలో వున్న డోలు, 'శాపా' అనే మూకుడు ఆకారంలో వున్న వాయిద్యం, 'తుంబకర్ని' అనే కూజా ఆకారంలో వున్న వాయిద్యం, మొదలైనవి తయారు చేసుకున్నట్లు తెలుస్తోంది. బాగా లావైన గొట్టం అంటే సిలిండరును, రెండు వైపుల క్రమంగా సన్నంగా వుండేట్లు తయారుచేస్తే, 'బ్యారెల్' (Barrel) ఆకారంలో వుండి, మృదంగాకారంలోకి వస్తుంది. అది కూడ కుమ్మర్లు సులభంగా చేయవచ్చు. ఆదిలో అలాగ మట్టితో చేసిన మృదంగాలు తయారై వుండాలి. అయితే మట్టితో చేసిన వాయిద్యాన్ని, బద్దలైపోకుండా కాపాడ్డం చాలా కష్టం. మృదంగం ఆ కారణం చేత తిరిగి కర్రతో తయారు ఆవడం మొదలైంది. ఆ మార్పులోనే కర్రతోనే కాకుండా లోహంతో కూడ తయారు చేయడం ఆరంభించి ఉండాలి. 'ఖోల్' అనే ఉత్తర భారత దేశపు వాయిద్యం ప్రస్తుత కాలంలో కూడ మట్టితోనే తయారు చేస్తున్నప్పటికీ, మృదంగం, పఖావాజ్ మొదలైన వాయిద్యాలు ఇపుడు కర్రతోనే చేస్తున్నారు. అలాగే దగ్గా అనే వాయిద్యాన్ని పూర్వం మట్టితో చేసేవారు. ఆధునికంగా కర్ర, లోహాలతో తయారు చేస్తున్నారు.

ఇంకో విషయమేమంటే, ఈ డోళ్ళకు పెట్టిన పేర్లనుబట్టి, వాటి ప్రారంభ దశలో వంటకు, నిలువ చేసుకోవడానికి ఉపయోగించే కుండలని తెలుస్తోంది. ఆ కుండల మూతులను తోళ్ళతో కప్పి, కర్రపుల్లతోనో, చేతితోనో వాటి మీద వాయించడం జరుగుతూండేది. ఉదాహరణకు ద్రవిడ భాషలోని కొన్ని డోళ్ళ పేర్లు, 'పర', 'పరె', 'పిరై', మొదలైన పేర్లు. వంట కుండలకి, నిలువ చేసుకునే పాత్రల పేర్లు కూడ ఇవే.

భూమిలో లోతైన గోతులు త్రవ్వి, వాటిని వలచని చెక్కలతోనే, నారతోనే, చర్మాలతోనే కప్పి, ఆటవిక జాతుల స్త్రీలు దాని మీద గెంతుతూ నాట్యం చేయడం వాళ్ళ వేడుకల్లో ఒకటి. ఇండోనీషియా, మలేషియా మొదలైన ఆగ్నేయ ప్రాంతాల్లో ఇలాంటి గోతుల్ని ఇటీవల కనుక్కున్నారు.వేద సాహిత్యంలో 'భూమి దుందుభి' ఒక రకమైన తాళ వాయిద్యంగా పేర్కొనబడింది. ఒక గోతిని ఎద్దు మొదలైన జంతువుల చర్మంతో కప్పి, ఆ చర్మం చిగురునున్న తోకను కూడ దాని మీద వాయించడానికి ఉపయోగించే వారని తెలుస్తూంది. అయితే ఇలాటివి తరువాత తరువాత, మట్టి కుండలు, కర్రతో చేసిన వాయిద్యాలు వచ్చాక కనడకుండా పోయాయి.

హృదయపూర్వకంగా, శ్రద్ధతో చేసే పనుల కన్నిటికీ, ఒక దైవిక శక్తిని ఆపాదించి, సాంకేతికంగా పూజలు చేయడం, మన కనూచాన సాంప్రదాయం, డోళ్ళను తయారుచేసి, ప్రప్రథమంగా వాయించే సమయాల్లో కూడ, ఈ విధమైన పూజలు చేయడం, ఆటవికుల వద్ద నుంచి వస్తూన్నా ఆచారాన్నే మన మీనాటికీ అనుసరిస్తున్నా. మన రాష్ట్రంలోని బైసన్ కొండల్లో నివసించే గిరిజనులతో కూడ, కొన్నాళ్ళ క్రితం పని చేసిన 'ఫ్యూరర్ హైమన్‌డోర్ఫ్' (Furer Heimendorf) అనే జర్మన్ దేశస్థుడు వాళ్ళ అలవాట్లను వర్ణిస్తూ ఇలా చెప్పారు. 'బైసన్ కొండల్లోని గిరిజనులు డోళ్ళను తయారు చేయడానికి, కర్రను పూర్తిగా లోపల బైటా దొలిచిన తర్వాత, తోలుతో దాన్ని కప్పేటపుడు, ఒక కోడి పిల్లను కోసి, ఆ రక్తం కొంత డోల్లోపోసి, ' ఈ డోలు మాకు ఊరికే స్పృశించినంత మాత్రాన, పెద్ద శబ్దాలతో నిండి, మా కానంద ప్రదమవుగాక' అని మంత్రంతో ప్రార్థన చేసేవారట. 'ఒరవోన్' జాతి గిరిజనులు కూడ, ఏ విధమైన కొత్త ఆయుధాలు, పనిముట్లు, సంగీత వాయిద్యాలు, పని చేయడం ప్రారంభించినా, పసుపు పూసి అలంకరించి - దీనికి పెళ్ళి పెళ్ళి చేయడం అంటారట - పూజలు చేయడం ఆచారమేనట. ఈ ఆయుధాల్లోను, పనిముట్లలోను, వాయిద్యాల్లోను, ఏవో దైవ శక్తులిమిడి వున్నాయని, వాటిని పూజించి సంతృప్తి పరుస్తేనే కాని అది మనకు వశం కావని, పైగా పూజించక పోతే మనకు కీడుకూడ కలుగుతుందని వారి నమ్మకమని చెపుతారు. కొత్త కార్యమేది తలపెట్టినా, టెంకాయ కొట్టడం, పూజలు చేయడం ఈనాటికి మనందరికీ అలవాటే. ఆఖరికి కొత్త బట్టలకి కూడ పసుపు 'బొట్టు' పెట్టడం మన కలవాటే.

ఆధర్వణ వేదంలో 'దుందుభి' అనే వాయిద్యాన్ని, స్తుతి చేస్తూ, ఇలా చెప్ప బడింది. 'ఓ దుందుభీ ! వనస్పతితో (వనస్పతి = కర్ర) చేసిన నీ వొక మహానాయకుని వంటి దానివి. నువ్వు సింహంలా గర్జించి, మా శత్రువులను హడల గొట్టి, మాకు విజయాన్ని ప్రసాదిస్తావు,' అని చెప్పబడింది. ఈ దుందుభి యుద్ధ సమయాల్లోనే గాక, శాంతి సమయాల్లోను, మత పరమైన పూజా సమయాల్లోను కూడ, ఉపయోగంలో వుండేదని తెలుస్తూంది. వాజపేయమనే యజ్ఞంలో, రథాల పందేలు జరిగేవని, ఆ పందేల

ప్రదర్శన చాలా వైభవంగా చేసేవారని తెలుస్తూంది. ఆ వందెం జరిగే స్థలంలో 17, 18 దుందుభులను అమర్చి, పోటీదారుల నుత్తేజ పరుస్తూండే వారని చెప్పబడింది. ఇంకా ఈ దుందుభి వాయించేవారికి, వేణువు వాయించేవారికి, తాళము వేసేవారికి, తదితర వాయిద్యకారులకు కూడ, మకర సంక్రాంతి సమయంలో చేసే మహావ్రత పూజల్లో, తర్పణలిచ్చి పూజించాలని చెప్పబడింది. యజ్ఞ సమయాల్లో దేవతా తృప్తికోసం తర్పణలివ్వడం సామాన్యమైన పూజా విధానం.

డోళ్ళను ఈ విధంగా భక్తి భావంతో ఆరాధించడం, కాలక్రమంగా జరుగుతూనే వుంది. భరతుని నాట్య శాస్త్రంలో వివిధ మృదంగాల పూజా విధానం ఇలా చెప్పబడింది. 'సంగీత శాస్త్రాన్ని బాగా అవగతం చేసుకుని, రాగద్వేషాల కతీతుడైన, ఉత్తమ సంజాత కళాకారుడైన పండితుడు, హస్త, చిత్ర నక్షత్రరాశిలో చంద్రుడు కనబడే శుక్ల పక్షమందు, ఒకనాడు పవిత్రుడై, పేడతో అలికిన మూడు మండలాల్ని (circular places) తయారు చేసుకోవాలి. మొదటిదైన బ్రహ్మ మండలమందు ఆ లింగాన్ని ఉంచి, పువ్వులు, తేనె, పరమాన్నము తోను; రెండవ దైన రుద్ర మండలమందు ఊర్ధ్వకాన్ని ఉంచి, గోధుమ అరిశెలతోను పూరీలతోను, పుష్పములతోను; మూడవ దైన విష్ణు మండలమందు ఆంకికాన్ని ఉంచి, పుష్పములు, అరిశెలు, పిండములతోను నైవేద్య సహితమైన పూజలు చేయవలెనని చెప్పబడింది . ఇందులో ప్రత్యేకంగా, ఉమ్మెత్త (datura), గన్నేరు (oleander) పూవు లుపయోగించాలని చెప్పబడింది.

కైలాస వాసియైన పరమ శివుడు, అవాఙ్మాన గోచరమైన ఆనంద స్వరూపంతో, సనక సనంద నాది యోగుల రక్షణ కోసం, దర్శన మిచ్చాడు. ఆ సమయంలో ఆయన చేసిన ఆనంద నాట్య భంగిమలతో సహా, ఆయన చేతిలోని 'ఢక్క' (ఢమరు వంటి చిన్న వాయిద్యం) వాయిద్యం నుంచి వెలువడిన శబ్దాలే మన కక్షర సమామ్నాయమై, లోక కళ్యాణ ప్రదమైంది అని మన పురాణ గ్రంథాలు చెవుతాయి. ఇది మన ఆధ్యాత్మికొన్నత్యానికి, ఆనందమయ కళారాధనకు ప్రబల నిదర్శనం. సృష్టి స్థితి, లయ కారకమైన ఓంకార ప్రణవ స్వరూపమైన దీ జగత్తు, మన హైందవులకు.

పైన చెప్పిన మూడు రకాలైన ఆలింగ్య, ఊర్ధ్వక, ఆంకిక మృదంగాల పేర్లను బట్టి, వాటిని వాయించే విధానం మనకు కొంత తెలుస్తూంది. ఆలింగ్య అనే మృదంగాన్ని, ఎడమ చేతికి, నడుముకు మధ్యగా వుంచుకుని (కౌగిలించుకొన్నట్లు) కుడి చేత్తో దాని ముఖం మీద వాయించడం, అనగా ఒక వైపునే వాయించడం; ఊర్ధ్వక మృదంగాన్ని నిలబెట్టి, ఈ నాటి మన తబలా, చండ వాయిద్యాల్ని వాయించినట్లుగా వాయించడం, దీన్ని కూడ ఒక వైపునే వాయించడం; ఆకింక అనే మృదంగాన్ని ఈ నాటి మృదంగ, ఢోలక్, ఖోల్ వాయిద్యాల్ని వాయించినట్లు. రెండు వైపులా వాయించడం జరుగుతుంది. భరతుని నాట్య శాస్త్రంలో ఈ విధానాలు సూచింపబడ్డాయి. కొంతమంది పండితులు, ఈ విషయాన్ని గురించి, ఇక్కడ చెప్పిన మృదంగం అనే పదానికి మూడు రకాల

మృదంగాలు లేవని, ఆ రోజుల్లో ఒకే మృదంగానికి మూడు భాగా లుండేవని, కలిసి వాయించవలసిన ముఖాలు మూడుండేవని భావిస్తున్నారు. ఈ రకమైన గందరగోళ అభిప్రాయానికి నిదర్శనంగా, మన శిల్పాల్లోను, శిల్పాల తాలూకు బొమ్మల్లోను, ఒక వాయిద్యకారుడు నిలబడి వున్నట్లు, రెండు మృదంగాల్ని నిలబెట్టి, ఒకటి అడ్డంగా వుంచి వాయించుతున్నట్లున్న బొమ్మలు కనిపిస్తున్నాయి. ఉదాహరణకు, అజంతా, ఎల్లోరాల్లోని బొమ్మలు.

పైన వివరించిన మృదంగాల విభజన, వాటిని వాయించే విధానాన్ననుసరించి జరిగింది. అది గాక మృదంగాల ఆకారాన్ని బట్టి కూడ ఇంకొక విభజన జరిగింది. మొదటి రకం 'హరీతకి' అంటే కరక్కాయ అకారంలో లావుగా వుండి, క్రమంగా రెండు ముఖాల వైపుకి సన్నగిల్లుతూ ఈ నాటి 'డోలు' ఆకారంలో వుండేవి. రెండవ రకమైన 'యవ' ధాన్యపు గింజ ఆకారం కూడ, మధ్య లావు, క్రమంగా రెండు వైపులకు సన్నగా, ఈ నాటి మృదంగాకృతిలో వుండేది. మూడవ రకం, 'గోపుచ్ఛ' ఆకారంలో బహుశః ఒక వైపు లావుగా వుడి, ఇంకొక వైపుకు క్రమంగా సన్నగిల్లే ఈ నాటి 'ఖోల్' వాయిద్యం వలె వుండేవి.

ప్రస్తుతం మన అవగాహన కోసరం, అవనద్ధ వాయిద్యాల్ని, కొట్టి వాయించేవి (struck instruments); గీసి గాని లేక రుద్ది గాని (rubbed instruments) వావయించేవి అంటే ముంజేతితో గాని, వంచిన సన్న కర్రతో గాని ముఖం మీద రుద్దిగాని లేక గట్టిగా నొక్కుతూ గీసిగాని వాయించే రెండు రకాలుగా విభజిస్తే సరిపోతుందనిపిస్తుంది. కాని ఇలా రుద్ది వాయించే రకాల సంఖ్య చాలా తక్కువ. కొట్టి వాయించే రకాల సంఖ్య బాగా ఎక్కువ. వీటిలో తిరిగి ఉపశాఖల్లాగ, చట్రాలతో చేసిన ముఖాలు గలవి, లేనివి; వివిధాకారాల్లో వున్నవి, అనేక రకాలైన ముఖాలున్న వాటినిగా విభజించవచ్చు. ఈ వివరాల్ని క్రమంగా తెలుసుకుందాం.

చట్రాలతో చేసిన ముఖాలు గల వాయిద్యాల్లో, మొదట కర్రతోగాని, లోహంతో గాని చట్రం తయారు చేసుకుని దాని మీద చర్మాన్ని బాగా బిగిస్తారు. వీటిలో తరుచుగా చట్రపు అడ్డ కొలత వున్న లోత కంటె కొంచెం ఎక్కువగా వుంటుంది. చర్మం ఒక వైపు గాని, రెండు వైపులా గాని బిగింపబడుతుంది. ఈ రకంలోని సామాన్యమైన వాయిద్యం, 'సూర్యమండలం, చంద్రమండలం' లేక 'సూర్యపిరై, చంద్రపిరై' అనే వాయిద్యం. ఇది తరుచుగా మన రాష్ట్రంలోను, తమిళనాడులోను కనబడుతుంది 'పిరై' అంటే డోలు అని అర్థం. సూర్య, చంద్ర అనే మాటలు ఆకారానికి సంబంధించినది. 25 సెంటిమీటర్ల అడ్డ కొలత గల ఒక గుండ్రని లోహ చట్రానికి, ప్రత్యేకంగా తయారు చేసిన చర్మాన్ని బిగిస్తారు. దీనికే సూర్యమండలం లేక సూర్య పిరై అని పేరు ఇలాగే చంద్రమండలం లేక చంద్రపిరై, అర్థ చంద్రాకృతిలో తయారు చేసి, దానికి చర్మాన్ని బిగించి, రెండు పిరైలకు ఒకొక్క లోహపు పిడి ఉంచుతారు. ఈ లోహపు పిడి చిగురున, దారములతో

చుట్టి, వంపుగా వుండే లోహపు రేకు చట్రానికి (metal band) బిగించి ఉంటుంది. ఈ రేకు చట్రాన్ని తలకు తగిలించుకుని ఈ వాయిద్యాన్ని చిన్న కర్రలతో వాయిస్తారు. (చిత్రం : 9)


9. చంద్రపిరై లేక సూర్యపిరై

దేశంలో అంతటా బాగా విరివిగా కనపించే వాయిద్యాల్లో 'డప్పు' ముఖ్యమైనది. వాటి ఆకారం, నిర్మాణం, - ఇక పేర్లు సరేసరి, - ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క లాగ ఉటాయి. సర్వ సాధారణంగా వాటిని కర్ర బద్దతో కాని, లోహపు రేకుతో కాని గుండ్రంగా వంచి, చట్రం తయారుచేసి, చర్మం బిగిస్తారు. రాజాస్థాన్‌లోని 'ఘెరా' అనే డప్పు ముఖాలు, 7,8 ముక్కలు గుండ్రంగా వంచబడి ఉంటాయి. ఈ చర్మాన్ని బిగించడంలో తేడాలున్నాయి ఒక్కొక్కప్పుడు చర్మాన్ని చట్రం మీద పరచి, చట్రంలో చిన్న కన్నాలు పెట్టి, ఆ కన్నాల్లోకి చిన్న సన్నటి పుల్ల ముక్కలతో బిగించ వచ్చు. ఒరిస్సాలోని 'చెంగు' రకం డప్పు ఈ విధంగా ఉంటాయి. కర్ణాటకలోని కొన్ని రకాల డప్పుల్ని దారపు డాళ్ళ తోటి, చిన్న గుండ్రని 'రింగు'లతోను బిగిస్తారు. సాధారణంగా చర్మం, చట్రం మీద చదునుగా, అంచు మీదకు చిన్న మేకులతో దగ్గర దగ్గరగా బిగించబడి ఉంటుంది. ఈ డప్పుల్ని మెడలో తగిలించు కొని, నిలువుగా నిలబెట్టి, చేతులతోగాని, చిన్న పుల్లముక్కలతో కాని వాయిస్తారు. ఈ డప్పులన్నీ జానపద సంగీతాల్లోను, గిరిజనుల్లోను విస్తారంగా కానిపిస్తాయి. బిచ్చగాళ్ళలో కొంతమంది వీటిని పాటకు తాళంగా వాయిస్తారు. ఇవి శాస్త్రీయ సంగీతంలోగాని, సంగీత కచ్చేరీలకు గాని ఉపయోగపడేవి కావు. దీనికి 'డప్పు', డాఫ్లీ' అని పేర్లున్నాయి. ఆరబిక్ భాషలో దీన్ని 'డ్యాఫ్' (Daff) అంటారు. దక్షిణ దేశంలో వీటికి వివిధములైన పేర్లున్నాయి. తమిళ్ నాడులో దీన్ని 'తమ్మెట్టై, తప్పెట్టై' అంటే, కర్ణాటకలో దీన్ని 'తమ్మటె, తప్పెటె' అంటారు. తెలుగులో 'తమ్మెట, తప్పెట' అంటారు. ఈజిప్షియన్ భాషలో దీనికి 'తిమిబిటుట' అనిపేరు. ఈ పేర్ల పోలికలవల్ల కొంతమంది పండితులు, ఇది ఈజిప్టు దేశాన్నుంచి మన దేశానికి, శ్రీలంకకు దిగుమతి చేయబడ్డ వాయిద్యమని అభిప్రాయ పడుతున్నారు. శ్రీలంకలో

దీనికి 'తమ్మిటమ్మ' అని పేరు. మహారాష్ట్రలోను, కర్ణాటకలోను దీన్ని 'హలిగె' అంటారు. కన్నడ భాషలో 'హలిగె' అంటె చదునైన కర్ర చెక్క అని అర్థం, అంటే చదునైన ముఖము గలదన్నమాట. అందువల్ల దీనికి పేరు వచ్చి వుండవచ్చు. మహాభారతంలోను, నాట్య శాస్త్రలోను దీన్ని 'పటహ' అని సంబోధించారు. మధ్యయుగంలో పటహ అనే పదాన్ని ఢోళ్ళకు కూడ ఉపయోగించినట్లు తెలుస్తుంది. దీనికే ఇతర మైన పేర్లు, 'దయర', 'చంగ', 'కరచక్ర' మొదలైనవి ఉన్నట్లు తెలుస్తోంది. క్రీస్తుకు పూర్వకాలంలో దొరికిన 'భరహత్' (Bharhut) బొమ్మల్లోని ఒక తమషా బొమ్మలో, కోతులు కొన్ని ఈ రకమైన డప్పులు వాయించుకుంటూ ఊరేగుతున్నట్లు , 5 కోతులు ఒక ఏనుగు మీద ఎక్కి స్వారీ చేస్తున్నట్లు, ఇంకొక కోతి ఒక బాకా (Trumpet) ఊదుతున్నట్లు చూపబడింది. (చిత్రం : 10)



10. డాఫ్ లేక తమ్మెట

ఈ డ్యాఫ్ రకంలోనే చిన్న రకం, అంటే సుమారు 35 సెంటీ మీటర్ల అర్ధకొలతగల కర్ర చట్రంతో కాని, లోహ చట్రంతో కాని చేయబడిన దాని పేరు, 'ఖంజరి' అంటారు. దీన్ని సాధారణంగా చేతులతోనే వాయిస్తారు. ఈ ఖంజరి అనేదాన్లో ఒక ముఖ్యమైన తేడా, దాని చట్రంలో మధ్య మధ్యన చిన్న రేకు బిళ్ళలు కూడ అమర్చబడి,



సగాడా



సింధీ సారంగి



సంతూర్



ఖుంగ్



వీణ



పంబా



మొహోరీ

పంచముఖ వాయిద్యం



వాయిస్తేంటే 'జిన్ జిన్' మని (tinkle) ఒక చక్కని ధ్వనితో వినిపిస్తూంటుంది. ఇది జానపదుల వాయిద్యమే. పాశ్చాత్యదేశాల్లో దీన్ని 'టాంబురిన్' (tambourine) అంటారు. ముఖ్యంగా ఆ దేశాల్లో 'జిప్సీ' లనే బోయ జాతివాళ్ళు వాయిస్తూంటారు ఈ వాయిద్యం ఉత్తర భారత దేశ మంతటా బాగా వ్యాప్తిలో వుంది. అయితే వీటిలో పైన చెప్పిన చట్రం మధ్యలో రేకు చక్రా లుండవు. దక్షిణాదిన దీన్ని జానపదులే కాక, శాస్త్రీయ సంగీత కచ్చేరీల్లో సహిత, మృదంగ, ఘటం, మోర్సింగ్ మొదలైన లయ వాయిద్యాలతో కలిసి కంజీరాని కూడ ఆదరిస్తున్నారు. సంగీత కచ్చేరీల్లో ముఖ్యమైన గాయకుడు, గాయని లేక వాయిద్య కారుడు, ఒక కీర్తనో, పల్లవో పాడి, స్వర కల్పన చేసి ముగించిన తర్వాత, 2,3 లయ వాయిద్యాలు అనుసరించేవి ఉన్నప్పుడు, ఈ లయ వాయిద్యాల సామర్థ్య ప్రదర్శన కోసం, వారికి కొంత వ్యవధి ఇవ్వడం సాంప్రదాయం. అపుడు మృదంగం, ఘటం, కంజీర మొదలైన తాళ వాయిద్యాలన్నీ చేరి, తాళమున కనుగుణంగా, తాళ, లయ విన్యాసాలతో, మొదట ఒక్కొక్కరు ప్రత్యేకంగా శ్రోతల కెంతో రంజకముగా వాయించి, ఆఖరికి అందరు కలిసి మృదంగ శబ్దాలతో కూడిన నిర్దిష్టమైన విన్యాసాలతో ఎంతో రక్తిగా ముగింపు చేస్తారు. దీన్ని 'తని ఆవర్తం' లేక 'తని' అంటారు.

పైన చెప్పిన డప్పులకి, ఖజరి వాయిద్యాలకి వాడే చర్మం గొర్రె, మేక, ఎద్దు, గేదె చర్మాలు సాధారణంగా వాడుతున్నారు. కంజీరాకు మట్టుకు 'ఉడుము' (Igwana) చర్మం వాడతారని ప్రసిద్ధి. దీనిలో చర్మం మొదట వాయిద్యాన్ని తయారు చేసేటపుడే అంటించి బిగిస్తారు కనుక ఈ వాయిద్యాన్ని, - మృదంగం, తబ్లా, వాయిద్యాల్లో శృతి మార్చినట్లు, - శృతి మారి వాయించడానికి వసతి లేక ఏర్పాటు ఏమీ లేదు. కాని ఇటీవల పాశ్చాత్య దేశాల్లో చూసి, చర్మాన్ని చట్రానికి బిగించేటప్పుడు 'స్క్రూ' మేకు (screws) లువయోగిస్తున్నారని తెలుస్తూంది. స్క్రూ మేకులతో చర్మాన్ని బిగిస్తే, దీన్ని వేరు శృతులకు కూడ మార్చి వాయించడానికి వీలవుతది. చర్మానికి ఒక సాధారణ గుణముంది. వర్షాకాలంలో వున్నట్లుగా, చల్లటి గాలి తగిలితే అది ముడుచకొని పోయి, కొంత వదులై, దాని శబ్ద, 'డబ్‌డబ్' మంటూ మందగిలి పోతుంది. అలాంటప్పుడు దానికి కొంచెం వెచ్చగా నిప్పువేడి తగిలిస్తే, తిరిగి అది 'ఖంగ్' మనే మంచి ధ్వనితో మోగుతుంది. అలాగే వేసవిలో వేడివల్ల కావలసిన శబ్దాని కంటె ఎక్కువగా మ్రోగే ప్రమాదముంది. అటువంటప్పుడు వాయిద్యం వెనకవైపు చర్మంమీద కొన్ని నీళ్ళ చుక్కలు చల్లి సరిచేస్తుంటారు.

పైన చెప్పిన డప్పులు ఒక వైపు మాత్రం చర్మం బిగించిన రకాలు. వీటిలో రెండు వైపులా చర్మం బిగించి, రెండు ముఖాలున్నవి కొన్ని చోట్ల కనిపిస్తాయి, ఈ చట్రం డప్పులకు వాడే చట్రం లాంటివే కావడం వల్ల ఒక ముఖానికి, ఇంకొక ముఖానికి మధ్య వుండే దూరం తక్కువగా వుంటుంది. కనుక దాన్ని వాయిస్తే, ఆ నాదం 'లోతు లేని

నాదం' లా ధ్వనిస్తుంది. ఇలాంటి దప్పుల్లోవే, కేరళలోని 'మురిచెండ' అనేది, ఒరిస్సాలోని 'చద్పడి' అనే దప్పు రకాలు. సుమారు ఇలాంటి ఆకారం కలదే, లఢఖ్ ప్రాంతాల్లోను చుట్టు పట్ల కనిపించే 'గ్నా' అనే దప్పు. దీని చట్రానికి రెండు వైపులా తోలు బిగించి చట్రం మీద రంగులతో బొమ్మలు కూడ వేసి వుంటాయి. దీనికే ఒక పొడుగైన పిడికూడ ఉంటుంది. దీన్ని ఒక రకం వంపుగా వున్న కర్రతో వాయిస్తారు. దీనిలో పెద్ద రకాలైనవి కూడ ఉన్నాయి. వీటిని 'గ్నాచెన్' అంటారు. ఇవి పెద్ద చట్రాల్లో వేళ్ళాడేట్లు బిగించి, బౌద్ధమత పరమైన తాంత్రిక పూజల్లో వాయిస్తారని, - ఇవి వాయిస్తే, కోపానికి గురైన దేవతలందరి కోపం తొలగిపోయి,శాంతిస్తారని ప్రసిద్ధి.

లఢఖ్, భూటాన్, నేపాల్, టిబెట్ ప్రాంతాల్లో నివసించే బౌద్ధ మతాన్ననుసరించే 'షెర్పాలు' చేసే లామా నాట్యాలకు (Lamaistic Dances of the Sherpas) 'గ్నాఛమ్' అని పేరు. అప్పుడీ 'గ్నా' వాయిద్యాన్నిద్దరు వాయిస్తారు. మిగతా ఇద్దరు తాళాలు వాయిస్తారు. అనంత విశ్వంలోని సృష్టి, లయ విన్యాసాలు గౌతమ బుద్ధునికిలా



11. గ్నా

తెలిసివచ్చింతో, ఈ 'గ్నా' తాలూకు ధ్వనులు జ్ఞాపకం చేస్తూంటాయని చెప్పుకుంటారు. పరమశివుని 'ఢమరు' వాయిద్యానికి కూడ ఈ రకమైన ఆపాదన లున్నాయి. ఇంకా ఈ షెర్పాల్లో రోగుల, రోగ నిదానానికి, కారణ నిరూపణకు, చికిత్సకు కూడ ఈ వాయిద్య ముపయోగ పడుతుందని చెపుతారు. (చిత్రం : 11)

ఇదివరలో చెప్పినట్లు, ఢోళ్ళ తయారీ చాలా సులవైన పని. ఒక చెట్టు కొట్టి, ఆ మూలాన్ని కావలసిన ఆకారంలో, లోపల, పైన చెక్కివేసి, దానికి రెండు వైపులా చర్మంతో కప్పడం, అనాదినుంచి వస్తూన్న అలవాటుగా కనిపిస్తుంది. ఈ నాటికి కూడ, అస్సాంలోని 'ఖర్రమ్' (Kharram) వాయిద్యం, ఆంధ్రలోని రెడ్లు, మహారాష్ట్రలోని 'ధన్గార్' జాతివారు, ఉపయోగించే ఢోలు, చాలా పెద్ద ఆకారాల్లో తయారై, వాళ్ళ నాట్యాల్లోను, ఇతర పనుల్లోను ఉపయోగ పడుతున్నాయి. సింధు నాగరికతను చూపే బొమ్మల్లో కూడ, ఒక బొమ్మలో ఒకడు, వాడి తొడల ఎత్తుకు వ్రేలాడే పొడుగుపాటి ఢోలు వాయిస్తూన్నట్లు కనిపిస్తుంది.

ఢోళ్ళ జాతిలో 'భేరి' వాయిద్యాన్ని ముఖ్యంగా చెప్పాలి. ఇవి చాలా పెద్దవిగా తయారై, ఎక్కువ ధ్వని చేసేవిగా వుండి, ఉత్సవాల్లోను, వేడుక సమయాల్లోను, యుద్ధ సమయాల్లోను బాగా ఉపయోగపడేవని తెలుస్తూంది. రామాయణ కథలో హనుమంతుని బంధించి నపుడు, రావణుడు ఈ భేరీని, శంఖాన్ని వాయించమని ఆజ్ఞాపిస్తాడు. రామ, లక్ష్మణులు యుద్ధంలో మూర్ఛ నుంచి తేరుకున్నప్పుడు వానరులంతా ఈ భేరి, మృదంగ, శంఖాల్ని వాయిస్తూ సంతోషించారని చెప్పబడింది. మహాభారతంలోకూడ యుద్ధ భటుల నుత్తేజ పరచడానికి, ఇతరమైన వాయిద్యాలతో సహా ఈ భేరి వాయిద్యా న్నుపయోగించినట్లు చెప్పబడింది. బోధిసత్వుని జాతక కథల్లో, ఒక దానిలో ఇలా చెప్పారు.'బోధిసత్వుడు, వారణాసి ప్రాంతాన్ని ఒక గ్రామంలో పుట్టి, తన కుమారునితో కూడ, ధనార్జన కోసం ఒక 'సంత'కు వెళ్ళి, వర్తక వ్యాపారాలు ముగిసిన తర్వాత, వారు తిరుగు ప్రయాణంలో వుండగా, వారి ధనం దొంగిలించడం కోసం, కొంతమంది దొంగలు తరముకు వచ్చేరట. కుర్రవాడది గుర్తుపట్టి, దొంగల్ని భయపెట్టి మోసం చెయ్యడం కోసం, భేరీ వాయించడం మొదలుపెట్టి, విరామం లేకుండా అతి త్వరితంగా వాయిస్తున్నాడట. తండ్రి అది చూసి, 'మధ్య మధ్య విరామా లిచ్చి, భేరీ వాయిస్తే, ఎవరో మహారాజు గారి మార్గాన్ని వయనిస్తున్నట్లు దొంగలనుకుంటారు. విరామా లివ్వకుండా, బొత్తిగా తరుచుగా వాయిస్తే వాళ్ళకు మనం భయపడి వాయిస్తున్నా మనుకునే ప్రమాద ముంది, జాగ్రత్త!' అని కొడుకుని మందలిస్తాడు. కొడుకు, తండ్రి మాటను లక్ష్యపెట్టక, పదేపదే వాయిస్తూనే ఉన్నాడట. దొంగలది విని, కొంతసేపు భయంచేత, దాక్కుని, ఇంకొంచెం సేపు ఈ అతి తరుచుగా వస్తున్న చప్పుళ్ళ తీరు విని, 'వీళ్ళెవరో రాజులు కారు. వారి వద్ద స్వరక్షణ కోసం సిబ్బంది ఏమీ ఉండదు అని తెలుసుకుని, ధైర్యం చేసి వచ్చి, వీళ్ళిద్దరినీ చూసి పట్టుకుని, వారి వద్దనున్న

ధనాన్నంతా కొల్లగొట్టేరట'. అని ఈ కథ, - ఒక్కొక్క పనిని కావలసిన పరిమితిని దాటి, ఎక్కువగా చేస్తే, దాని ప్రయోజనం చెడిపోయే ప్రమాదముందని సూచించడానికి పేర్కొనబడింది.

పదమూడవ శతాబ్దంలోని సంగీత రత్నాకర గ్రంథంలో ఈ భేరీ నిర్మాణాన్నిలా వర్ణించి చెప్పబడింది. 65 సెంటీమీటర్ల పొడవుగాను, సెంటిమీటర్ల అడ్డకొలత గల ముఖాలతో, ఈ భేరీ వాయిద్యాన్ని రాగితో తయారు చేస్తారని, ఒక ముఖాన్ని చేత్తోను, ఇంకొక ముఖాన్ని 'కోణ' అనే కర్ర ముక్కతోను వాయిస్తారని చెప్పబడింది. ఈ భేరీల్లో 'రణభేరి' అని, 'ఆనదభేరి' అని, 'మదనభేరి' అని రకాలున్నాయని, ఆనందభేరిని గొల్లవారు తమ నాట్యాల్లోను, మదన భేరిని 'ధమర్' పాట పాడేటపుడు అనుసరణ కోసం ఉపయోగిస్తారని చెప్పబడింది.

ఈ రోజుల్లో డోళ్ళలో అనేక రకాలు కనిపిస్తాయి. పెద్ద రకాల్ని 'ఢోన్' అని, చిన్నవాటిని ఢోలక్' అని అంటారు. 'బ్యారెల్' ఆకారంలోని డోళ్ళకు కూడ ఇదే పేరుగా వుంది మన రాష్ట్రంలోను, తమిళ్‌నాడులోను కూడ 'పంబ' అనే ఒక రకం డోలుంది ఈ 'పంబ' వాయిద్యం, రెండు చిన్న రకం డోళ్ళను కలిపి పక్కపక్కల్ని కట్టబడి ఉండే ఒకే ఒక వాయిద్యం కొన్ని చోట్ల దీనిలో ఒకటి కర్రతోను, ఇంకొకటి ఇత్తడితోను తయారైనవి కావచ్చు వీటిలో కర్రతో చేసినదానికి 'పిరువనం' అని, ఇత్తడితో చేసినదానికి 'వెంగలపంబె' అని పేరుంది. దీన్నికూడ మెడమీద నుంచి, తొడల వద్దకు వేళ్ళాడదీసి వాయిస్తారు. ఈ పంబ వాయిద్యకారులు తామొక ప్రత్యేక తరగతికి చెందిన వార మనుకొని, వారి తెగను 'పంబల' వారమని చెప్పుకుటారు. (చిత్రం : 12)

ఈ గుండ్రని డోళ్ళ రకాల్లో, కేరళలోని 'చండ' వాయిద్య మంత ప్రసిద్ధైన వాయిద్య మింకొకటి లేదని చెప్పాలి. ఈ చంబ వాయిద్యాన్ని 'కథకలి' నృత్యాల్లోను, 'కూడియాట్టం' లోను, ఇంకా ఇతరత్రాను ఉపయోగిస్తారు. ఈ చండ వాయిద్యాన్నే కర్ణాటకలో యక్షగానాల్లో కూడ వాయించడం కద్దు. పనస కర్రతో గుండ్రంగా చేసిన, రెండు ముఖాలు గల ఈ వాయిద్యాన్ని, మెళ్ళో నిలువుగా వేళ్ళాడ వేసుకుని ఒక ముఖం మీదే రెండు చేతుల్లోను రెండు కర్ర ముక్కలతో వాయించడమొక విశేషం.



12. పంబై

ఈ చండ వాయిద్యాల్లోని రెండు, మూడు రకాల్లో – (1) 'ఉరుట్టు చండ' అంటే ఎక్కువ లయ విన్యాసాలతో వాయించేది; (2) 'వీక్కు చండ' అంటే ఒకే పెద్ద దెబ్బతో తాళంకోసం వాయించేది. మొదలైన రకాలున్నాయి. సాంచీ శిల్పాల్లో, ఒక శిల్పంలో, విదేశీ యుద్ధ భటులు ముందుగా ఈ వాయిద్యాన్ని వాయిస్తూ నడిచి పోతున్నట్లుగా చూపబడింది.

మధ్యలావుగా వుండి, రెండు వైపులా, ముఖాల దగ్గిరకు, క్రమంగా సన్నగిల్లే ఈ డోళ్ళ రకాలు చాలా పురాతన కాలం నుంచి కూడ ప్రసిద్ధాలే. 'గృహ్య' సూత్రాల్లో మృదంగాన్ని, 'నందిరితి' అనే ఇంకో అవనద్ధ వాయిద్యాన్ని, – ఈ నందిరితి వాయిద్యం కూడ డోళ్ళ రకం లోనిదే నని కొంతమంది పండితా భిప్రాయం, – పేర్కొనడం జరిగింది. తమిళ ప్రాచీన గ్రంథాల్లో కూడ 'మురసు' అనే డోలును తరుచుగా పేర్కొన్నటుల కనిపిస్తుంది. రామాయణం, మహాభారతాల్లో – (1) మృదంగం; (2) పటహ; (3) నంది వాద్య మొదలైన డోళ్ళను పేర్కొన్నారు. ఇవి యుద్ధాల్లోనే కాకుండా, ఉత్సవాల్లోను, సంబరాల్లోను కూడ ఉపయోగ పడేవి. రామాయణంలో వాల్మీకి, వర్ష ఋతువు నిలా వర్ణించాడు. 'భ్రమరాల 'ఝుం' కారం, తంత్రీ నాదం వలె, కోతుల 'కిలకిల' నాదాలు లయ విన్యాసాలుగా, చెట్ల పైకొమ్మలన్నీ గాలిలో 'పాడుతూ', నల్లని మేఘాలు 'మృదంగ' శబ్దాల్ని మోగిస్తూన్నట్లుగా వర్ణించాడు. జాతక కథల్లో, మృదంగాన్ని, 'పముఠజ' వాయిద్యాన్ని పేర్కొన్నారు. జైన సాహిత్యంలో కూడ డోళ్ళను పేర్కొనడం జరిగింది. మహాభారతాని కనుబంధమైన హరి వంశంలో, 'చాలిక్య' అనే సాముదాయిక గీతంలో, నారదుడు వీణ వాయిస్తున్నట్లు, కృష్ణుడ వేణువు వూదుతున్నట్లు, అర్జునుడు మృదంగం వాయిస్తూ తాళాన్నందిస్తున్నట్లు చెప్పబడింది. కాళిదాసుని రఘువంశ కావ్యంలో, స్త్రీల స్నాన వినోద ఘట్టాన్ని వర్ణిస్తూ, 'వాళ్ళు స్నానం చేస్తూ, పాటలు పాడి, నీళ్ళని మోది,, మృదంగ శబ్దాల వంటి ధ్వనుల్ని చేస్తుంటే, వొడ్డున నుంచుని పురి విప్పి ఆడుతున్న నెమళ్ళకు, వారికి కూడ ఆ శబ్దాలెంతో శ్రోత పేయంగా వినపడుతున్నా'యని అంటాడు. శ్రీ మద్భాగవత పురాణంలో ధ్రువుడు కైలాసానికి బయలు దేరిన ఘట్టం – 'ఉత్తాన పాదుని పుత్రుడైన ధ్రువుడు తనకు మోక్ష సమయ మాసన్న మైనదని తెలుసుకొని, మృత్యువు తలకాయ మీద తన కాలిని మోపి, ఆ దివ్య రథాన్ని అధిరోహించాడు. దేవతలు పైనుంచి మృదంగ, పనవ, దుందుభి మొదలైన వాయిద్యాల్ని వాయించారు. గంధర్వు లాతని స్తుతిస్తూ, పుష్ప వర్ష కురిపించారని' వర్ణింపబడింది. సాంచి, బర్హూత్ శిల్పాల్లో, ఈ డోళ్ళు, వేలకొలది సంవత్సరాల పూర్వమే ప్రసిద్ధమై వున్నాయని కనిపిస్తోంది.

భరతుని నాట్య శాస్త్రంలోను, ఆ తర్వాత కాలంలోను గ్రంథాల్లోను కూడ, మృదంగానికి, మృదంగ రకాలైన ఇతర వాయిద్యాలకి, విశిష్టమైన స్థానాన్నిచ్చి, ప్రత్యేకంగా వర్ణించబడుతూ కనిపిస్తాయి. భరతుడు 'పుష్కర' నామాన్ని, సామాన్య తాళ

వాయిద్యాలన్నింటికీ ఉపయోగించి, మృదంగం, వాటిలో వొకటని చెపుతాడు. అవి, వివిధ కారాల్లో వేర్వేరుగా ఉన్నాయి. 'మృదంగ' నామం కూడ ఇలాగే ఇతరమైన పేర్లతో సంగీత సాహిత్య గ్రంథాల్లో పేర్కొన బడింది. ఉదాహరణకు 'మురజ', 'మర్దళ' అనే పేర్లు చెప్పవచ్చు. అయితే ఈ వివిధ నామాల్లో, ఆకారంలో గాని, వాయించే విధానాల్లోగాని వ్యత్యాస వివరాలేమీ లేవు. ఇటీవలి కాలంలోని గ్రంథకర్త ఒకాయన మాత్రం 'మర్దళ' వాయిద్య వర్ణన ఇలా చేసేడు. '40 సెంటీమీటర్ల పొడుగు; మధ్య లావుగా వుండి రెండు ప్రక్కలకు క్రమంగా సన్నగిలే ఆకారం; రెండు ముఖాలు కలది; ముఖం అడ్డకొతల సుమారు 28 సెంటీమీటర్లు; ఇంకొక దానికి సుమారు 25 సెంటీమీటర్లు; కర్రతో చేయబడి, రెండు ముఖాల మీద, అన్నం, విభూతితో కలిసిన 'ముద్ద' అంటించి ఉన్నదని చెప్పారు. ఇంకా ఇతర రకాలైన మృదంగాలకి వర్ణనలు కూడ పూర్వ గ్రంథాల్లో చెప్పబడ్డాయి.

'మురజ' వాయిద్యం, మృదంగాన్ని, మర్దళాన్ని పోలిన ఆకారంలో ఉన్నట్లే తెలుస్తోంది; దాని ముఖాలు మాత్రం చిన్నవని తోస్తుంది. సంస్కృత గ్రంథాల్లోను, తమిళ 'సంగం' సాహిత్య గ్రంథాల్లోను 'మునసు' అనే వాయిద్యం చెప్పబడింది. ఈ 'మురసు' వాయిద్యంలో తిరిగి, 'వీర మురసు' అంటే యుద్ధాల్లో ఉపయోగించేది; 'త్యాగమురసు' అంటే మడి మాన్యాలు, అగ్రహారాలు, దానాలిచ్చే సమయంలో ప్రకటన కుపయోగపడేవి, కొన్ని రకాలని చెప్పబడ్డాయి. మురజ వాయిద్యం, ఇండోనీషియాకు కొనిపోబడిన దానిలా తోస్తోంది, ఏమంటే అక్కడి రకమైన వాయిద్యానికి 'మురవ' అని పేరుంది.

ఈ రోజుల్లో కూడ, మన మీ మృదంగ నామాన్ని అనేక రకాలైన రెండు ముఖాలున్న గుండ్రని వాయిద్యాలకి సాధారణమైన నామంగా వాడుతూనే ఉన్నాం. ఆకారంలోను, నిర్మాణంలోను, ఏమీ పోలికల్లేని ఈ వాయిద్యాల్ని దక్షిణాన్ని 'మృదంగ' అనే పేరుతోను, ఉత్తరాదిని 'పఖావాడీ' అని, బెంగాల్‌లో దీన్ని 'ఖోల్' అనే పేరుతోను వ్యవహరిస్తున్నాం. 'మర్దళ' రకానికి చెందిన 'మద్దళ' నామానికి కూడ ఈ రకమైన గందరగోళమే వర్తిస్తుంది.

దక్షిణ దేశంలో ప్రస్తుతం మృదంగ వాయిద్యా న్నొకదాన్నే కచ్చేరీల్లో అనుసరణ కోసరం ఉపయోగిస్తున్నారు. ఈ తరానికి ముందు అక్కడా అక్కడా, ఢోలక్, శుద్ధ మద్దళం వినవచ్చేవి. ఇపుడు వర్ణించబోయే మృదంగం, దక్షిణాదిన శాస్త్రీయ సంగీత కచ్చేరీల్లో ముఖ్యంగా మనం వినే మృదంగం. మృదంగ నామాన్ని సాధారణ నామంగా ఉపయోగించడం వల్ల, ఈ విషయం తిరిగి చెప్పవలసి వచ్చింది. ఈ క్రింద చెప్పబడిన మృదంగ వర్ణనలోని కొన్ని వివరాలు, పాఠకుల అవగాహన సౌలభ్యం కోసరం అనువాదకుడు సమకూర్చినవి. మృదంగం కర్రతో చేయబడి, రెండు ముఖాలుండి, మధ్య వున్న లావుపాటి భాగం (bulge) కొద్దిగా ఒక పక్కకి ఉంటుంది. దీని రెండు

ముఖాలు కూడ తోలు పొరలతో కప్పబడి, ఎడమ ముఖం, కుడి ముఖం కంటె కొంచెం పెద్దదిగా వుంటుంది. ఎడమ ముఖానికి 'తొప్పి' అనే పేరుంది. దీనిలో రెండు పొరలుంటాయి. పొర వలయాకారమైన తోలు ముక్క. ఈ వలయంలో తిరిగి మధ్య భాగంలో, కేంద్రం నుంచి కొంతదూరం తోలును వలయాకారంగానే కత్తిరించి వేస్తారు. ఈ తోలుకు పై భాగాన్ని చుట్టూ చీలి, ఆ చీలికలతో 'జడ' వలె (pinnal) మృదంగ ముఖం చుట్టూ అల్లుతారు. తోలుతో చేసిన 'పట్టా' (strap) ఈ జడ కింద ఉంచి, పైనుంచి చుట్టబడి, రెండు ముఖాలంచుల వద్ద అల్లిన జడలను బంధిస్తూంటుంది. క్రింది పొర సుమారు మృదంగ ముఖమంత అడ్డకొలతతో వుండి, పై పొర లోపలికి అంటించబడి ఉంటుంది. ఈ రెండు పొరలను ఒక అట్టవలె ఒకటిగా (unit) చేసి మృదంగపు ఎడమ ముఖాన్ని కప్పుతారు. ఈ పొరల్లో పై పొరకు గేదె చర్మాన్ని, లోపలి పొరకు మేక చర్మాన్ని ఉపయోగిస్తారని తెలుస్తూంది.

మృదంగం యొక్క కుడి ముఖం ఇంకా క్లిష్టంగా, నైపుణ్యంతో చేసేది. దీనిలో మూడు పొరలుండి లోపలి పొర మన కంటి కగపడదు. పై పొర కూడ, ఎడమ వైపు ముఖం మీది పై పొర వలె వలయాకారమైన తోలు ముక్క. ఈ రెండు పొరలకు మధ్యగా నొక పొర, సంపూర్ణంగా ముఖాన్ని కప్పుతూ బాగా బిగించబడి ఉంటుంది. ఈ మూడు పొరలను ఏక అట్టగా చేసి (unit) కుడివైపు ముఖాన్ని కప్పుతారు. ఈ కుడి ముఖం మధ్యన ఒక నల్లని 'బిళ్ళ' (ring) వలయాకారంగానే ఉంటుంది. ఈ బిళ్ళకు 'శోరు' లేక 'కరణి' లేక 'ముందు' అని పేర్లున్నాయి. కుడి ముఖంలోని పై పొరతో కూడ, ఎడమవైపు వలెనే 'జడ'నల్లి, ఈ జడను కూడ తోలు పట్టాతో బిగదీసి బంధిస్తారు. కుడిముఖం పొరకు లేగదూడ చర్మం (calf hide), మేక చర్మం ఉపయోగిస్తారని తెలుస్తూంది. ఈ కరణిని మాంగనీస్ పొడి, అన్నం, చింతపండు పులుసుతో బాగా మర్దించి తయారు చేస్తారని తెలుస్తూంది. మృదంగాన్ని, కావలసిన శృతికి కొంచెం హెచ్చు, తగ్గులుంటే, శృతి మార్చడానికి ఏర్పాటుంది. కొద్దిపాటి శృతి వ్యత్యాసాలను సరిదిద్దడానికి పైన చెప్పిన 'తోలు జడ' మీద, గట్టి రాతితోనో, చిన్న సుత్తితోనో కొట్టి సరి చేసుకొనవచ్చు. మృదంగాన్ని కచేరీలకు సిద్ధం



13 మృదంగం

చెయ్యడానికి, 'ఖోణం' అని పేరు గల, రవ్వతో గాని, పిండితో గాని తడిపి వయారుచేసిన ముద్దను ఎడమ ముఖం మధ్య భాగంలో అంటించి, కచ్చేరి అనంతరం దాన్ని తీసివేస్తారు. ఖోణం వల్ల మృదంగ నాదమున కొక విధమైన తోలు, నిశితత్వము ఏర్పడుతుంది. (చిత్రం : 13)

ఉత్తర భారతదేశంలో, కొంతకాలం క్రితం 'పఖావాజ్' వాయిద్యం, తాళ వాయిద్యాల్లోకెల్లా, మకుటాయమానంగా మహారాజువలె ప్రకాశించింది. 'ధ్రుపద్' సంగీతానికి, 'బీన్' వాయిద్యానికి, 'కథక్' ద్యాన్సులకు, భక్తి సంగీతానికి గూడ 'పఖావాజ్' వాయిద్యం అనుసరణలేని సంగీతం ఉండేది కాదు. ఇది చరిత్ర ప్రసిద్ధమైన వాయిద్యం. అలాంటి దిరోజుల్లో 'ఖ్యాల్' సంగీతం, సితార్ వాయిద్యం బాగా జనాదరణలోకి వచ్చాక, అతి సున్నితమైన నాద విశేషాలతో మెత్తగా వినిపించే 'తబ్లా' వాయిద్యం సంగీత లోకానికి మహారాజైంది. పఖావాజ్ వాయిద్య నాదం ఇంకా లోతైన, మందంగా వినిపించే నాదం. పఖావాజ్ మృదంగం కంటె కొంచెం పొడుగుగా వుంటుంది. దాని తయారీ గూడ క్రమంలోనే. రెండు ముఖాలు మృదంగంలో లాగే, చర్మం పొరలతో వుంటాయి. మృదంగ వాయిద్యాని కున్నట్లే దీనిలో కరణి కుడివైపు – దీన్ని ఉత్తరాదిని 'సాహి' అంటారు – ఉంటుంది. ఎడంవైపు, వాయించడానికి ముందుగా, 'పిండి ముద్ద' అటించడం దీనికి గూడ మామూలే. ఆకారం కొంచెం చిన్నా, పెద్దా తేడాలు తప్పిస్తే, దీనిలో గూడ రెండు ముఖాల చిగురున ఉన్న తోలు చీలికలతో 'జడ' అల్లి (plaits), రెండు ముఖాలున్న బంధించే తోలు పట్టా (straps)లు, వీటి క్రిదుగా గుండ్రటి కర్రముక్కల్ని గూడ ఉంచుతారు. ఈ కర్ర ముక్కల్ని పఖావాజ్ మధ్యకు జరిపితే, ముఖాలు బిగిసి, శృతి హెచ్చుతుంది. కర్రముక్కల్ని ముఖాల వైపుకు జరిపితే ముఖాలు వదులై, శృతి తగ్గుతుంది. కర్రముక్కలు ఇలా శృతి తగ్గడానికి, హెచ్చడానికి ఉపయోగపడతాయి. ముఖాల మీద 'జడల'ను, ఉత్తరదేశంలో 'గ్రజా' లంటారు. కొద్దిగా శృతులు మార్చడానికి, ఈ జడల మీద ఒక గట్టి రాతితో గాని, సుత్తితోగాని కొట్టి శృతుల్ని సరి చేసుకోవచ్చు. 500 సంవత్సరాల క్రితమే ఈ పఖావాజ్‌ను హిందీ సాహిత్యంలో పేర్కొనడం జరిగింది. అక్బర్ చక్రవర్తి స్నేహితుడైన అబుల్ ఫజల్ వ్రాసిన 'అయిని అక్బరీ' అనే గ్రంథంలో దీని వివరాలన్నీ విపులంగా వర్ణించబడ్డాయి. ఉత్తర దేశంలో ప్రాంతీయమైన కొద్ది కొద్ది తేడాలున్నాయేమోగాని, ఈ పఖావాజ్ మాత్రం చాలా కాలం నుంచి బహు ప్రసిద్ధమైన వాయిద్య మనటంలో సందేహం లేదు. ఈ శకంలో పఖావాజ్ వాయించే సుప్రసిద్ధుల్లో కొందరు, 19వ శతాబ్దానికి చెందిన 'కుదౌ సింగ్'ను, రాజస్థాన్‌లోని 'నథ్‌ద్వారా'కు చెందిన 'నానాపన్సే'ను, ఇంకా ఎంతో మంది ఈ వాయిద్యం వాయించి గౌరవ ప్రతిష్ఠ లార్జించిన వారున్నారు.

ఈ మృదంగ, పఖావాజ్ వాయిద్యాల తెగకే చెందిన వాయిద్యాల్లో, బెంగాల్‌లో ప్రసిద్ధిన 'శ్రీఖోల్' ఒకటి, మణిపూర్ ప్రాంతాల్లో ప్రసిద్ధిగా వుండే 'పుంగ్ వాయిద్యం'

రెండు. చైతన్య మహాప్రభుని బోధకు, ప్రభావానికి గురైన బెంగాల్ దేశంలో అనన్యమైన భక్తి శ్రీకృష్ణభక్తి. ఆ భక్తి మార్గాన్నవలంబించి ప్రజలు తరించడానికి 'కీర్తన్' లేక 'సంకీర్తన్' అనే భక్తి మార్గాన్నుపదేశించారాయన. ఇది బెంగాల్ దేశంలోనే గాక ఇంకా తూర్పుగా పయనించి అస్సాం, మణిపూర్ ప్రాంతంలోను, క్రిందకు ఒరిస్సాలోను కూడ వ్యాపించింది. భక్తి భావం హృదయమంతా నిండిన ఈ సాంప్రదాయంలో ఖోల్ వాయిద్యం సహితం 'శ్రీఖోల్' అయింది. వారి అపార భక్తికి వేరే నిదర్శన మింకేం కావాలి? ప్రాంతీయమైన చిన్న చిన్న తేడాలు తప్పిస్తే, ముఖ్యంగా ఖోల్ వాయిద్యం యొక్క ఎడమ భాగం బాగా పెద్దదిగా వుండి, కుడి ముఖం చిన్నదైనందున దీన్ని 'గోపుచ్ఛాకార'మని చెప్పాలి. ఈ ఆకారం తేడా ఒకటి తప్ప, మిగతా అక్షణాలన్నీ సామాన్య మృదంగ లక్షణాలే అని చెప్పవచ్చు. 'పుంగ్' వాయిద్యం యొక్క ఆకారం దీనికంటె కొంచెం చిన్నది. దీనిలో మధ్య వుండే లావుపాటి భాగం సరిగా మధ్యకు ఉంటుంది. అందుచేత దీన్ని, 'యవ' ధాన్యపు గింజ ఆకారంలో వుంటుందని చెప్పాలి. మిగిలిన వేమైనా వ్యత్యాసాలు ఉన్నా, అవి బహు స్వల్పాలు. శ్రీఖోల్, పుంగ్ వాయిద్యాలు రెండూ చేతితో వాయించే వాయిద్యాలే.

దక్షిణ దేశంలో చెప్పవలసిన అవనద్ధ వాయిద్యాల్లో 'తవిల్' (Tavil) చాలా ముఖ్యమైనది. దీన్ని ముఖ్యంగా నాదస్వర కచ్చేరీల్లోను, తాళ వాయిద్య కచ్చేరీల్లోను చూడవచ్చు. మృదంగం మాదిరి మధ్య లావుగా వుండి, ఇది 'హరీతకి' (Myrobolon) ఆకారంలో వుంటుందని చెప్పవచ్చు. కర్రతోనే చేయబడిన దీని ఆకారం మృదంగం కంటె కొంచెం చిన్నదిగా వుంటుంది. దీని చర్మ ముఖాలు రెండు మృదంగ ముఖాలంత పెద్దవిగానే ఉండి, గుండ్రటి 'ఉంగరాల'కు చుట్టబడి ఉంటాయి. ఈ ఉంగరాలని తోలుతో చేసిన 'అల్లిక' (lace) బిగిస్తూంటుంది. దీన్ని ఎడం వైపు కర్ర ముక్కతోను, కుడి వైపు వేళ్ళతోను గట్టిగా కొట్టి, పెద్ద ధ్వని వచ్చేటట్లుగా వాయిస్తారు. కుడిచేతి వేళ్ళ పెద్ద దెబ్బలతో పగిలి పోకుండా, వేళ్ళ రక్షణ కోసరం 'తొడుగు'లను (covers) ధరిస్తారు. అంత గట్టిగా వాయిస్తేనే గాని, ఈ వాయిద్యం నాద స్వరాని కనుగుణమైన ధ్వనులతో పాటను పోషించలేదు.

'ఢోలక్', 'ఢోల్' వాయిద్యాల్ని ఇదివరలో చెపుతున్నాం గాని, వాటిని వర్ణించలేదు. ఎందుకంటే, వీటిలో ఎన్నో విస్తారమైన రకాలున్నాయి. వాటిలో సాధారణ లక్షణం, రెండు ముఖాలున్న వాయిద్యాలని మాత్రం చెప్పగలం. పెద్ద రకాల్ని 'ఢోల్' లేక 'ఢక్' అని, చిన్న వాటిని 'ఢోలక్' అని అంటారు. వాటి ఆకారంలో చాల వ్యత్యాసం ఉంది. బెంగాల్‌లోని 'ఢక్' చాలా పెద్ద వాయిద్యం. 'ఢోలక్' వాయిద్యం చిన్నది గనుక బిచ్చగాళ్ళు వాయిస్తూంటారు. పెళ్ళిళ్ళలో స్త్రీలు గూడ దీన్ని వాయిస్తూంటారు. ఆకారంలో కూడా, అవి కేవలం గుండ్రంగా వుండేవి, మధ్య లావుపాటివి, చర్మాన్ని బిగించడంలో వ్యత్యాసాలు, ఎన్నో రకాలుగా కనిపిస్తాయి. ఢోళ్ళు, ఢోలక్‌లుకూడ,

మెడలో వేళ్ళాడవేసుకుని, నడుం దగ్గరగా ఉంచి, కర్రతో గాని, చేత్తో గాని, వాయించే వాయిద్యాలని చెప్పాలి. (చిత్రం : 14)

అవనద్ధ వాయిద్యాల్లో మూడో రకం, మధ్యభాగం సన్నంగా వుండి, ముఖాల వద్ద లావుగా వుండే రకాల వాయిద్యాలు. ఇది బాగా పురాణ ప్రసిద్ధమైన రకం. ఒకప్పుడీ



14. అటవికుల ఢోలె

రకం వాయిద్యాలు బాగా ప్రజాదరణలో వుండేవని, శాస్త్రీయ సంగీతానికి కూడ వీటిని ఉపయోగించే వారని తెలుస్తుంది. అది ఈ నాడు జానపద, గిరిజన వాయిద్యంగా మిగిలిపోయింది. మొహంజదారో త్రవ్వకాలలో ఈ వాయిద్యం, శిల్పాలల్లో, శిల్పాల బొమ్మల్లో, విగ్రహాల్లో, రంగు చిత్రాల్లో ఇది కనిపిస్తోంది. రామాయణ, మహాభారతాల్లో దీన్ని 'పనవ' అనే పేరుతోను, సూత్ర గ్రంథాల్లో గూడ ఈ వాయిద్యాన్ని పేర్కొనడం జరిగింది. జాతక కథల్లో 'డిండిమ' అనే పేరుతో పేర్కొన్నారు. తమిళ గ్రంథాల్లో, 'ఏటుక్కై' అని, 'ఇటక్కై' అని, 'తిమిలై' అని చెప్పారు. ఈనాటికి కూడ ఈ రకాల్లోని కొన్ని వాయిద్యాలు కనిపిస్తాయి. 'అవుజ్' అనే కరం వాయిద్యాన్నే, కొందరి అభిప్రాయంలో, సంస్కృతంలోని 'ఆతోద్య' నామానికి దగ్గిరగా వుందని, ఈ పదం సంస్కృతం నుంచి

వచ్చిందేనని అంటారు. సంగీత రత్నాకర కాలం నుంచి ఇది బాగా తెలిసొస్తోంది. 'అయినీ అక్బరి' గ్రంథంలో కూడ ఇది వర్ణించి పేర్కొనబడింది. ఇలాంటి మధ్యభాగం సన్నంగా వుండి, మునపటి కాలంలోను, ఈ కాలంలోను కూడ కనిపించే వాయిద్య రకాల్లో (1) 'హుడుక్క'; (2) 'డెరు'; (3) 'ఢక్క' లేక 'ఢంక'; (4) 'త్రివలి'; (5) 'బుడ్బుక్కె' లేక కుడుకుడుప్పె'; (6) 'తుది' అని అనేక రకాలు దేశ వ్యాప్తంగా వున్నాయి. ఇవన్నీ కూడ వాటి ఆకారంలోను, నిర్మాణంలోను, వాయించే విధానాల్లోను చాలా తేడాలతో, వీటిలో కొన్నిటికి ఒకే వాయిద్యానికి పలుచోట్ల వేర్వేరు పేర్లతో వ్యవహరింపబడు తున్నాయి.

దేశమంతటా తిరిగి కోతులను, ఎలుగుబంట్లను ఆడించేవాళ్ళు 'డమరు' వాయిద్యాన్ని బాగా వాడతారు. ఉత్తర భారతదేశంలో వీరు ప్రత్యేకంగా 'మదరి' జాతి వారమని ఒక తెగగా చెప్పుకుంటారు. 'డమరు' వాయిద్యం చాలా చిన్నదైనందున, చేతికి అమిరేట్టు, 10, 12 సెంటిమీటర్ల వాయిద్యంగా వుంటుంది. మధ్య సన్నంగా వుండి, రెండు చిన్న ముఖాలు తోలుతో కప్పబడి, లావుపాటి నూలు దారంతో కట్టబడి ఉంటుంది. మధ్య భాగంలో రెండు చిన్న దారం ముక్కలుండి, వీటి చివర్ని నూలు ఉండలతో వేళ్ళాడుతూంటాయి. డమరు వాయిద్యాన్ని చేత్తో పట్టుకుని, పక్కలకు ఆడించి, వాయిస్తే ఈ నూలు వుండలు తోలు ముఖాల మీద కొట్టుకుని, ఒక రకమైన 'బుడ-బుడ' మనే సొంపైన ధ్వని వినిపిస్తూంటుంది. ఈ ధ్వని చేస్తూ 'మదరి' బిచ్చగాళ్ళు పాటలు పాడుతూ కోతిని గాని, ఎలుగుబంటిని గాని ఆడిస్తూంటారు.

టిబెట్ ప్రాంతాల్లో కనిపించే 'డమరు' వాయిద్యం, నిర్మాణంలోను, ఉపయోగించే సందర్భాల్లోను వింతగా కనిపిస్తుంది. వీటిలో మళ్ళీ కొన్ని రకాలున్నాయి గాని, ఇవి ప్రత్యేకంగా 'ధర్మపాలుర'నే మత సాంప్రదాయ రక్షకులైన సన్యాసులు, ఉత్సవ సందర్భాల్లోను, ఆవేశ పూరితమైన ప్రకటనలకు, ఉత్సవ విరామాల్ని ప్రకటించడానికి ఉపయోగిస్తారని తెలుస్తోంది. మధ్య సన్నంగా వుండే ఈ డమరు వాయిద్యాన్ని ఇక్కడ 'న్గచంగ్' (Ngachang) అనే పేరుతో వ్యవహరిస్తారు. ఇది చందనపు కర్రతో చేయబడి, సుమారు 10 సెంటిమీటర్ల పొడవైనది. దీన్ని గట్టి రంగు గుడ్డతో గాని, తోలుతో గాని మధ్య భాగంలో కప్పుతారు. ఈ కప్పిన గుడ్డ గాని, తోలు గాని దీన్ని పట్టుకోడానికి కూడ పనికి వస్తుంది. ఈ న్గచంగ్, 'మ్చొద్ న్గ' (Mchod Nga) వాయిద్యాల్ని ఆ మత సాంప్రదాయ సన్యాసుల వద్ద చూడవచ్చు, గాని 'థోద్ న్గ' (Thod Nga) అనే ఒక అభూతమైన వాయిద్యముంది. మనిషి పుర్రెలను రెండింటిని ఒకదాని కొకటి వెనుకవైపు కుండేట్లు బిగించి, మనిషి చర్మాన్నే వాయిద్య ముఖాల్ని కప్పడానికి ఉపయోగిస్తారట. హఠాత్సంఘటనల్లో చనిపోయిన వారి పుర్రెలను, అవివాహితుల సంతానం తాలూకు పుర్రెల్ని, ఈ వాయిద్యాల్ని తయారు చెయ్యడాని కుపయోగిస్తారని తెలుస్తూంది. ఇలా తయారుచేసిన ఈ వింత వాయిద్యాన్ని మంత్ర,

తంత్ర కార్యకలాపాల్లో ఉపయోగిస్తారని చెబుతారు.

'హురుక్కా' వాయిద్యం, దీనికి పర్యాయపదాలు, 'హుడుక్క', 'డేరు', 'ఉడుక్కై', ఆకారంలో డమరు వలె వున్నప్పటికీ, ఇంకో జాతికి చెందినది. దీని పరిమాణం సుమారు 25 సెంటీమీటర్లు పొడుగుంటుంది. దీనికి చర్మం పొర ఒకటే వుండి, డమరు వాయిద్యంలో లాగ రెండు వైపులా చర్మంతో బిగిస్తారు. అయితే డమరు వాయిద్యంలో లాగ, దీనిలో చిగురున 'ఉండ'లున్న దారా లేమీ లేవు గనుక అక్కడ 'బుడబుడ' శబ్దాలేమీ ఉండవు. కర్రముక్కతో కొట్టి వాయిస్తారు. (చిత్రం : 15)

'తుది' అనే మధ్యభాగం సన్నగా వుండే వాయిద్యం, కర్ణాటకలోను, కేరళలోను పాటలకి, నృత్యాలకి వాయిస్తారు. కేరళ దేశంలో దీన్నొక వింత ప్రయోజనానికి



15. హుడక్క

ఉపయోగిస్తారట. గ్రామాల్లో దొంగతనం జరిగితే, దొంగని పట్టడానికి ఈ తుది వాయిద్యగాళ్ళను వినియోగిస్తారట. ఊళ్ళో జనాన్ని రచ్చబండ వద్ద సమావేశపరచి, ఈ తుది వాయిద్యం వాయిస్తూ వాడు దొంగతనాన్ని, దొంగను అనేక రకాలైన తిట్లతో దొంగయొక్క మనస్సు పరిపరి విధాల సంక్షోభించే విధానంగా ఉపన్యాసం మొదలెడతాడట. ఒక గంట, గంటన్నర సేపు ఈ ఉపన్యాసం విన్న దొంగ, మనస్సంతా 'కుతకుత' లాడిపోయి, పిట్టి తిరిగి తిట్టడమైనా తిడతాడు లేదా తన దొంగతనాన్ని ఒప్పేసుకుంటాడట. ఎలాగైనా వాడు పట్టు వడ్డట్టే గద!

'ఇడక్క' వాయిద్యం ఈ రకాల్లోకల్లా చాలా క్లిష్టమైన వాయిద్యంగా చెప్పాలి. దాన్ని గురించి తెలుసుకునే ముందు, దాని ధ్వనుల్లోని ప్రత్యేకమైన గుణం (tonal quality), హెచ్చు, తగ్గు ధ్వనులు (volume of sound), వాటి సొంపు మనం గుర్తించాలి. ఉండలతో గూడిన దారపు తాడు, ముక్కలు, దీని ముఖం తగిలేట్లు, దీన్ని మధ్య భాగంలో చేతి వేళ్ళతో పట్టుకుని, పక్కలకి వేగంగా ఆడించి వాయిస్తారని, 'బుడ్బుడ్కే' వాయిద్య వర్ణనలో ఇదివరకే చెప్పడమైంది. అయితే బొటనవేలు, చూపుడు, మధ్య వేళ్ళతో దీని మధ్య భాగాన్ని పట్టుకుని, మధ్య భాగానికి కట్టిన 'లేసు' దారాల్ని తన చేతిలో, లోపలుంచుకుని, వాయిస్తారు. ఈ వాయించేటపుడు, చేతిలోని లేసు దారాల్ని ముంజేతితో కొంచెం లాగుతుంటే, రెండు ముఖాల్ని బంధించే దారాలు వేళ్ళతో నొక్కబడి, ముఖం మీద కప్పిన చర్మాన్ని మరింత బిగువుగా చేయడం (tension) జరుగుతుంది. ఈ బిగిసిన చర్మం వల్ల వచ్చే ధ్వనులు, చర్మం వదులుగా వున్నప్పుడు వచ్చే ధ్వనులు, వాటి గుణం మారి (tonal quality) సొంపుగా, చెవుల కింపుగా వినిపిస్తాయి.

పైన చెప్పినట్లు వాయించడం, ముఖాల మీద చర్మం బిగించడం మొదలైన పనుల్లో, కేరళ దేశపు 'ఎడ్డక్క' (Eddakka) వాయిద్యం ఎంతో నైపుణ్యాన్ని, ప్రత్యేకమైన నేర్పరి తనాన్ని పుంజుకున్న వాయిద్యం. ఈ వాయిద్యం ప్రత్యేకంగా రాష్ట్రానికే చెందిన దేమీ కాదు. దేశంలో అంతటా ఎన్నో రకాలైన శిల్పాల్లో ముఖ్యంగా కర్ణాటకలో దీన్ని చూడవచ్చు. ఈ శిల్పాలు కూడ అనేక శతాబ్దాల పూర్వం నిర్మించినవి. అయితే కేరళలో ఇది విస్తారంగా ఉపయోగింపబడి, ఎంతో నేర్పరితనంతో తయారవుతూందని చెప్పాలి. ఇది కర్రతోనే తయారై, నాలుగో వంతు మీటరు పొడవుతో నిర్మించబడింది. చంద్రపిరై వాయిద్యంలో లాగ, దీని ముఖాల మీద చర్మం, ఒక చిన్న సన్నని లోహపు చక్రానికి (small metal ring) బిగింపబడి ముఖాల ముందుంటుంది గాని, ముఖాన్ని చర్మంతో బిగించలేదు. ముఖాల్లో మధ్యని సన్నని కొబ్బరి 'ఈనెలు' అమరుస్తారు. అందువల్ల ఇది వాయిస్తూంటే ఒక విధమైన 'జల్లినాదం' (Buzz) వినవస్తూంటుంది. ఇక్కడ మనం గుర్తించ వలసిన విషయం, చర్మ తిన్నగా ముఖాల్ని కప్పకుండా, పైన చెప్పినట్లు, గుండ్రటి 'రింగులకు' బిగింపబడి ఈ రింగులు ముఖాల మీదికి గట్టిగా బిగింపబడి ఉంటాయి. రెండు ముఖాల ముందున్న ఈ రింగులను లావుపాటి దారాలతో కట్టి బంధిస్తారు. ఈ దారాల్ని తిరిగి మధ్యనుండే సన్నటి భాగంలో ఇంకొక దారాల 'అల్లిక'తో (lace) నడుమును చుట్టి బిగిస్తారు. ఈ బిగించిన అల్లిక, వాయించే వాడి భుజాల మీద నుంచి వేళ్ళాడే 'పట్టా' (strap) తాడుకు కట్టి వేళ్ళాడుతూంటుంది.వాయించే వాడొక చేత్తో దీన్ని కర్ర పుల్లతో వాయిస్తూ, ఇంకొక చేత్తో, వాయిద్యానికి చుట్ట బెట్టిన, మధ్య నున్న లేసుతాడును లాగి, నొక్కుతూ వాయిద్య



16. ఇడక్క

ముఖాన్ని ఆనివున్న చర్మం బిగిసేట్లుగాను, వదులయ్యేట్లుగాను చేస్తూ వాయిస్తూంటాడు. ఇలా వాయించేటపుడు ఎంతో నేర్పుగా, చురుగ్గా, మన కంటికి ఏమీ కనబడకుండా ఉండేట్లు వాయిస్తూంటాడు. ఇలా వాయిస్తే దాన్నుంచి వెలువడే ధ్వని విశేషాలు అనేక రకాలుగా వుండి, ఒక్కొక్కప్పుడు రాగచ్ఛాయలు కూడ వినిపిస్తూన్నట్లు భ్రమ కలుగుతుంది. (చిత్రం : 16)

అవనద్ధ వాయిద్యాల్లో కుండలు, మూకుడులు, తొట్టిలు మొదలైన మట్టితో చేసిన వాయిద్యాల్ని మన మిపుడు కొంత పరిచయం చేసుకోవాలి. మట్టితో చేసిన వాయిద్యాలీ రోజుల్లో కూడ చాలా రకాలు అమల్లో వున్నాయి. ఇదివరలో చెప్పినట్లు, ఇంటిలో ఉపయోగపడే మృణ్మయ పాత్రల్ని తోలుతో కప్పి వాయిద్యాలుగా మార్చి వాయించడమే, ఈ రకమైన మట్టితో చేసిన వాయిద్యాలకి మూలాభిప్రాయమై వుండవచ్చు. కుమ్మరి

వాళ్ళ నైపుణ్యం పెరిగిన కొద్దీ, వీటి ఆకారాల్లోను, చిన్న పెద్ద తరహాల్లోను మార్పులు వస్తూ వచ్చాయి కాబోలు. భూమి దుందుభి మొదలైన వాయిద్యాలు, బహుశః వీరికి , భాండాల మీద, ఇతర పాత్రల మీద చేసే ధ్వనులు, పెద్దవిగా వినిపిస్తాయన్న నిజాన్ని (resonance) తెలియజేసి ఉండాలి. ఇలాంటి జానపద వాయిద్యాల్లో రాజాస్థాన్‌లోని 'పాబూజీకి మటే' (Pabuji ki mate) అనే వాయిద్యం పేర్కొన దగింది. దీనిలో రెండు కుండల్ని కలిపి వాయించడం ప్రత్యేకంగా చెప్పాలి; ఏమంటే, ఇప్పటి మన తబలా, డగ్గ కలిపి వాయించటం, ఆ కాలంనాటి అభిప్రాయమే కావచ్చు. అపుడే కుండల పెద్ద మూతుల్ని, తోలుతో కప్పి వాయించడం ఒకటే జరుగుతూండేదని చెప్పాలి. కర్ణాటకలోని 'పట్టదకల్లు' గ్రామంలోని దేవాలయం మీద కనబడే, 5 మొదలు 7 శతాబ్ద మధ్య కాలంలో చెక్కిన శిల్పాలే బహుశః మనకు దొరికే మొదటి మట్టి వాయిద్యాలని చెప్పాలి. కర్ణాటకలోనిదే ఇంకొక దేవాలయం మీద చిత్రంలో, మూడు కుండల్ని కలిపి కట్టి, చేత్తో వాయిస్తూన్నట్లు చూపబడింది. ఈ కుండలతో చేసిన వాయిద్యాన్ని సంగీత గ్రంథాల్లోను, ఇతరత్రా కూడ 'దర్దుర' అనే పేరుతో చెప్పినట్లు, ఇది క్రీస్తుకు పూర్వం కొన్ని వేల సంవత్సరాల క్రితమే ప్రసిద్ధమైనట్లు పేర్కొనబడింది. క్రీస్తుకు రెండు శతాబ్దాల పూర్వం, అంటే భరతుని కాలంలో, తాళ వాయిద్యాల్లో ఇది ఒక ముఖ్యమైన వాయిద్యంగా, - మృదంగ, పనవ మొదలైన వాయిద్యాలతో సమానంగా దీన్ని కూడ పేర్కొనడం జరిగింది. తర్వాత కాలంలో మాత్రం ఇది ఒక జానపద వాయిద్యంగానే మిగిలిపోయింది.

మన దేశంలోని బొమ్మల్లోను, పెర్షియన్ బొమ్మల్లోను, ఆఖరికి 'ఈసఫ్' కథలోని 'కొంగ, నక్క' కథలో కూడ చెప్పిన 'కూజా' లేక 'సురాహి' ఆకారంగల వాయిద్యమొకటి మరచిపోగూడదు. గుండ్రటి పొట్ట, పొడవైన మెడ గల ఈ రకాల వాయిద్యాలు వేరు వేరు ఆకారాల్లో వున్నాయి. కాశ్మీరులోని 'తుంబక్నరి' వాయిద్యం ఈ రకాల్లోదే. ఈ కూజా రకం వాయిద్యంలో మెడ వద్ద వుండే మూతిని చర్మంతో కప్పి కింది భాగం మాత్రం తెరిచే ఉంచుతారు. ఒళ్ళో నిలబెట్టుకుని వేళ్ళతో ఆ చర్మం మీద వాయిస్తారు. గోవాలోను, మహారాష్ట్రలోను ప్రసిద్ధమైన 'ఘుముట్' (Ghumat) వాయిద్యం, గుండ్రటి పొట్టతో, పొట్టి మెడ గలిగి ఉంటుంది. దీనిలో కింద భాగంలోని పెద్ద కన్నాల్ని 'ఉడుము' తోలుతో కప్పి, మెడ వద్ద వుండే చిన్న మూతిని తెరిచి వుంచి తయారు చేస్తారు. పైన చెప్పిన 'ఘుముట్' వలెనె కర్ణాటకలోని 'గుమ్మెటె' వాయిద్యం, మన రాష్ట్రంలోని 'బుర్ర' వాయిద్యం, తమిళ్‌నాడులోని 'జముక్కు' వాయిద్యాలు కూడ వుంటాయి కాని ఇవి ఇంకా నేర్పుతో తయారైనవి. సాధారణంగా వీటిని కంచుతో కాని, ఇత్తడితో కాని తయారుచేస్తారు. చర్మంతో కప్పబడి కూడ, 'తుంబక్నరి', 'ఘుముట్' వాయిద్యాల కంటె నేర్పరితనంతో తయారయింది. తుంబక్నరి వాయిద్యానికి తప్ప, వీటిని వాయించేటపుడు, తెరిచి వున్న ముఖాన్ని చేతితో కప్పడం, కొంచెంగా తెరవడం

వల్ల, ధ్వనుల్లో మంచి గుణం కూడా ఏర్పడుతుంది. అయితే ఇవన్నీ జానపద వాయిద్యాలే కాని, వీటిలో కొన్నిటి ప్రాముఖ్యత కూడ మనం మరవలేము. మన రాష్ట్రంలో 'బుర్ర' వాయిద్యాన్ని వాయిస్తూ, పాటలతో కూడిన కథలను చెప్పి, - దీన్ని 'బుర్రకథ' అంటారు,- జానపదులను చాలా సంతోష పరిచే వారెందరో ఉన్నారు.



17. బుర్ర, గుమ్మటి లేక గుమట్

ఈ బుర్రకథ ఇపుడు బాగా ప్రసిద్ధంగా బహుజనాదరణ పొందుతున్న కథాగానం. (చిత్రం : 17).

అనేక రకాలైన 'మూకుళ్ళ' ఆకారంతో చేసిన వాయిద్యాలెన్నో - వాటిలో చిన్న, పెద్ద తరహాలవి, లోతుగా వున్నవి, లేనివి, కోణాకారంగా వుండేవి, ఎన్నో రకాలున్నాయి. వాటి నన్నిటినీ మన మిక్కడ విశదీకరించడం కష్టంగాని, వాటిని. ఒక జాతిగా పరిగణించి, అందులో ఉదాహరణగా ముఖ్యమైన కొన్నింటిని చెప్పుకోవచ్చు.

ఈ రోజుల్లోని 'నగారా' ఆకృతితో వుండేదని చెప్పబడిన 'దుందుభి' వాయిద్యాన్ని చాలా పురాతనమైన కోణాకారంగల వాయిద్యంగా చెప్పాలి. దీన్ని 'వాజసనేయ' సంహిత, ఇకా ఇతర సంహితల్లోను, ఉపనిషత్తుల్లోను, బ్రాహ్మణాల్లోను, అంటే వేదకాలంలో అంతటా చెపుతూనే ఉన్నారు. ఈ రకం డోలు బహు ప్రసిద్ధంగా వుండేదని, దాన్ని వారు పూజించే వారని కూడ తెలుస్తోంది. దుందుభి మన మహా కావ్యాల్లో కూడ యుద్ధ సమయాల్లో ముఖ్యమైన వాయిద్యంగా చెప్పబడింది. ఈ రోజుల్లో దుందుభి వాయిద్యాన్ని పోలిక ఆకారంగల వాయిద్యాల్లో, మనకు తెలిసినంతవరకు, 'ధుంసా', 'నిస్సాన్'. 'నగారా' మొదలైన వాటిని చెప్పాలి. ఇవన్నీ జానపద, గిరిజన వాయిద్యాలే అనాలి. సంతాల్ జాతి గిరిజనులుపయోగించే 'ధుసా' వాయిద్యం, పలచటి లోహపు రేకులతో చేయబడి, బాగా సన్నంగా వుండే కింది భాగం, అతి పెద్ద నోరుతో కనిపించే చాలా పెద్ద వాయిద్యం. ఇంత పెద్ద వాయిద్యాన్ని కూడా, వాయించే వాడు బుజాల మీద వేళ్ళాడేట్లుగా మెడకు తగిలించుకొని, రెండు కర్రలతో దీన్ని వాయిస్తూ నాట్యం చేయడం వీరి కలవాటు. 'నిస్సాన్' అన్న వాయిద్యం, రామాయణమంత పురాతనమైనదైనప్పటికీ, గుజరాత్‌లోను, రాజాస్థానంలోను ఈనాడు చాలా తేడాలతో కనపడుతుంది. ఈ నిస్సాన్ వాయిద్యాన్ని, మధ్యయుగపు హిందీ పద్యాల్లోను, పదమూడవ శతాబ్దంలోని ఒక సంగీత గ్రంథంలోను కూడ పేర్కొన్నారు. ఆ రోజుల్లో ఇది కంచుతోనే, ఇత్తడితోనే, రాగితోనే చేయబడిన చాలా పెద్దగిన్నె ఆకారంగా చేసి, కర్రలతో వాయించే వాయిద్యం. బహు పురాతన కాలం నుంచి, దీన్ని యుద్ధ సమయాల్లో ఉపయోగించే వాయిద్యంగానే పేర్కొనడం జరిగింది. ఈ నాటికి కూడ ఒరిస్సా రాష్ట్రంలో దీన్ని చూడవచ్చు 'దల్కై' అనే వీరి నాట్యాల్లో పెద్ద గిన్నె ఆకారంలో వున్న ఈ వాయిద్యాన్ని, - దీనికి రెండు దుప్పి కొమ్ములు కూడ కట్టబడి ఉంటాయి, - మెళ్ళో వేలాడ వేసుకొని, తాళాని కనుగుణంగా అడుగు లేసుకుంటూ, కొమ్ములతో ఒకళ్ళ నొకళ్ళు కొట్టుకుంటూ, 'యుద్ధనాట్యం' చేస్తారు. ధుందుభి వాయిద్యాన్ని గుళ్ళలో నుంచి, పూజా సమయాల్లోను, దైవ కార్య ప్రకటనలకు, ఉపయోగించడం మనకు కనిపిస్తుంది. 'నగారా' వాయిద్యం ఉత్తర భారత స్థానమంతటా బాగా ప్రసిద్ధమైన వాయిద్యమే కాని, దాని పేరును బట్టి అది పశ్చిమ ఏషియానుంచి దిగుమతి అయిందేమో అనిపిస్తుంది. దీనిలో రెండు కోణాకారంలో వున్న డోళ్ళలో ఒకటి చిన్నది, ఇంకొకటి పెద్దది ఉంటాయి. దీనిలో చిన్న డోలు ధ్వని కొంచెం హెచ్చు స్థాయిలో వుంటుంది. దీన్ని 'మాడి' అని, 'ఆడది' అంటారు. పెద్దదాని ధ్వని కొంచెం లోతుగాను, పెద్దదిగాను ఉంటుంది. పెద్దదాన్ని 'నర్' అని, 'మగాడు' అంటారు. ఈ 'నకారా' లేక 'నగారా' వాయిద్యాన్ని జానపద నాటకాల్లోను, పెళ్ళిళ్ళలోను, మతపరమైన ఉత్సవాల్లోను వాయిస్తూంటారు కాని దీని అసలు ముఖ్యస్థానం 'నౌబత్ఖానా' కూట లోనిది. ప్రస్తుతకాలంలో ఈ నౌబత్ఖానా కూటాలకు ఆదరణ లేకుండా పోయింది, - ఏమంటే ఇపుడు జమీదారీలు, చిన్న ఎస్టేటులు అంతరించి పోయాయి. అవి బాగున్న

కాలంలో ఈ నౌబత్ఖానాకు ఒక ప్రత్యేక స్థలం ఏర్పాటై యుండేది. కోట గుమ్మాల్లో ఈ నౌబత్ఖానా కూటాన్నుంచి వాయించడం జరుగుతూండేది. నౌబత్ఖానా ఇంకా ఇతర వాయిద్యాలు కలిసి, రాజకార్యాలకి, యుద్ధ సమయాల్లోను, వినోదాలకు కూడ వాయించడం అలవాటుగా వుండేదని చెపుతారు. ఇలాటి వాయిద్య కూటాల్లో, ముఖ్యంగా అక్బర్ చక్రవర్తి యొక్క వాయిద్య కూటాన్ని, అబుల్ ఫజాల్ ఇలా వర్ణించి చెప్పేడు, 'నకర్ఖానా' లోని వాయిద్యాల్లో - (1) 'దమన' అని సాధారణంగా తెలిసిన 'కువర్గ' అనే వాయిద్యకూటం. ఇందులో 18 జతల వాయిద్యాలుండి పెద్ద లోతైన ధ్వని చేస్తూంటాయి; (2) 'నకరా' అనే కూటంలో సుమారు 20 జతల వాయిద్యాలుంటాయి; (3) 'దుహుల్' అనే కూటంలో నాలుగు వాయిద్యాల వాడతారని; (4) 'కర్న' అనే కూటంలో బంగారం, వెండి, ఇత్తడి మొదలైన లోహాల్లో చేయబడిన వాయిద్యాలుండి, నాలుగు వాయిద్యాలనయినా వాయిస్తారని; (5) 'సుర్నా' అనే కూటంలో మన దేశపు వాయిద్యాలు, పెర్షియన్ వాయిద్యాలుంటాయని, వాటిలో 9 వాయిద్యాల్ని కలిపి వాయిస్తారని; (6) 'నఫిర్' అనే కూటంలో మన దేశం వాయిద్యాలు, పెర్షియన్ వాయిద్యాలు, యూరోపియన్ వాయిద్యాలు కూడ వుండి, వాటిలో కొన్ని రకాల్ని వాయిస్తారని; (7) 'సింగ్' అనే రకంలో ఇత్తడితో చేసిన 'గోముకొమ్ము' లాకారంలో తయారైన వాయిద్యాలుండి, వాటిలో రెండింటిని కలిపి వాయిస్తారని; (8) 'సాంజ్' అనే తాళాల రకాల్లో మూడు జతల వాయిద్యాల్ని వాయిస్తారని చాలా వివరాలిచ్చేడు.

పూర్వకాలంలో ఈ వాయిద్య కూటం (band) నాలుగు 'ఘరిలు', అంటే నాలుగు సార్లు, అనగా సాయం సమయాల్లోను, ఉషః కాల మందు వాయించే వారని తెలుస్తూది. తర్వాత కాలంలో ఒకసారి అర్ధరాత్రి, ఒకసారి తెల్లవారు ఝామున వాయించేవారని చెపుతారు. ఒక సూర్యోదయ పూర్వం వాయించే 'సుర్నా' కూటం వాయించి, నిద్రపోయే వాళ్ళను లేపుతారట. ఒక 'ఘరి' సూర్యోదయ తర్వాత స్వల్పకాలం వాయిస్తారు. 'కువర్గ' కూటం కొచెంసేపు వాయించి, తర్వాత 'నకారా' కూటాన్ని విడిచిపెట్టి, 'కర్నా', 'నఫీర్' కూటాల వాయిస్తాయట. కొంత వ్యవధి తర్వాత 'నఫీర్' కూటం కాలాన్ని సూచిస్తుంది, 'సుర్నా' కూటం మళ్ళీ వాయిస్తారు. ఒక గంట తర్వాత 'నకారా' కూటమంతా కలిసి బాగా వాయిస్తారట. 'అయినీ అక్బరి' గ్రంథంలో వేరు వేరు వాయిద్యాలతో 7 రకాల సంగీతం ఎలా వాయించాలో వివరాలన్నిటినీ వర్ణించేడు. దమన లేక కువర్గ, దుహుల్, నకారా రకాల డోళ్ళు; కర్నా, సింగ్ రకాల బాకా వాయిద్యాలు; సుర్నా, నఫీర్, రకాల బూరాలు; 'సాంజ్' రకమనే తాళ వాయిద్యాలు, - సాంజ్ అన్న పదం మన ఝాంజ్ పదం లాగే కనిపిస్తూంది - ఇవన్నీ పూర్వం ఆ నౌబత్ఖానాలో వాయించే వాయిద్య విశేషాలు. (చిత్రం : 18)

గిన్నెల ఆకారంలోని కొన్ని వాయిద్య రకాలు దేశవ్యాప్తంగా కనిపిస్తాయి. వివిధ ప్రాంతాల్లోని వాటి రకాలు, రకాల పేర్లు ఇక్కడ వివరాలతో చెప్పడం చాల కష్టమైన



18. అటవికుల నగర

విషయం. కొన్ని గుర్తించ వలసిన రకాలు, - మహారాష్ట్రలోని 'సంబల్' వాయిద్యం; ఉత్తర భారత దేశంలో శహనాయ్ వాద్యాన్ననుసరిచే 'తాషా' అనే వాయిద్యం; కర్ణాటకలోని 'తాసె' వాయిద్యం; తమిళ్‌నాడు లోని 'టముకు' వాయిద్యాల్ని ముఖ్యంగా చెప్పాలి.

సితార్ వాయిద్యాన్ని గురించి తగాయిదా లున్నట్లే, తబలా వాయిద్యాన్ని గురించ కూడ, దాని చరిత్ర, పేర్లను బట్టి అనేక రకాలైన చర్చలు, వ్యాఖ్యానాలు, సాగుతూనే ఉన్నాయి. 'తబలా' అనే పేరు మాత్రం పెర్షియన్ పదం. కాని, ఇది అన్ని రకాల డోళ్ళకు ఒక సాధారణ నామం కూడ. అంత మాత్రం చేత అది పెర్షియన్ వాయిద్యమంటే ఎలాగ? మన దేశానికి వచ్చిన విదేశీయులంతా, ఇక్కడి వాయిద్యాన్నే ఈపేరుతో వ్యవహరించి ఎందుకుండకూడదు? ఇది 'నకారా' వాయిద్యాన్ని గురించిన గాయిదాలాగే ఉంది. మన దేశంలో అనాదిగా వస్తూన్న 'దుందుభి', 'నిస్సాన్' మొదలైన గిన్నెల ఆకారంలోని వాయిద్యాల వలెనే, ఈ నకారా వాయిద్యం కూడ కనిపిస్తుంది. తబలా మనదేవు వాయిద్యమే అనడానికి చాలా నిదర్శనలున్నాయి. కోణాకారం గల గిన్నెల వంటి

వాయిద్యాలు, క్రీస్తుపూర్వం, తర్వాత కూడ, ఎన్నో శిల్పాల్లో కనిపిస్తున్నాయే! 3 వ శతాబ్దలోని ఒక శిల్పంలో, ఒక స్త్రీ తన ఒళ్ళో 'టముకు' వాయిద్యం వంటి వాయిద్యాన్ని పెట్టుకుని చేతులతో వాయిస్తున్నట్లు కనబడుతుందే! మన 'దగ్గ' వాయించినట్లు ఒళ్ళో వాయిద్యాన్నుంచుకుని వాయించడం, -తబలా వాయించడంలో కూడ అలాగే ఒక దాన్ని ఒళ్ళో నుంచుకుని వాయించడం, మన పద్ధతి కాదు? అలాగే చేతులతో వాయించడం మన పద్ధతే. అలాగే తబలా వాయిద్య తయారీ కూడ, దాని ముఖాన్ని చర్మం పొరలతో తయారు చేసి కప్పడం మన పద్ధతే గద! ఎన్నో అవనద్ధ వాయిద్యాల తయారీలో ఇది మన కలవాటైన పద్ధతే, అదిగాక, చర్మం మీద కొద్దిపాటి బరువుతో వుండే 'కరణి' లేక 'శేరు' అంటించి వాయించడం మన దేశంలోను, బర్మా దేశంలోను కూడ అలవాటైన విషయం, రెండు రకాలైన డోళ్ళను కలిపి వాయించడం మన పద్ధతి, ఈ నిదర్శనాలన్నీ తబలా మన దేశలో అనాదిగా కనిపించే వాయిద్యాల కోవలోదే అనడానికి చాలు. ఎటొచ్చీ మధ్య యుగం తర్వాత, విదేశీయుల అధికారం చెలామణి అయిన రోజుల్లో మన వాయిద్యాలకే వారి నామధేయాలంటగట్టి, వాటిని కొత్తగా తమ స్వతమని చెప్పుకుంటూ వచ్చి నట్లు తెలుస్తూంది. పదునాలుగవ శతాబ్దంలోని అస్సాం సాహిత్యంలో, ఎక్కడో ఒక చోట, దీని విషయమేదో చెప్పింది ఉందిగాని, - అయిన అక్బరీ గ్రంథంలో గాని, దాని సమకాలీనమైన సంగీత పారిజాత గ్రంథంలో గాని దీని పేరు - అంటే తబలా అనే పేరు - ఎక్కడ వెతికినా కనపడదు.

ఈనాటి మన 'తబలా' రెండు డోళ్ళు కలిపి వాయించేది. రెండింటిలో ఒకటి అసలు



19. తబల మరియు దగ్గ

'తబలా' అనే వాయిద్యం, ఇంకొక డోలుకి 'దగ్గ', 'దుగ్గి', 'బాయన్' అనే పేర్లున్నాయి. తబలా తప్పకుండా కర్రతోనే చేస్తారు. తబలా యొక్క కింది భాగం పెద్దదిగాను వుండి, రెండు సెంటీమీటర్ల వెడల్పుతో వుండి ముఖాన్ని చుట్టి అంటుకు నుండే ఇంకొక తోలు వలయానికి (leather ring) అతకబడి ఉంటుంది.

ఈ తోలు వలయానికి హిందీ భాషలో 'చంటి', 'కినరా' అనే పేర్లున్నాయి. ఈ తోలు వలయాన్ని 'గజ్రా' అనే తోలు జడకి కుట్టి వేస్తారు. ఇపుడు దీన్నంతా కలిపి 'పూడి' అంటారు. ఈ పూడితో తబలా ముఖాన్నంతా కప్పుతారు. పైన చెప్పిన 'బ్రజా' అనే తోలు జడ మీద నుంచి, కింద నుంచి పోతున్న తోలు పట్టాతో కింద నుండే ఒక గుండ్రని తోలు ముక్కకి బిగిస్తారు. తోలు పట్టాకింద చిన్న కర్ర ముక్క లుంచుతార, ఈ కర్ర ముక్కల్ని కిందకి జరిపి నందువల్ల తబలా ముఖం బిగిసి శృతి హెచ్చడం లేక పైకి జరిపితే తబలా ముఖం వదులై శృతి తగ్గడం జరుగుతుంది. శృతిలోని కొద్దిపాటి హెచ్చు తగ్గుల్ని ముఖం అంచుగా దున్న 'గజ్రా' మీద గట్టి రాయితో గాని, సుత్తితో గాని కొట్టి సరిచేసుకోవచ్చు. హిందీ భాషలో 'స్యాహి' అనే కరణి లేక శోర' దీని ముఖం మీద కూడ ఉంటుంది. రెండవ డోలైన 'దగ్గ', ఆకారంలో తబలాకు కేవలం వ్యతిరేకంగా, అంటే కింద సన్నంగాను, ముఖం దగ్గిర బాగా పెద్దదిగాను ఉంటుంది. తబలా ముఖాన్ని 'పూడి' తయారుచేసి బిగించినట్లే దీనికి కూడ బిగిస్తారు. దీనిలోని 'స్యాహి' మధ్యలో వుండక, ఒక పక్కకి ఉంటుంది. దగ్గను ఈ రోజుల్లో లోహంతో చేస్తున్నట్లు తెలుస్తోంది కాని పూర్వం దీన్ని కూడ కర్రతోనే, మట్టితోనో చేసేవారు. దీన్ని శృతి చేయడానికి ఏర్పాటేమీ లేదు. తబలాను కుడి చేత్తోను, దగ్గను ఎడం చేత్తోను వాయిస్తారు. తబలా వాయించడలో కుడి చేతి వేళ్ళ చిగుళ్ళు, వేళ్ళ మధ్య భాగం, అరిచేయి నుపయోగించి వాయిస్తారు. దగ్గను ఎడం చేతి వేళ్ళ మధ్య భాగం తోను, అర చేత్తోను, అర చేతి కింద వున్న ముంజేత్తోను వాయించడం సాంప్రదాయంగా వస్తూంది. తబలా పై వాయించే శబ్దాలన్నిటికీ అక్షర సంకేతా లున్నాయి. మృదంగ వాయిద్యంలో కూడ ఇలాటి శబ్దాలకు 'శోల్ కట్టు' అంటారు. అలాంటి నియామకమైన శబ్ద సంకేతాలతోనే, తబలా వాయిద్యంలో, వేరు వేరు 'ఘరానా' లేర్పడ్డాయని చెప్పాలి. ఈ ఘరానాల్లో, 'ఢిల్లీ ఘరానా' అని, 'అజ్రాదా ఘరానా' అని, 'లక్నో-వారణాసి ఘరానా' అని, ఫరూకాబాద్ ఘరానా' మొదలైన రకాలున్నాయి. రెండు కంటె ఎక్కువ ముఖాలున్న డోళ్ళ రకాలు, ఎక్కడో బొమ్మల్లో తప్ప.

ఈ రోజుల్లో మనకు కనిపించడం లేదు. పురాణ సంగీత గ్రంథాల్లో 'త్రిపుష్కర' అనే పేరు కనిపిస్తుంది, కాని దాన్ని గురించి వేరువేరు వ్యాఖ్యానా లున్నాయి. ఒక అర్థంలో అవి, మనకు తెలిసిన మూడు. అంటే మృదంగ, పనవ, దర్దుర వంటి అవనద్ధ వాయిద్యాలు కావచ్చు. ఇంకొక అభిప్రాయం ప్రకారం, అవి వాయిద్యాల్ని వాయించే విధానాలకి సంబంధించినదని, అంటే ఇదివరలో చెప్పినట్లు, ఊర్ధ్వక వాయిద్యాల్ని

నిలబెట్టి వాయించడం; ఆంకిక లేక ఆంక్య అనే దాన్ని తొడకు దగ్గరగా పెట్టుకని వాయించడం; ఆలింగ్య అనే వాయిద్యాన్ని కౌగిలించుకొని వాయించడమే విధానాలకు సంబంధించిన మాట గనుక, మూడు వాయిద్యాల్ని మూడు రకాలుగా పెట్టుకొని వాయించడమంటారు. ఇంకొక అభిప్రాయంలో, ఒకటే వాయిద్యానికి వాయించే ముఖాలు మూడుండేవని, దాన్ని, 'త్రిపుష్కర' అనే పేరుతో వ్యవహరించారని అంటారు. కర్ణాటకలో విజయనగర సామ్రాజ్య రాజధానియైన హంపీ క్షేత్రంలోని శిల్పాల్లో మూడు ముఖాలు గల ఒకే మృదంగం కనబడింది. ఇదివరలో కర్ణాటకలోనే మూడు కుండలను ఒకటిగా కట్టి వాయిస్తున్నట్లు కనపడే దేవాలయపు బొమ్మలున్నాయని చెప్పుకున్నాం. రాజాస్థాన్‌లోని దిల్‌వారా గుడి మీద బొమ్మల్లో నాల్గు ముఖాలున్న డోలును ఒకడు వాయిస్తున్నట్ల చూపబడింది. కొన్ని దక్షిణ దేశ దేవాలయ శిల్పాల్లో కనిపించే 'పంచముఖ' వాయిద్యాన్ని, ఈ రోజుల్లో పూజా సమయాల్లో వాయించడం చూస్తున్నాం ఇత్తడితో గాని, రాగితో కాని చేయబడిన ఈ వాయిద్యాన్ని చిన్న బండి మీద కాని ఎక్కడకూ తీసుకుని వెళ్ళలేరు. దీని ఆకారమంత పెద్దదిగా వుంటుంది. దీని పైని 5 లావు పాటి గొట్టాల వంటి ముఖాలు (tubular projections) ఉన్నాయి. వీటిని ఆవు తోలుతో కప్పుతారట. ఇంకా ఈ పెద్ద వాయిద్యానికి, వాయించేటపుడు, 'కుడముళ' (Kudamuzha) అనే పేరుగల రెండు చిన్న వాయిద్యాల్ని కూడ చేర్చి, పక్కని పెట్టి వాయిస్తారని చెపుతారు. ఇపుడు పెద్ద వాయిద్యం సహా 7 ముఖాలున్నాయన్న



20. పంచముఖ వాయిద్యం

మాట. ఈ 7 ముఖాల్ని పురాణ ప్రసిద్ధమైన 'షడ్జగ్రామ' (Shadja Grama) పద్ధతిని శృతి చేస్తారని చెపుతారు. ఈ పెద్ద వాయిద్యంలోని 5 ముఖాలకు పేర్లున్నాయి. వీటిలో మధ్యవున్న ముఖానికి 'ఈశాన' అని, ఉత్తర ముఖానికి 'వామదేవ' అని, తూర్పునున్న ముఖానికి 'తత్పురుష' అని, దక్షిణ ముఖానికి 'అఘోర' అని, పశ్చిమ ముఖానికి 'సద్యోజాత' అని పేర్లున్నాయి. దీనికి 'దిక్సూచి' గా, వాయించే వాయిద్యకారుడు నిలబడ వలసిన చోటు ఉత్తరంగా ఉంటుందని, వాని ఎడం వైపు తూర్పు అవుతుందని, దక్షిణం, పశ్చిమం ఆ క్రమంలో నుంటాయని సూచింపబడింది.

రుద్దిగాని గట్టిగా గీసి కాని వాయించే వాయిద్యాల్ని (friction drums) గురించి తెలుసుకోవడానికి ముందు, డోళ్ళ ముఖ నిర్మాణ ప్రాముఖ్యం, వాటిని వాయించే వాధానాల వైశిష్ట్యం ఇంకొంచెం తెలుసుకోవాలి. డోళ్ళ నిర్మాణ నైపుణ్యం వల్లనే మన దేశం సంగీత ప్రపంచంలో ఒక ప్రత్యేక గౌరవాన్ని సంపాదించుకున్నదని చెప్పాలి. డ్యాఫ్, ఖంజరి లేక నగారా వాయిద్యాల్లో చర్మాన్ని, తిన్నగా వాయిద్య ముఖానికో, చట్రానికో అంటించేస్తారు; లేకపోతే కొన్నిచోట్ల దాన్ని ఒక గుండ్రని ఇనప చట్రానికో, కర్ర చట్రానికో గట్టిగా సాగదీసి కట్టి ఉంచి, తర్వాత దానితో డోలు ముఖాన్ని కప్పి అంటిస్తారు. ఈ సామాన్యమైన పద్ధతే పాశ్చాత్యులు కూడ వాళ్ళ డోళ్ళ తయారీలో చేసే పని. ఇంకా ఈ చర్మాలు కూడ ప్రత్యేకంగా తయారుచేసినవి కావు; బొత్తిగా సామాన్యమైనవి, ఈ రెండు కారణాల వల్ల - అంటే చర్మాన్ని తిన్నగా డోలుకు అతకడం, చర్మం కూడ సామాన్యమైనదై వుండడంవల్ల, ఈ డోలు ముఖం మీద జనించే ధ్వనుల్లో, సంగీతానికి బాగా పనికి వచ్చే నాద శుద్ధి (tonal value) ఉండదని, అలాంటివి వాయిస్తే తెలుస్తుంది. ఈ లోపాన్ని మన వాళ్ళు అనేకమైన ఉపాయాల వల్ల సాధించారు. మృదంగం, పఖావాజ్, తబలా వాయిద్యాల్లో ఈ లోపాల్లేకుండా, ధ్వనులన్నీ నాద శుద్ధితో, శ్రోత్రపేయంగా వినబడతాయి.

దీనిలో మొదటి మెట్టు చర్మాన్ని ఒకే మాదిరిగా, ఏవిధమైన ముడతలు మొదలైన లోపాల్లేకుండా, డోలు ముఖం మీద పరచగలగడం. పఖావాజ్ వాయిద్య ముఖం మీద చర్మాన్ని ఏ విధంగా పరుస్తారో ఇదివరలో సూచించడమైంది. అందులో 'చంటి' అనే, ముఖం చుట్టూ వలయాకారంలో పరుచుకున్న గుండ్రటి తోలు ముక్కకు, మధ్య పొరను అంటిస్తారని చెప్పబడింది. ఈ చంటిని, 'గజ్ర' అనే తోలు జడకు కలిపి కుడతారు, ఈ కుట్టడం అతి నేర్పుతో జాగ్రత్తగా చేస్తారు. పై కారణాల వల్ల చర్మం వాయిద్య ముఖం మీద ఒకే విధగా పరుచుకుని, వాయించేటప్పుడు, వాయిద్యముఖానికి తగిలి పాడవకుండా, ముఖ మధ్య భాగంలోనే కదులుతూ ఉంటుంది.

తర్వాత పని ఈ పొర మీద బరువుకోసం 'కరణి, శోరు' అంటించడం. ఇది పిండిముద్దగాని, రవ్వతో చేసిన ముద్దగాని అంటిస్తే తాత్కాలికంగా పని జరగవచ్చు కాని ఇదంత మంచి పద్ధతి కాదు. 5, 6 దశాబ్దాల క్రితం సి.వి. రామన్ మహాశయుడు, ఈ

విషయమై పరిశోధన చేసి, వాయిద్య ముఖానికి ఖరువు అంటిస్తే, వాయిద్య ధ్వనులు నాద శుద్ధితో వినిపించి, ఎంతో మనోహరంగా వుంటాయని నిరూపించారు. ఈ విధంగా స్వర క్రమబద్ధమై (regularly related tones) ధ్వనులు బాగా సంగీతోప యుక్తాలవుతాయి. ఈ విషయం మన వారికి భరతుని కాలంనుచీ, అంటే క్రీస్తుకు పూర్వం రెండు వందల సంవత్సరాలు నుంచీ తెలుసుననడానికి భరతుని నాట్య శాస్త్రమే నిదర్శనం. దానిలో ఆయన 'కరణి' తయారు చేసుకోవడానికి, – దీన్నాయన 'విలేపన' లేక 'రోహణ' కార్యమన్నాడు, – తగిన మట్టిని గురించి, ఇతర వివరాల్ని గురించి ఇలా చెప్పేడు. ' ఆ మట్టిలో ఏమి బెడ్డలు, ఇసుక, ధాన్యపు పొల్లు వగైరాలు ఏమిలేకుండా, తీసేయాలి. తెల్లగాను, విస్తారంగా ఘాటైన వాసన వేసేది, పచ్చని రంగులో వుండేది, పుల్ల హసనతో పుల్లగాను, చేదుగా వుండే రకానికి చెందిన మట్టి పనికిరాదు. ఏదైనా ప్రవహించే నది ఒడ్డున గాని, నీటితో కూడిన మట్టైతే, పిసికి వేసిన మట్టి పనికి వస్తుంది. ఇలాంటి మట్టి లభించకపోతే, గోధుమ పిండిని తడి చేసి, ముద్దచేసి కాని, బార్లీ పిండి కాని ఉపయోగించవచ్చు', కాని పిండి ముద్ద నుపయోగిస్తే, నాదం కావలసినంత బాగుండదని చెప్పేడు. 'సీసం' గింజల్ని (Sesame) నూరి ముద్ద చేసి , నెయ్యి మొదలైన నూనెలతో కలిపి అంటిస్తే, అలాంటిది బాగుండదన్నాడు.

అయితే ఈ పైన చెప్పిన సలహా ప్రకారం మనం ఈనాటికి కూడ ఎడమ ముఖానికి పిండి అంటిస్తూనే ఉన్నాం. కుడివైపు 'కరణి'ని తయారు చెయ్యడంలో ఎంతో లాభసాటైన ఉపాయాలను, దానికి కావలసిన ద్రవ్యాలను తయారుచేసుకుని వాయిద్యకారులు వాయిస్తూ వచ్చారు. మధ్య యుగంలో బియ్యపు పిండి కర్ర బూడిద. బెల్లంతోను కరణి తయారుచేసి ఉపయోగించేవారు. 17వ శతాబ్దంలో ఇనప రజను వాడేవారని తెలుస్తోంది. ప్రస్తుత కాలంలో ఇంకా నైపుణ్యంగా, 'గ్లూ' అనే జిగురు తోను, ఇనుము లేక మాంగనీసు పొడుంతోను, బొగ్గు పొడితోను, బియ్యంగాని, గోధుమగాని పిండితోను బాగా మర్దించి తయారు చేస్తున్నారు. దీన్ని చర్మం మీద కావలసినంత వలయాకారంలో అంటించి, దాన్ని ఒక నునుపుగా వున్న రాతితో రుద్ది మెరుగు (polish) పెడతారు. రెండవసారి అది ఆరిపోకుండా, తిరిగి పైన చెప్పినట్లు, కొంచెం చిన్నదైన వలయాకారంగా మందును అంటిచి, మళ్ళీ రాతితో 'పాలిష్' చేస్తారు. ఇది ఆరిపోకుండా మూడవసారి, నాలుగవసారి ఇలా 15, 20 సార్లు వలయాకారాన్ని తగ్గిస్తూ మెరుగు పెడుతూ వస్తారు. ఇలా చేసి వలయాన్ని తగ్గిస్తూ మెరగు పెట్టడం వలన కరణి మధ్య భాగం ఎత్తుగాను, పక్కకి పోనుపోను పలచగాను తయారవుతుంది. కరణికి కావలసిన వలయం, మృదంగ ముఖాన్ని బట్టి, ఎంత బరువు కావలసి వస్తుందో, ఏ శృతులకు మృదంగాన్ని సరివరచాలో మొదలైన విషయాలు ముందుగానే నిర్ణయించుకుంటారు.

పైన చెప్పినట్లు పఖావాజ్, లబటా, మృదంగాలను వాయించే టపుడు, అనేక రకాలైన శబ్దాలతో తాళాని కనుగుణంగా వాయించడం జరుగుతుందని తెలుసుకున్నాం.

తాళం యొక్క కాల ప్రమాణాన్ని ఖండాలుగా విభజించి, ఆ విభజించిన ఖండాలను సరియైన అక్షర శబ్దాలతో సరిజూసి నోటితో చెప్పడం, ఈ అక్షర శబ్దాల కలయిక వల్ల (rythmic patterns) నుంచి తాళ కాలగతిని సరిజూసుకుంటూ వాయించడం, చాలా కాలం నుంచి మన సాంప్రదాయం. ఇటువంటి కాల ఖండాల్ని అక్షర శబ్దాలతో ఉచ్ఛరించడాన్ని, మృదంగ వాయించేవారు 'శొల్‌కట్టు' అంటారు. తబలా వాయించేవారు 'బోల్' అంటారు. పఖావాజ్ వాయించేవారు 'తాపి' అంటారు. అక్షర శబ్దాలు వాయిద్యం మీద వాయించి పలికేప్పుడు, చేతిలో ఏవేళ్ళను, వేళ్ళ భాగాలను, ఎంత ఉపయోగించాలి, అరచేతి దెబ్బ ఎక్కడ వాయించాలి, ముంజేతి నెలా ఉపయోగించాలి, ఇదంతా ఇక శాస్త్రీయ పద్ధతిలో జరుగుతున్న విధానం. సంగీత గ్రంథాల్లో దీన్ని 'పటాక్షర' అని, 'పట' అని, 'అక్షర' అని చెప్పేరు. సంతాలు అనే గిరిజనులు సహితం, వారు వాయించే డోళ్ళశబ్దాలకు 'రద్' అనే పేరుతో వ్యవహరించేవారని తెలుస్తూంది. 'పట' అనే పేరుగల ఈ అక్షర శబ్దాలకే హిందూస్థాని సంగీతంలో 'పరన్' అని, 'థైదా' అని, 'రేలా' అని పేర్లున్నాయి. దక్షిణాత్యు లీశబ్దాలకే 'శొల్‌కట్టు' లంటారు. ఈ శబ్దాల్ని మనస్సులో గుర్తు చేసుకుంటూ, తాళగతికి అనుకూలంగా వాయించడమే, వాయిద్యకారుల నేర్పరితనాన్ని మనకు తెలియజేస్తూంటుంది.

రుద్ది వాయించే డోళ్ళ వాయిద్యాలు (friction drums) మన దేశంలో చాల తక్కువ. దక్షిణాదిని 'మరియమ్మ' దేవతను పూజించేవారు వాయించే వాయిద్యాన్ని 'బుర్బురి' అంటారు. ఇది రెండు ముఖాలు గల గుండ్రని (cylindrical drum) డోలు వాయిద్యం. ఇది వాయించడంలో కుడి చేత్తో తాళానికి కావలసిన దెబ్బలతో, కర్ర ముక్కలతో వాయిస్తూ, ఎడమ ముఖంమీద ఇంకొక వంచిన కర్ర ముక్కతో రుద్ది లేక గీసి వాయిస్తారు. తమిళనాడులో ఇలాంటి వాయిద్యానికే మధ్య సన్నంగా వుండే (hour glass) డోలు నుపయోగిస్తారని తెలుస్తూంది. దీని పేరు 'ఉరుమి' అంటారు.

# 5

# సుషిర వాయిద్యాలు

గాలి వాయిద్యాలు లేక ఊది వాయించే వాయిద్యాలు లేక సుషిర వాయిద్యాలను గూర్చి తెలుసుకోవడానికి అంటే వాటి ప్రథమ దశను, పరిణామ చరిత్రను ఊహించడానికి మనకు దొరికే ఆధారాలు మిగతా వాయిద్యాలకంటె తక్కువని చెప్పాలి. త్రవ్వకాలలో మట్టి డొళ్ళు తాళాలు, తీగెవాయిద్యాల అవశిష్టాలు మొదలైనవి దొరుకుతాయి, కాని గాలి వాయిద్యాల్లో ఎక్కడో ఒక కొమ్ము, ఊదే మట్టి బూరా తప్ప, చాలా తక్కువ దొరుకుతాయి. ఈ కారణం వల్ల వాటి నిర్మాణాన్ని, ప్రథమ స్వరూపాల్ని, సంఘంలో అవి ఎంత ప్రాముఖ్యంగా వుండేవి మొదలైన విషయాలు శోధించడం కష్టమవుతుంది.

గాలి వాయిద్యాల్ని ఆదిమానవు లెలా కనుగొన్నారు? వాటి ప్రాథమిక స్వరూపా లేవిధంగా వుండేవి అంటే ఏదో మనం కొంతవరకు ఊహించుకోవడం తప్ప, దానికి నిదర్శనాలు, సాక్ష్యాలు మనకు విస్తారంగా కనుపించవు. అడవుల్లో వుండే వెదురు పొదల్లో, ఒక వెదురుకు కన్నముంటే, దానిలోకి గాలి దూరి, 'ఈల' వలె వినిపించి, మానవునికి అది ప్రథమ 'వేణు'ని స్వరూపంగా తోచిందేమో! కాని, దీనిలో మానవ యత్నమేమీ లేదు, అంటే ఆ వెదురు 'వేణు'ని వాళ్ళు తయారు చేయలేదుగద! అందుచే మన మనస్సుతో కొంత ఆలోచించాలి. ఆలోచిస్తే – నోటితో 'ఈల' లేక 'ఈల' వెయ్యడం ఒకటిగా తోస్తుంది. ప్రకృతిలోని పక్ష్యాదులు గమనించి, కుర్రవాళ్ళు, పెద్దవాళ్ళు కూడ 'ఈల' నోటితో వేయడం నేర్చుకుని ఉండవచ్చు. సాధారణంగా గ్రామాల్లోని జనం, మర్యాదకోసం, నోటికి చేతిని అడ్డంగా పెట్టి మాట్లాడ్డం మనలో కొంతమంది గమనించి ఉండవచ్చు. బ్రెజిల్ దేశంలోని ఆటవికులు కొందరు, గుండ్రని గొట్టంగాని, కోణాకారంగా వున్న వస్తువును గాని నోటి దగ్గర పెట్టుకుని మాటలు మాట్లాడ్డం; దానితో వాళ్ళ కేకలు, పాటలు కూడ పాడడం, – భూతాల్ని, దెయ్యాల్ని, బెదర గొట్టటం కోసం, – అలవాటుగా వుండేదని తెలుస్తూంది. అలాగే న్యూగినీ దేశంలో శంఖాన్ని నోటి దగ్గిర పెట్టుకుని మాట్లాడ్డం, పాట పాడడం అలవాటును చూసిన వారున్నారు. మన గ్రామాల్లో నిప్పు అంటుకోవడానికి ఒక గొట్టంతో గాలి ఊదడం అలవాటేగద! సన్న మూతి గల పాత్రలుగాని, సీసాలుగాని చూస్తే కుర్రవాళ్ళు వాటిలోకి గాలి ఊది వినోదించడం తరుచుగా చూసే విషయమే. ఈ విధంగా, గాలి ఊది, శబ్దాల్ని కలిగించి వినోదించడం లోనుంచే గాలి వాయిద్యాల ప్రాథమిక దశ ఏర్పడి వుండవచ్చు.

కర్రతో చేసిన గాలి వాయిద్యాలు మనకు త్రవ్వకాలలో దొరికే అవకాశం లేదు, ఏమంటే కర్ర మట్టిలో వుండలేక చీకిపోయి కాలగర్భంలో నశిస్తుంది త్రవ్వకాలలో మనకు ఇంతవరకు అక్కడక్కడ కనిపించినవి, మట్టిబూరాలు, ఎముక బూరాలు, మొదలైనవి. మధ్య యుగంలో కొన్ని కన్నాలు గల వేణువులు, శంఖాలు, లోహాలతో తయారైన బూరాలు దొరికాయి. ఇంకా ఇటీవలి కాలంలో వెదురుతో చేసిన వేణువులు, బాకాలు మొదలైనవి కనపడ్డాయి. ఇంకా ఓబో, శహనాయి, నాగస్వరం మొదలైన వైతే బొత్తిగా దగ్గిర కాలం లోనివేనని తెలుస్తుంది. సింధు నాగరికతను సూచించే త్రవ్వకాలల్లో మనకు పక్షి ఆకారంలో ముగిసే మట్టి బూరాలు దొరికాయి, అందుకోసం వాటిని 'పక్షి బూరాలు' (Bird Whistles) అన్నారు. ఈ రోజుల్లో సహితం హిమాలయ ప్రాంతాల్లో ఎముకతో చేసిన 'ఊలలు' దొరుకుతూంటాయి. ఆంధ్ర, ఒరిస్సా ప్రాంతాల్లో నివసించే సవరలనే గిరిజనులు 'ఫ్లూట్' (flute) ను కనుగొన్నారని ఒకానొక పండితుని అభిప్రాయం. న్యూగినీ దేశంలో మొట్టమొదట 'ఫ్లూట్' ఎలా కనుగొనబడిందో తెలిపే ఒక కథ ఇలా చెపుతారు. 'ఒకానొక రోజున ఒకడు తన భార్యతో కూడా అడవిలోకి పళ్ళు ఏరుకోవడం కోసం వెళ్ళాడట. వాడొక చెట్టుపై కెక్కి పళ్ళు కింద పడేస్తూంటే, వాటిని భార్య తన వలతో పట్టుకుంటోందట. హఠాత్తుగా వాడు పైనుంచి పడేసే పండొకటి, ఎండి, చీకిపోయిన ఒక వెదురు కర్ర మీద పడి, దాన్ని ఒక కీచుమనే ధ్వనితో మధ్యకు చీల్చి, విరగ్గొట్టిందట. అంతట ఆ వెదురు కర్రలో నుంచి 'కాసోవరి' (Cassowary) అనే ఒక జాతి పక్షి, వింతైన కూత కూస్తూ, ఎగిరిపోయిందట. అతని భార్య అది చూసి కంగారు పడి భయంతో పారిపోయిందట. చెట్టుపై కెక్కిన వాడు కిందకు దిగి, ఆ వింత చూసి తను గూడ ఆశ్చర్యపడుతూ, ఆ వింతను ఊళ్ళో వారందరికీ చెప్పేడట. వాళ్ళందరు ఆ వింత విని, అడవిలోకి వచ్చి, వెదురు కర్రలు విరిచి, ఆ పక్షి కూతవంటి కూతలు వినవచ్చేలాగ, 'బూరా'ల వంటివి చెయ్యడం మొదలు పెట్టేరట. అందువల్ల వాళ్ళకు వెదురు గొట్టాలతో ఊదితే పక్షి కూత వంటి ధ్వని వస్తుందని తెలిసిందట. అలా వాళ్ళు వెదురు గొట్టాలు ఊదడం నేర్చుకున్నారని చెపుతారు.

డోళ్ళ మాదిరిగానే, గాలి వాయిద్యాలు, ముఖ్యంగా వేణువు, బాకాలు -సాంఘిక, మతపరమైన అనేక కార్యకలాపాల్లోను, ఆచారాల్లోను ఉపయోగించే వాయిద్యాలు. ఈ రెండు వాయిద్యాలు కూడ, ఆటవిక జాతుల్లోను, తరువాత వచ్చిన 'నాగరికుల్లోను' కూడ వాళ్ళ లైంగిక జీవితపు అలవాట్లతో పెనవేసుకున్న వాయిద్యాలు. ఆటవికుల్లోని కొన్ని జాతుల్లో బాకాని చూసిన స్త్రీని చంపేసే అలవాటుండేదట. ఏమంటే బాకా 'పురుషుని చిహ్నం'. తత్వ శాస్త్రజ్ఞుల కొందరి అభిప్రాయంలో, ఇవి పురుష చిహ్నాలు గనుకనే యుద్ధ ప్రేరణ కోసం వాడేవారని, వేణువుకు కూడ ఇలాంటి సాంకేతిక దృష్టి చాలాకాలంగా వస్తూంది. ఉదాహరణకు : న్యూగినీ దేశంలో 6 మీటర్ల పొడవైన

వేణువులను లైంగికమైన విధుల్లో ఉపయోగించేవారని తెలుస్తోంది. అస్సాంలోని 'లోటానాగుల' కార్యకలాపాల్లో, ఒక మీటరు పొడుగైన వేణువు ముఖ్యమైన వాయిద్యాల్లో ఒకటి. మిల్సు దొర వధువుల నన్వేషించే ఆటవికుల్లోని ఆచారాన్నొకదాన్ని చెప్పేడు. బ్రహ్మచార్లు నివసించే ప్రత్యేకమైన 'మూరుంగ్' లనే పెద్ద హాల్లో, వాళ్ళు వేణువుతో కొన్ని రకాలైన స్వరాలు వాయిస్తూంటారట. ఏ స్వరాలతో కూడిన పాటో, అది ఏ స్త్రీ కోసం వాయిస్తున్నాడో, ఆది వినే ఆటవికులందరికీ బాగా సువిదితమేనట. తూర్పు కొండల్లోని 'సీమానాగుల' ఆచారాన్ని వర్ణిస్తూ హట్టన్ దొరగారిలా చెప్పేడు. 'వాళ్ళలో 'ఫులులూ' అనే వారి వేణువుని స్త్రీలు వాయించడం చాలా తప్పు పని. - ఏమంటే, వాళ్ళు 'ఫులులూ' వాయిద్యాన్ని బాగా వాయించి, కుర్రవాళ్ళ నందర్నీ పాడు చేసి, తాము కూడ పాడైపోతారు. విత్తనాలు చల్లిన తర్వాత, అవి తిరిగి పంట పండి, కోత లైపోయేవరకు పురుషులు కూడ వేణువు వాయించ కూడదట. ఏమంటే, వాళ్ళ వేణువు వాయిద్యం వల్ల విస్తారమైన గాలి పుట్టి, పంటంతా రాలిపోతుందట. ఇంక మన శ్రీకృష్ణుని వేణునాదం గోపికలందర్నీ ఆకర్షించి, ఆహ్వానించడం కోసంమేనని పురాణ గాథల వల్ల మనకి తెలిసిన విషయమే. బృందావనంలోని గోపిక లందరూ వేణువును చూసి అసూయ పడిపోతూ ఇలా అంటారు. 'ఈ వేణువు ఎంత పుణ్యం చేసుకుందో, ఆ శ్రీకృష్ణపరమాత్ముని పెదవుల దగ్గిర ఉంటూ, మనకి చెందవలసిన ఆయన అధరామృతాన్ని ముందుగా తానే గ్రోలుతూ, మనకి ఆఖరుకి ఆ ఉచ్ఛిష్టం మాత్రం మిగులిస్తూంది' అని. ఇంక పెళ్ళి పెద్దలైన నదులూ, వెదురు పొదరిళ్ళు తమ కుమార్తె వేణువు, శ్రీకృష్ణుని పెదవుల దగ్గిర నాట్యం చేస్తూన్న 'వివాహం' చూసి, సంభ్రభపడిపోతూ 'ఆనందాశ్రువులు' రాలుస్తున్నాయట. ఆయితే శ్రీకృష్ణుని అమర వేణుగానం మానవులకు జీవాత్మ పరమాత్మల సంయోగాని కొక అలౌకిక దివ్య సందేశం కూడాను. అలాగ శ్రీకృష్ణ గోపికా ప్రణయాన్ని, రాధాకృష్ణుల అమర ప్రణయాన్ని జీవాత్మ పరమాత్మల దివ్య సంయోగంగా, గుర్తించి, మన మహాభక్త కోటులందరూ గానంచేస్తూ తరించారు. ఈ ప్రణయ గాథలో మన వేణువు పాత్రను మాత్రం మనం మరిచిపోలేం. మానవ మనస్సు నీవిధమైన భక్తి మార్గంలో క్షాళన చేసి, పునీతం చేస్తే, భగవంతుడీ మానవ కళేబర వీణను, తన 'దివ్యగానానికి' వినియోగించుకుంటాడని మన తత్వవేత్తల విశ్వాసం. ఆఖరు విషయం, కొన్ని రకాల మానసిక రుగ్మతల్లో, వేణునాద, నకారాధ్వనులు, ఉరుములు మొదలైన ధ్వనులు మనస్సులో వినబడతాయని నిదర్శనాత్మకమైన సత్యంగా నిరూపింపబడింది.

గాలి వాయిద్యాల్ని రెండింటిగా విభజించవచ్చు. మొదటి తరగతిలో 'రీడ్' (reed) అంటే వలచని బద్ద, ఒక విధమైన బొప్పగడ్డితో చేసిన బద్దను ఉపయోగించకుండా వాయించేవి. వీటిలో చిన్న బూరాలు, బాకాలు, కొమ్ములు, వివిధాలైన వేణువులు మొదలైనవి ఉండి, వీటిని ఇంకా విభజన చెయ్యడానికి కూడ అవకాశముంది. రెండవ తరగతికి చెందిన వాటిలో ఒకటో, రెండో బద్ద లొక గొట్టానికి

అమర్చినవి. వీటిని కూడ ఇంకా విభజన చేయవచ్చు. ఇంత వరకు చెప్పిన వాయిద్యాల్లో గొట్టంలోపల స్పందించే గాలి యొక్క నిలువు కొలత వల్లనే, దాని యొక్క స్వర స్థాయి, గుణం (pitch and quality of sound) ఏర్పడతాయి. మనం పెదవులతోగాని, బద్ద లేక రేకు (reed) ద్వారాగాని గాలిని ఊది గొట్టంలోకి పంపుతున్నాం. హార్మోనియం వాయిద్యంలో గాలి ప్రవాహం ఇత్తడి రేకును చలింప చేస్తోంది గనుక అక్కడ ధ్వని పుట్టడానికి ఆ రేకు కారణంగాని, గాలి కాదు. అదుచేతనే హార్మోనియం వాయిద్యాన్ని గాలి వాయిద్య మనడం ఎంతవరకు సమంజసమో ప్రశ్నించవలసిన విషయం.

ఇంక ప్రాథమికంగా మనకు లభించిన 'సషిర' వాయిద్యాల్లో, జంతువుల కొమ్ములు, ఎముకలు, శంఖాలు, తర్వాత కాలంలోని వెదురు గొట్టాలు, కర్ర గొట్టాలు వగైరా ఉన్నాయి. వీటిని ఎలా వినియోగించుకున్నారో తెలుసుకోవాలి. జంతవుల కొమ్ములు, మనకు తెలిసినంత వరకు, చాల పురాతనమైన బాకాలు. సుమేరియన్ నాగరికతలో మనకు 'సి.ఇమ్' (Si-im) అనే వాయిద్య మొకటుంది. వాళ్ళ భాషలో 'సి' అంటే కొమ్ము. 'ఇమ్' అంటే గాలి. ఈ కొమ్ములు బహుశః మొదట ఎద్దులవై వుండవచ్చు. తర్వాత కాలంలో అవి లోహంతో చేసినవై వుండాలి. యూదుల (Jews) పాత గ్రంథాల్లో మేక కొమ్మును, గొర్రె కొమ్మును చెప్పారు. ఈ కొమ్ముల్ని నీటిలో మరగబెట్టి, అవి మెత్త బడగానే, వాటిలోని గుజ్జును బయటికి తీసివేసి, వాటిని తయారు చేసేవారని తెలుస్తోంది. 'షొఫర్' అనే పేరుతో ఈ అడివి మేకల కొమ్ముల్ని, వాళ్ళు కొత్త సంవత్సర వేడుకల్లో ఉపయోగించేవారని తెలుస్తోంది. ఈ షొఫర్ వాయిద్యాన్ని బంగారపు రేకుతో కప్పేవారట. ఉపవాస దినాల్లో వాళ్ళు గొర్రెకొమ్ముల్ని వెండి రేకుతో కప్పిన వాటిని ఉపయోగించేవారని తెలుస్తోంది.

ఈ కొమ్ము వాయిద్యాల్ని బట్టి మనకు ప్రాథమిక దశలో పెదవులతో తిన్నగా కొమ్ములోకో, లేక గొట్టంలోకో గాలి ఊదేవారని తెలుస్తోంది. ఊదడానికి బద్దనిగాని, బద్దవంటి సాధనాన్నిగాని, అంటే 'మౌత్‌పీస్' (mouth piece) ఉపయోగించడం, తర్వాతకాలంలో నేర్చుకున్న విషయమని తెలుస్తోంది. 'మౌత్‌పీస్' అంటే గాలి ఊదే స్థలంలో ఒక చిన్న బిళ్ళను అతికి ఉంచుతారు. అందువల్ల పెదవులను ఆ బిళ్ళకు ఆనించి, గాలిని తేలిగ్గా, స్వల్పంగా (light blowing) గాని, కావలిస్తే విస్తారంగా (heavy blowing) గాని ఊది ధ్వని విశేషాల్ని పెంచవచ్చు. కొమ్ములు, శంఖాలు ఒక కొన నుంచి ఊదేవి (end blown trumpets) అనేవి. కొన్ని గొట్టాలకు కన్నం కొసని ఉండక ఒక పక్కని ఉండవచ్చు. వీటికి 'మౌత్‌పీస్' ఉండదు. ఇవి పక్కని ఊదే (side blown trumpets) వాయిద్యాలంటారు. మొత్తంమీద ఈ కొమ్ములు, శంఖాలు, బూరాలు, బాకాలు వగైరాలు, ఊదేవాళ్ళ పెదవుల్లోంచి వచ్చే గాలి మీద ఆధారపడి ఉంటాయి, కాని

వాటిని మన సంగీతానికేమీ ఉపయుక్తాలు కావని చెప్పాలి. అవి కేవలం బట్ట బయల్లో వాయించేవే.

ఈనాటికి మన జానపదులు, గిరిజనుల వారి సంగీతాల్లో కొమ్ముల్ని ఉపయోగిస్తూనే వున్నారు. సంస్కృతంలో కొమ్ముని 'శృంగ' అంటారు, గనుక గ్రంథాల్లో 'శృంగ' అనే పదమే మనకి కనిపిస్తుంది. ద్రవిడ భాషలో అది 'కొంబు' అయింది. ప్రాథమిక దశలో అవి జంతువుల కొమ్ములే అయివుండాలి, గాని తర్వాత కాలంలో లోహాలతో తయారైన బాకాల్ని కూడ కొమ్ములనేశారు. దీనితో మనకి కొంత సందేహానికి తావేర్పడుతుంది. గిరిజనుల్లో కూడ 'శృంగ' అనే పదం బాగా వ్యాపించింది. భిల్లుజాతి గిరిజనులు దాన్ని'సింగే' అంటే, మధ్యప్రదేశ్‌లోని 'మరియ' జాతివారు 'కోహల్' అంటారు. ఈశాన్యలో వుండే 'అంగామీ' జాతివారు గేదెకొమ్ముల్ని 'రెలికి' అంటారు. 'లోటానాగులు' కూడ ఈ కొమ్ముల్ని ఉపయోగిస్తారు. ఇది సుమారు అర్థమీటరు పొడుగుండి, ఊదేచోట ఒక చిన్న వెదురుగొట్టం కూడ (మౌత్‌పీస్) అతకబడి ఉంటుంది. 'సంతాల్' జాతి వారు'సక్వా' అనే పేరుతో గేదె కొమ్మును పయోగిస్తారు. ఉత్తర్‌ప్రదేశ్‌లో కొన్ని చోట్ల 'విసాన్' అనే పేరుతో గేదె కొమ్ముల్ని, కొన్ని చోట్ల 'సింగి' అనే పేరుతో లేడి కొమ్ముల్ని కూడ ఉపయోగిస్తారు. లేడి కొమ్ము శివప్రీతి కూడాను. ఇంతవరకు చెప్పిన కొమ్ముల రకాలన్నీ వాటి కొసలనుంచి ఊది వాయించేవి, గాని ఒరిస్సాలోని సంతాల్ జాతి గిరిజనులు 'సింగ' లనే పేరుతో వున్న కొమ్ముకు పక్కని కన్నముండి, ఆ కన్నం లోంచి ఊది వాయిస్తారు. ఈ కొమ్మును పక్కనుంచి వాయించేది (side blown) అనాలి

జానపద సాహిత్యంలో ఈ కొమ్ము బూరాలు, పక్కనుచి వాయించే రకాలు కూడ కనిపిస్తాయి. మన జానపద సాహిత్యంలో 'కటంరాజుకథ'లో నల్ల సిద్ధి యుద్ధానికి బయలుదేరే ఘట్టం ఇలి వర్ణించబడింది. 'యుద్ధ భటులు నఫేరీ, బూరగ, కొమ్ము మొదలైన బాకాలను వాయిస్తూ, భూమంతా దద్దరిల్లి పోయే ధ్వనులతో, శౌర్యప్రతాపాలతో యుద్ధానికి బయలుదేరి వెళ్ళేరని చెప్పేరు. అయితే ఈ 'సింగ', 'కొంబు' పేర్లను, లోహాలతో చేసే అనేక రకాల బాకాలకు కూడ ఉపయోగించి నందువల్ల, అవి జంతువుల కొమ్ములా లేక లోహాలతో చేసిన కొమ్ములా అనే సందేహం కలుగుతోంటుంది. సంస్కృత గ్రంథాల్లో కొన్ని చోట్ల మాత్రం ఈ వివరం తెలిసొస్తోంటుంది. జాతక కథల్లో 'తురీయ' అనే పదం కనిపిస్తుంది కాని ఆ పదం ఇతర వాయిద్యాలన్నిటికీ వర్తించే సామాన్య పదం. పాలి భాషలోని 'మిలింద ప్రశ్న' అనే బౌద్ధగ్రంథంలో 'సింగ' అనే పదాన్ని వాడారు. మహాభారతంలో చెప్పిన 'గోవిషనిక' అనే పదం ఆవు కొమ్ముకు వర్తించి ఉండవచ్చు. శ్రీకృష్ణుడు గోపాలకుడు గద! ఆయన్ని భాగవతంలో 'శృంగప్రియ' అని వర్ణించేరు. ఆయన శృంగాన్ని పూరించి, గోపాలురను మేలుకొలిపినట్లు ఒక చోట వర్ణించేరు. సంగీత మకరంద గ్రంథకాల నుంచీ, శృంగాన్ని సుషిర వాయిద్యాల్లో ఒక దానినిగా వర్ణిస్తున్నారు.

ప్రస్తుతం దక్షిణ దేశంలో మనం చూసే 'కొంబు' వాయిద్యం ఇంగ్లీషు అక్షరం C (సి) ఆకారలో పున్న ఒక బాకా. ఇది ఇత్తడితో కాని, రాగతో కాని, మూడు భాగాలుగా తయారైన వాయిద్యం. ఊదే కొన వద్ద, ఒక పలచని, గుండ్రని రేకు ముక్క (mouth piece) తో కూడ అమరివుంటుంది. రెండవ కొన దగ్గర బాగా పెద్ద గొట్టం వలె వుండి



21. కాలి కొమ్ము

విపులంగా వుంటుంది. దీన్ని పెళ్ళి సందర్భాల్లోను, ఉత్సవాల్లోను - ఆఖరికి మానవుల 'అంతిమ యాత్రల' సందర్భంలో కూడ వినియోగిస్తారు. వీటిలో చిన్న రకాల్ని 'తిమిరికొంబు', పెద్దవాటిని 'బారీ కొంబు' అంటారు. (చిత్రం : 21)

ఈ కొంబు రకమే, ఇంకొక బాగా పెద్దదిగా వుండి, ఇగ్లీషు అక్షరం S (ఎస్) ఆకారంలా ఉన్న 'కొంబు' ఒకటుంది. దీనికి పలుచోట్ల పలుపేర్లున్నాయి. ఉత్తర ప్రదేశ్‌లో దీన్ని 'తురి' అంటారు. రాజాస్థాన్‌లో దీన్ని 'బంక్య' అని, 'బర్గు' అని అంటారు. కర్ణాటకలో ఇది 'బంకే' అయింది. మధ్యప్రదేశ్‌లో ఇది 'రణ్‌సింగా' అయితే, హిమాచల్ ప్రదేశ్‌లో 'నర్‌సింగా' అయింది. గుజరాత్‌లో దీన్ని 'నాగ్‌ఫణి' అంటారు. పేరును బట్టి దీని ఆకారం పాములా ఉండి, దాని చివరి భాగంలో పాము



22. నరసింగ లేక రనసింగ్

పడగ ఆకారంలో చీలిన నాలికతో కూడ (Motif) వుంటుందని ఊహించవచ్చు. (చిత్రం : 22)

అతి ప్రాచీనమైన తిన్నగా వుండే బాకా ఎముకతో చేసినదై వుదాలి. ఇది మన దేశంలో అంతగా కనబడ్డం లేదు, కాని ఎక్కడో హిమాలయ ప్రాంతంలో ఒక చోట మాత్రం బౌద్ధ మంత్ర తంత్రాల్లో ఉపయోగపడే దొకటి, 'ఖాంగ్‌లింగ్' అనే పేరుతో కనిపించింది.

ఈ వాయిద్యం 16 సంవత్సరాలున్న బ్రాహ్మణ పిల్ల యొక్క ఎడమ తొడ ఎముకతో చేసిందట. ఇదిగాక పులి తాలూకు తొడ ఎముకతో కూడ 'స్థాగ్‌లింగ్' అనే బాకాని తయారుచేస్తారని తెలుస్తుంది. ఇది మనుష్యుల ఎముకైతే, చాల పెద్ద తరహాలోని మనిషిది కాని, చాల సామాన్యుని ఎముక కాని, హఠాత్తుగా ప్రమాదాల్లో చనిపోయినవారిది, త్వరగా వ్యాపించే 'అంటు' వ్యాధులతో మరణించిన వారిది, బలవంతంగా హత్య చేయబడిన వారి ఎముకలతో చేసినదై ఉండాలిట. ఇలాటి ఎముకల్ని బాకాలుగా తయారుచేసుకుని, కోపాలొచ్చిన దేవతల్ని సంప్రీతుల్ని చేయడానికి, దెయ్యాలు, భూతాలు మొదలైన వాటిని బెదిరించి, తోలివేయడానికి, వాన దేవుణ్ణి సంతృప్తి పరిచి, వర్షంకోసం ప్రార్థించడానికి ఉపయోగిస్తారని తెలుస్తుంది. టిబెట్ దేశంలో ఈ రకం 'ఖాంగ్‌లింగ్' బాకాల్ని, భూతాల ఆకారంలో అలంకరించి, ఉపయోగిస్తారని తెలుస్తుంది.

సూటిగా, పొడుగ్గా వుండే బాకాలు, చాల పురాతనమైన రకాలు, ఇతర సంపర్కం లేకుండా జీవించే చిన్న, చిన్న ఆటవిక జాతుల్లో కూడ ఇవి కనిపించేయి. ఇతర దేశాల్లోను తవ్వకాలలో కూడ వీటిని చూసేరు. మన దేశంలో కూడ గుహల్లో కనిపించిన బొమ్మల్లో కొన్ని చోట్ల అవి కనిపించేయి. 'సుమేరియన్', 'బాబిలోనియన్' సంస్కృతుల్లో కూడ అవి కనిపించేయి. వారి 'కర్నా' అనే బాకా, ఈజిప్షియనుల 'కర్ను' అనే బాకా, మన ఉత్తర భారత దేశంలో కనిపించే 'కర్న' అనే బాకాకు, నామంలోనైనా సారూప్యం ఉంది. ఇటుక్రితం చెప్పినట్లు, మన పురాతన గ్రంథాలు వీటిని 'తురహి', 'తుర్య' అని పేర్కొన్నాయి. అయితే ఇవి వట్టి గొట్టాల్లా ఉండి వుండవచ్చు. ఈ తురహి పదమేగాక, మన గ్రంథాల్లో, గొట్టాల వంటి ఈ బాకాలకు 'తుతరి' అని పేర్కొన్నారు. మరాఠీ భాషలో 'తుత్తూరి' అని, ఒరిస్సాలో 'కాహల్' అని, గంగానదీ ప్రాంతాల్లో కూడ 'కర్న' అని, ఒరవోన్ జాతి గిరిజనుల్లోను, ఉత్తర ప్రదేశ్‌లోను 'ఖెనర్' అనె వీటికి పేర్లున్నాయి.

'కాహల' అనే పదం మనకు శతాబ్దాలుగా పరిచయమైనదే. అనాటికీ కూడ ఆ నామం దేశమంతటా వినిపిస్తుది, కాని దీన్ని ఒరిస్సాలోను, కర్ణాటకలోను బాగా ప్రసిద్ధమైనదని చెప్పాలి, అది బంగారంతో గాని, వెండితో కాని, రాగితో కాని చేసినదని, అర మీటరు పొడవైనదని చెప్పబడిది. మహారాజులు, జమీందార్లు గతించిపోయిన ఈ రోజుల్లో బంగారంతో చేసిన కాహల ఎండమావి వంటిదేగాని, కొన్ని దేవాలయాల్లో కాహల, కర్న అనేవి భగవత్సాన్నిధ్యంలో వాయించేవి, వెండి రేకుతో చేసినవి లేక వెండి పూతపూసిన ఇత్తడివి అక్కడక్కడ కనిపిస్తాయి. సామాన్యంగా అవి ఇత్తడి, రాగి రేకులతో చేసినవి. లడఖ్, టిబెట్, భూటాన్ ప్రాంతాల్లో కనిపించే 'ధున్‌చెన్' అనే బాకా ఒక విశేషమైన వాయిద్యం. దీన్ని మతపరమైన ఉత్సవాల్లోను, నాట్యాల్లోను, సంగీతానికి ఉపయోగిస్తారు. మూడు మీటర్ల పొడవైన ఈ బాకా చాలా పెద్దది. ఇది రాగి రేకుతో చేయబడి, పైన వెండి పూతతో వుండేది. ఇలాటి రెండు బాకాల్ని, 'ధున్‌చెన్‌పా' అనే ఇద్దరు వాయిద్యగాళ్ళు వాయిస్తారు. వాళ్ళ భాషలో 'గంబా' అనే దేవాలయంలో జరిగే

పూజా ప్రకటనలకి, నాట్యాల్లోను దీనిని ఉపయోగిస్తారు. ఇది చాల బరువుగా, పెద్దదిగా వుంటుంది గనుక దీని చివరి భాగాన్ని కింద నిలబెట్టి, వాయించే వాళ్ళు నుంచుని వాయిస్తారు, లేకపోతే ఇకొకళ్ళు ఒక కొసని మోస్తూంటే, ఊదేవాళ్ళు ఇంకొక కొసని ఊది వాయిస్తారు.

మన దక్షిణ దేశలో వినిపించే 'తిరుచిన్నం' అని రెండు బూరాలు కలిపివున్న వాయిద్యం ఒకటి చెప్పదగ్గది. ఈ రెండు బూరాలు బాగా సన్నంగా, పొడగ్గా ఉంటాయి. ఈ రెండ బూరాల్ని కలిపి, వాయించే వాడు ఒకేసారి ఊది వాయిస్తాడు. రెండు బూరాల్ని ఒకేసారి కలిపి ఊదడం దీనిలోని విశేషం. ఇలాంటిది నేపాల్‌లో కూడ ఉందని తెలుస్తూంది. ఇండోనీషియాలోని 'చండిజవ్రి' అనే చోట - 13వ శతాబ్దానికి చెందిన ఒక బొమ్మలో రెండు బూరాలు కలిపి ఒకేసారి వాయించే వాయిద్యం కనిపిస్తుంది.

శంఖం అనాదిగా ప్రపంచమంతటా ఉపయోగిస్తూన్న వాయిద్యం. దీన్ని పూజా సమయాల్లోను, సంగీతానికి, ప్రమాదాల్లో సాంకేతిక సందేశాల్ని వ్వడానికి వినియోగిస్తారు. దీన్ని అస్సీరియన్, మెక్సికన్, పెరూవియన్, చైనీస్ సంస్కృతుల్లోను, మన సంస్కృతిలోను కూడ అనేక విధాలుగా ఉపయోగిస్తున్నారు, మన దేశంలో కన్యాకుమారి నుంచి హిమాలయ పర్వతాల వరకు, పశ్చిమాన్ని గుజరాత్ నుంచి తూర్పున మేఘాలయ వరకు శంఖాన్ని తెలియని వారు, ఉపయోగించని వారు లేరు. సుషిర వాయిద్యాల్లోని ఇది సంగీతానికంత ప్రయోజనకారి కాకపోయినా, దీన్ని సామాన్య ప్రకటనలకు, యుద్ధ ప్రకటనలకు ఉపయోగించేవారు. ఈ రోజుల్లో సైతం పూజల్లోను, జానపద సంగీతంలోను, నాట్యాల్లోను ఉపయోగిస్తున్నారు. పంచ మహా శబ్దాల్లో ఇది ఒకటి గనుక, పంచ వాయిద్యాల్లో ఇది ఒకటి. చరిత్ర పరంగా చూస్తే, హరప్ప నాగరికత కాలం నుంచి వస్తూన్న వాయిద్యమే కాని, అక్కడ కనిపించే శంఖం, సంగీత వాయిద్యమో, కాదో సందేహాస్పదమే. వేదకాలంలో కూడ ఇది బాగా ప్రసిద్ధమైన వాయిద్యమని చెప్పాలి, ఏమంటే దీన్ని 'బకుర' అని వేదంలో చెపుతూ వచ్చారు. సూత్ర సాహిత్యంలో కూడ 'గోముఖ' అనే వాయిద్యాన్ని చెప్పారు. బహుశః అది శంఖమో, శంఖం వంటి వాయిద్యమో అయి ఉండవచ్చు. విస్తారంగా బయళ్ళలో వాయించే వాయిద్యమైనందున, మహా కావ్యాల్లో, ఇతర సాహిత్యంలోను, రాజ్యాలకొసం జరిగిన యుద్ధాల్లోను, రాజాస్థానాల్లోను బాగా పరిచితమైన వాయిద్యంగా పేర్కొనబడింది. యుద్ధ ప్రకటనలకు, విజయ ప్రకటనలకు, సంతోషకరమైన ఉత్సవ సందర్భాల్లోను, శంఖనాదం శుభసూచకం కనుక ఈ వాయిద్యం అవశ్యంగా వినియోగపడేది. ఉదాహరణకు, రాముణ్ణి కలుసుకొవడానికి భరతుడు నందిగ్రామం చేరుకోగానే, దుందుభి, శంఖనాదాలతో వాట రాక నక్కడివారికి తెలిపినట్లు చెప్పబడింది, భాగవతంలో శ్రీకృష్ణుని ద్వారకా ప్రవేశం ఈ రీతిగా వర్ణింపబడింది - 'ద్వారక నగరాన్ని సమీపించగానే శ్రీకృష్ణుడు తన రాకను ద్వారక వాసులకు తెలియజేయడానికి శంఖం పూరించేడట, తెల్లటి శంఖం, ఎర్ర కలువ

రంగులో వున్న ఆయన అరచేతిలోనికి చేరగానే ఎర్ర కలువల మధ్య వున్న హంసవలె కనబడినదట. శంఖాన్ని వాయించడానికి తయారు చేయడం బహు సులువైన పని. పైన మూసుకుని ఉన్న చివరి భాగాన్ని కొంచెం కొట్టి ఒక కన్నం ఏర్పరచాలి, లోపల గుండ్రగా చుట్టిన మార్గం (spiral chamber) శంఖముఖం వరకు ఉంటుంది. పెదవుల్ని చేసిన కన్నానికి ఆనించి, పెదవులతో ధ్వని చేస్తూ, బలంగా గాలి ఊదాలి. ఈ కన్నం కొన్ని శంఖాల్లో తిన్నగా కొసని ఉండక కొంచెం వక్కకి కూడ ఉండవచ్చు. కొన్ని శంఖాలకు చిన్న ఇత్తడి బిళ్ళతో చేసిన 'మౌత్‌పీస్'లు పెట్టి వాయించడం కూడ అలవాటుంది. ఇదివరలో ఉదహరించిన 'బర్‌హత్' చిత్రంలోని కోతుల



23. శంఖు

ఉత్సవంలో, ఒక కోతి శంఖాన్ని ఊదుతూన్నట్లు చూపబడింది. ఆ శంఖానికి ఒక పొడగైన గొట్టంవలె వుండే 'మౌత్‌పీస్' అతికినట్లు చూపబడింది. (చిత్రం : 23)

న్యూగినీ దేశంలో మొదటిసారిగా 'ఫ్లూట్' కనుగొన్న విషయ మొక కథగా ఇదివరలో చెప్పుకున్నాం ఒక సీసాని మూతి దగ్గర ఊది వాయించే ప్రతి కుర్రవాడికి ఇది బాగా తెలుసు. ఈ పద్ధతిలో గాలిని ఒక కొసని ఊది వాయించే జానపద, గిరిజన వాయిద్యాలు చాలా రకాలున్నాయి మన దేశంలో ఈశాన్య ప్రాంతంలో బాగా ప్రసిద్ధిన 'ఫిఫ్లి' (Fifli) అనే వాయిద్యం ఇలాటిదే. సుమారు 15 సెంటీమీటర్ల పొడువైన, ఒక వైపున మాత్రం తెరిచివున్న ఒక వెదురు గొట్టాన్ని, పెదవుల దగ్గర పెట్టుకుని, నిలువుగా కిందికి వంచి, గాలిని ఊది వాయిస్తూంటారు. దీనిలో ఒకే స్వరం తప్ప, ఇతర స్వరాలేమీ పలకవు గనుక ఇందులో పాట ఏదైనా వాయించడానికి వీలులేదు. దీనిలో, ఇంత కంటె కొంచెం, ప్రయత్నంతో, ఇలాటి 7,8 గొట్టాల్ని లావుగా, సన్నంగా వుండే వాటిని, పొడుగ్గాను, పొట్టిగా వుండే వాటిని కలిపి వక్క వక్కని కడితే, ఇతర స్వరాల్లాగ వినిపించ డానికి వీలుంటుంది, ఏదైనా పాట లాంటిది వాయించడానికి వీలుంటుంది. గొట్టాల పొడుగు, పొట్టి వ్యత్యాసం వల్ల, లావు సన్నం తేడాల వల్ల ఈ శబ్దాలు వేరు వేరు స్వరాల్లా వినిపించే అవకాశం ఉంటుంది. ఇలా కట్టిన దాన్ని 'ఫిఫ్లి' అనే అనొచ్చు. ఇది యూరోప్ దేశంలోని 'పాన్‌పైప్' (Panpipe) మాదిరి లోనిదే. దీనిలో ఏదైనా స్వర సముదాయాన్ని అంటే పాట లాంటిదాన్ని కొంచెం వీలుంటుంది. రాజాస్థాన్‌లో ఇలాంటి వాయిద్యాన్నే 'నర్' అంటారు. ఈ నర్ అనే పొడుగైన గొట్టాన్ని, ఫిఫ్లి మాదిరిగానే ఊది వాయిస్తారు. దీనిలో నాలుగైదు కన్నాలు, గొట్టం క్రింది భాగంలో ఉంటాయి గనుక వేరు వేరు శబ్దాలు వినిపిస్తాయి. అందుచేత చిన్న, చిన్న పాటల వంటి వాటిని కూడ వాయించవచ్చు.

ఈ ఫ్లూట్ వాయిద్యాల్లో ఇంకొక రకం ఉంది. వీటిని కూడ గాలిని ఊది వాయించాలి, గాని ఇక్కడ స్వల్పమైన తేడా ఉంది. గాలిని ఊదే కొనని ఒక సన్నని 'పక్షిముక్కు' ఆకారంలో (beak) నాళం మాదిరిగా చేస్తారు. గాలిని ఊదే ఈ 'పక్షిముక్కుకు' కొంచెం కింది భాగంలో ఒక కన్నం (fipple hole) ఉంటుంది. ఆ ముక్కులోకి మనం గాలి ఊదితే, గాలి ప్రవాహం గొట్టంలో ప్రవేశించి, ఈ కింది కన్నం అంచులకు తాకి, పైకి పోతూంటుంది. వాయించే టప్పుడు పెదవులతో ముక్కును పూర్తిగా కప్పి వాయించవచ్చు. దీనిలో కింద గాలి పోవడానికి కన్నం వుంది గనుక పెదవులతో పూర్తిగా కప్పి వాయించినా, ఇది మోగుతుంది, కిని పైన చెప్పిన 'నర్' వంటి వాయిద్యాన్ని వాయించేటవుడు, కన్నాన్ని పెదవుల తానించి, కన్నం పూర్తిగా మూయకుండా ఊది వాయించాలి. అలా కాకపోతే, ఇక్కడ గాలి బయటికి పోవడానికి కన్నం లేనందున, ముక్కు కన్నాన్ని పూర్తిగా పెదవులతో కప్పేస్తే అసలు ఏమీ శబ్దం రాదు.

ఈ రకం 'ముక్క'లున్న ఫ్లూట్ వాయిద్యాల్ని ఇంగ్లీషులో 'బీక్‌ఫ్లూట్' (beak flute) అంటారు. వీటిలో ముక్కుకు కింద వున్న కన్నమే కాకుండా, ఇంకా కొన్ని కన్నాలు కింది భాగంలో ఏర్పరుస్తారు. వీటిని వాయించే వాళ్ళు వేళ్ళతో మూసి, తెరిచి నందువల్ల, వేరు వేరు స్వరాల వినిపిస్తాయి. ఇందులో కొన్ని చిన్న, చిన్న పాటలు కూడ వాయించవచ్చు. ఉత్తర స్థానంలోని గ్రామీణ ప్రాంతాల్లో ఇది 'బాన్సురి' (Bansuri) అని బాగా ప్రసిద్ధమైన వాయిద్యం. అయితే పంజాబ్, రాజాస్థాన్, మహారాష్ట్ర ఇంకా



24. బంసరి

కొన్ని ప్రదేశాల్లో 'అల్గోజా' అని ఇంకొక వాయిద్యముంది. దానిలో రెండు ఇలాటి ఫ్లూట్‌లు కలిపికట్టి, వాటి రెంటిని ఒకేసారి నోట్లో పెట్టుకుని వాయిస్తారు. అందులో ఒక దానిలో శృతి (drone or basic note), రెండవ దానిలోని కన్నాలు మూస్తూ, తెరుస్తూ పాటను వాయించడం అలవాటు. (చిత్రం : 24)

దేశమంతటా బాగా వ్యాపించి ప్రసిద్ధమైనవి, మనం కచేరీల్లో చూసే, నోటి కడ్డంగా పెట్టుకుని వాయించే ఫ్లూట్ లేక వేణువు వాయిద్యాలు. పైన చెప్పిన కొస నుంచి వాయించేవి (end blown flutes), 'ముక్కు' కొసలతో (beak flutes) వాయించేవి, జానపదుల్లోను, గిరిజనుల్లో తప్ప, శాస్త్రీయ సంగీతానికుపయుక్తాలు కావు. నోటి కడ్డంగా పెట్టుకుని వాయించేవి (horizontal) జానపదుల్లోను, శాస్త్రీయ

సంగీతంలోను గూడా దేశమంతటా గౌరవింపబడే వాయిద్యాలు. ఏమంటే వాయించే వాళ్ళు వీటి కన్నాన్ని చేతి వేళ్ళతో పూర్తిగా కప్పడం, సగంగానూ కప్పడం మొదలైన పనులు వేళ్ళతో, ఊదే కన్నంలోకి పెదవులతో అతి లాఘవంగా, లేకపోతే అతి బలంగా నోటి గాలిని ఊది వాయిస్తారు గనుక శాస్త్రీయ సంగీతానికి కావలసిన గమక సౌందర్యాలు, గురుత్వ లాఘవాలు ఏర్పడి, వినే శ్రోతలకి ఎంతో మనోహరంగా వినబడుతుంది అడ్డంగా వాయించే వేణువు. ఇదే వీటిలో వుండే విశిష్ట లక్షణం.

నోటి కడ్డంగా పెట్టుకుని వాయించే ఈ రకం వేణువు, ఒక కొనని మూసి, ఇంకో కొనని తెరిచి వున్న, సుమారు 35 సెంటీమీటర్ల పొడవైన వెదురు గొట్టం. మూసి వున్న కొవ నుంచి కొద్ది సెంటీమీటర్ల దూరంలో ఒక కన్నం (embouchure or blow hole) ఉంటుంది. ఈ కన్నం నుంచి కొద్ది దూరంలో ఒకటి తర్వాత ఒకటిగా కొన్ని కన్నాలుటాయి. ఇక్కడ ఒక్క విషయం మనం గుర్తుంచుకోవాలి. మన దేశంలో తయారయ్యే వేణువులన్నీ, కన్నాన్ని కప్పడానికి 'మీటలు' (keys or levers for fingers) లేకుండా తయారయ్యే రకాలు. మీటలతో కన్నాల్ని కప్పి వాయించే రకాలు మన దేశంలో లేవు. ఉదాహరణగా వేణువు, నాదస్వరం, శహనాయ్ మొదలైన వాటిని చెప్పాలి. ఈ మీటలు లేనందు వల్లనే. పైన చెప్పినట్లు, వాయించేవాళ్ళు వేళ్ళ నుపయోగించి, కన్నాన్ని నైపుణ్యంతో స్వాధీనంలో ఉంచుకొని వాయిస్తూ, శాస్త్రీయ సంగీతానికి ఉపయోగించ గలుగుతున్నారు. వేణువుల తయారీకి వెదురు గొట్టాలే అనువుగా ఉంటున్నాయి.



25. తిరయ్య : అటవికుల వేణువు

వీటిలో నాదం మెత్తంగాను, శ్రావ్యంగాను ఉంటుంది. ఇవి లోహాలతో తయారైతే ఈ శ్రావ్యత, మెత్తని నాదం అంత బాగా ఉండదు. వేణువుల్లో పొట్టి వాటిని త్వరితంగా వాయించే సంగీత శైలికి, హెచ్చు శృతులకు ఉపయోగిస్తారు. పొడుగుపాటి వేణువుల్ని ముందుగా వుండే సంగీతానికి, తగ్గు శృతులకు వాడతారు. వేణువు అంటే వెదురు గొట్టం అని అర్థం గనుక ఇక్కడ నామమే వస్తు సూచకం. ఉత్తరాదిని దీనికి 'వంశి', 'బన్సి', 'బాన్సురి' అనే పర్యాయ పదాలు వాడుకలో వున్నాయి, తమిళ భాషలో 'కుళల్', 'పిల్లాన్‌కుళల్' అనే పేర్లు; కన్నడ భాషల్లో 'కొళవి' అని, తెలుగులో 'వేణువు', 'పిల్లనగ్రోవి' అని అంటారు. వేదాల్లో దీన్ని 'వేణు', 'తూనవ', 'నాడి' అని చెప్పారు. (చిత్రం : 25)

ఇంతవరకు చెప్పిన వేణువుల్లోను, బాకాల్లోను కూడ శబ్దోత్పత్తికిగాని, స్వరస్థాయినిస్వాధీనంలో వుంచడానికిగాని, ఏ విధమైన సాధనాలు (aids) లేవు. బాకాల్లోను, కొమ్ముల్లోను, శంఖంలోను కూడ మన పెదవులే శబ్దకారకాలు, వేణువుల్లో మనం ఊదేగాలి, కన్నం యొక్క అంచుకు తాకి నందువల్ల శబ్దం కలుగుతూంది. మన మిపుడు శబ్దాన్ని కలుగ జేయడానికి సాధనాలు (mechanical aids) ఉపయోగించే గాలి వాయిద్యాల్ని కొంత పరిచయం చేసుకుందాం. శబ్దోత్పత్తికి, చలించే పలచని వస్తువు (vibrator) ను, సన్నని గొట్టానికో, గాలితో నింపే ఒక బాగానికో అతికి ఉండాలి. ఈ చలించే పలచని వస్తువునే బద్ద లేక రేకు (Reed) అని ఇదివరలో చెప్పుకున్నాం. ఇది ఒక రకమైన గట్టి గడ్డితోనో లేక వెదురు బద్దతోనో చేయవచ్చు. వీటిని హిందీ భాషలో 'పత్తి' అని, తమిళంలో 'సీవలి' అని తెలుగులో 'ఆకు' అని అంటారు. అయితే ఈ బద్ద గొట్టానికి అమర్చినదైనా కావచ్చు లేదా గొట్టంలోని ఒక భాగమై ఉండొచ్చు. ఈ వివరాలు ఇక ముందు తెలుసుకుందాం.

రీడ్ లేక బద్దల్ని విపులంగా రెండు రకాలుగా చెప్పవచ్చు. మొదటి రకంలో ఒకదాని కొకటి కొట్టుకుని (beating reeds) స్పందిస్తూ ధ్వనించేవి, అనగా ఒక సన్నని రంధ్రాన్ని మూస్తున్న ఒక పలచని బద్ద, రంధ్రంలో గాలి ప్రవహించి నపుడు, రంధ్రపు టంచుల మీద కొట్టుకుని ధ్వని పుట్టిస్తుంది. ఆ రకానికి ఉదాహరణగా పాములవాని నాగస్వరం లోపల అమర్చిన బద్ద, క్లారినెట్ వాయిద్యంలోని బద్దల్ని చెప్పవచ్చు. రెండవ రకంలో, రెండు పలచటి బద్దలు కలిసి ఉండి, వాటి మధ్య వుండే రంధ్రం ద్వారా గాలిని ఊదినపుడు, ఆ రెండు బద్దలు ఒక దాని కొకటి కొట్టుకుని ధ్వని కలుగజేస్తాయి. ఈ రకం బద్దలకు నాదస్వరంలోని బద్దలు, శెహనాయి లోని వాటిని చెప్పవచ్చు. ఈ చెప్పిన రెండు రకాల బద్దలు చలించే లేక స్పందించే రకాలే.

ఈ రెండవ రకం బద్ద దేనిని తాకకుండా లేక ముట్టకుండా (free reed) చలిస్తే, దాన్ని స్వయంగా స్పందించే రకంగా చెప్పాలి, ఈ రకమైనవి మన దేశంలో చాలా

తక్కువ వాయిద్యాలున్నాయి. హార్మోనియం లోని ఇత్తడి బద్ద లేక రేకు ఈ రకమైనదే. ఇక్కడి బద్ద దేనిని తాకకుండా గాలి ప్రవాహంలో స్పందిస్తుంది. మన అస్సాం ప్రాంతంలోని 'ఖంగ్' లేక 'రూసెమ్' వాయిద్యంలోని బద్దకూడ అ రకమైనదే. దీన్ని స్వయంగా చలించే లేక స్పందించే 'ఫ్రీరీడ్' అంటారు.

పాముల వాని నాగస్వరం వాయిద్యంలోను, మేళ వాయిద్యమైన నాదస్వరం లోను, మనం వినే సంగీతం కేవలం బద్దయొక్క ధ్వని వల్ల ఏర్పడ్డ సంగీతం కాదు. బద్ద గొట్టం అంచుల్ని తాకి చలిస్తూ, గాలిని క్రమ పద్ధతిలో గొట్టంలోకి వదులుతుంది. అ గాలి గొట్టంలో ప్రవేశించి చలిస్తూంది. గొట్టం మీద కన్నాల్ని వేళ్ళతో మూసి, తెరచినందు వల్ల, గొట్టంలో ప్రవేశించిన గాలి యొక్క చలనాలు, పొడుగు, పొట్టిగా మారి నందువల్ల (different lengths of air columns) వేరు వేరు స్వరాలుగా వినిపిస్తున్నాయి. ఇలాగ వేణువులో స్వరాలు ఏర్పడుతున్నాయి. హార్మోనియంలో ఒక బద్ద చలించి ఒకే స్వరాన్ని వినిపిస్తుంది. అందువల్ల హార్మోనియంలో ఒక్కొక్క స్వరానికి ఒక్కొక్క బద్ద కావలసివుంది.

పాములవాని నాగస్వరంలోని బద్ద, కొట్టుకుని ధ్వనించే బద్దగల వాయిద్యాలలోనిది. ఇది బాగా దేశమంతటా సుప్రసిద్ధమైనది. విదేశీయులు దీన్ని ఎంతో సంతోషిస్తూ, ఆప్యాయంగా వింటారు. హిందీ భాషలో ఈ వాయిద్యాన్ని 'పుంగి', 'బీన్' అని అంటారు. దక్షిణ దేశంలో 'మహుడి', 'నాగస్వరం' అంటారు. దీనిలో పై భాగం ఒక ఎండిన ఆనపకాయ బుర్రతో తయారై, గాలిని ఈ బుర్రలోకి ఊదుతారు. ఈ గాలి బుర్ర కింద అమర్చిన రెండు బద్ద గొట్టాల (reed pipes) ద్వారా వేగంగా బయటికి వస్తుంది. ఈ రెండు గొట్టాలు కొంత భాగం బుర్ర లోపలికి, కొంతభాగం బుర్ర బయటికి అమర్చబడి ఉంటాయి. బుర్రలో వున్న గొట్టాల భాగం మన కంటికి కనిపించదు, బుర్ర లోపల వున్న గొట్టాల పై పొరను, కొంచెం చీల్చి బద్దవలె తయారు చేస్తారు. గాలిని బలంగా బుర్రలోకి ఊదితే, గొట్టాల మీద వున్న పొర అంచుల మీద కొట్టుకుని ధ్వనిచేస్తూ, గాలిని బయటికి వదులుతూంటుంది. బయటికి కనిపించే ఒక గొట్టపు భాగంలో కన్నాలుండవు. ఇంకొక దానికి 5, 6 కన్నాలుంటాయి. కన్నాలు లేని గొట్టంలో వట్టి శృతి మాత్రం (drone) వినిపిస్తుంది. కన్నాలున్న



26. పుంగి లేక మహుడి

గొట్టాన్ని వేళ్ళతో మూసి, తెరిచి వాయిస్తే, పైన చెప్పినట్లు, దానిలోని చలించే గాలి యొక్క పొడుగు, పొట్టి కొలతలు మారి మనకు వేర వేరు స్వరాలుగా వినిపిస్తుంది. మొత్తానికిది శృతితో కూడిన పాటలాగ వినిపిస్తూ, ఎంతో వినసొంపుగా శ్రోతల్ని ఆకర్షిస్తూంటుంది. ఈ పాట వినడానికి పాముకి మాత్రం చెవులు లేవుగాని, పడగెత్తి ఆడుతూ కనిపిస్తుంది. (చిత్రం : 26)

పాముల వాని నాగస్వరం లాంటిదే 'టార్పొ' అనే వాయిద్యం. దీనికే 'ఘొంగా' అని, 'ఖొంగడ' అని, 'దొబ్రు' అని వాటి చిన్న పెద్ద ఆకారాల్నిబట్టి పేర్లున్నాయి. దీని నిర్మాణం నాగస్వర నిర్మాణాన్ని పోలిందే. నాగస్వరంలోని బుర్ర గుండ్రంగా 'పొట్ట 'తో వుంటుంది. దీని బుర్ర కొంచెం పొడుగైన బుర్ర. మరాఠీ భాషలో దీన్ని 'దూదియాభోప్లా' అనే ఒక రకం ఆనపకాయ వంటి ఒక కాయ డాలూకు బుర్రతో చేస్తారు. ఈ బుర్ర చిగురున కాక ఒక ప్రక్కకి ఉంటుంది. దీని కన్నానికి కొన్ని వాయిద్యాల్లో 'మౌత్‌పీస్' కూడ ఉంటుంది. నాగస్వరంలో వలెనే, బుర్ర లోపలికి కొంత భాగం, బుర్ర పైకి కొంతభాగం ఉండేట్లు అమర్చిన బద్ద గొట్టం ఉంటుంది. పైకి కనిపించే గొట్టం మీద 4,5



27. టార్పొ

కన్నాలుంటాయి. ఈ కన్నాల్ని మూస్తూ, తెరుస్తూ దీన్ని వాయిస్తారు. దీని కింకొక భాగం మాత్రం అదనంగా కనిపిస్తుంది. బద్ద గొట్టానికి (reed pipe) అమర్చిన క్రమంగా లావుగా వుండే ఇంకొక గొట్టం ఒకటుంది. దీని వల్ల బద్ద గొట్టం నుంచి వచ్చే ధ్వని ఇంకా పెద్దదై (amplify) వినిపిస్తుంది. ఈ పెద్ద గొట్టాన్ని తాటాకులతో అల్లి గుండ్రంగా తయారు చేస్తారుట. ఈ టార్పె వాయిద్యం గుజరాత్‌లోని గ్రామాల్లోను, మహారాష్ట్రలోని 'వర్లి' ప్రాంత గ్రామాల్లోను, బాగా ప్రసిద్ధమని తెలుస్తోంది. ఈ వర్లి ప్రజల్లోని ఆచార మిలా ఉంటుందని చెపుతారు. 'భాద్రపద' మాసంలోని కృష్ణ పక్షంలో, పంట చేలు పండి కోతకు వచ్చే సమయంలో టార్పె వాయిద్యాన్ని రాత్రిళ్ళు వాయిస్తూంటే దూరాన్నుంచి వినబడుతూంటుంది. చంద్రుడు అశ్వని నక్షత్రం దగ్గరకి వచ్చే సమయంలో, అంటే అక్టోబరు మాసంలో, సాయంకాలం వేళల్లో 'టార్పె నాట్యాలు' మొదలుపెడతారట. టార్పె వాయిద్యగాళ్ళని చుట్టి, గ్రామ ప్రజలంతా గుండ్రంగా తిరుగుతూ, వాయిద్యగాళ్లకు ఎదురుగా నిలబడి, పాటలు పాడుతూ నాట్యాలు చేస్తారు. కొన్ని ప్రత్యేక దినాల్లో మహాలక్ష్మి పూజలు చేసి, సంబరం చేసుకుంటారు. అప్పుడీ వాయిద్యగాళ్ళు కూడ తమ వాయిద్య నైపుణ్యాన్నంతా ప్రదర్శిస్తూ, ఆ సంబరంలో పాల్గొంటారు. (చిత్రం : 27)

'మాషక్' లేక 'తిత్తి' అనే వాయిద్యం, మన దేశపు 'బ్యాగ్‌పైప్' (Bagpipe) అని చెప్పవచ్చు గాని ఇప్పుడిప్పుడు మన వాళ్ళు దీన్ని విసర్జించి, 'బ్యాగ్‌పైప్'ను ఇతర దేశాల్నుంచి దిగుమతి చేసుకుంటున్నారు. మేక చర్మాన్ని సంపూర్ణంగా కాళ్ళతో సహితం, ఊడదీసి కుట్టిన ఒక తోలు సంచీని, గాలిని నిలవచేయడానికి ఒక భాగంగా వినియోగస్తారు. ఈ వాయిద్యంలో ఈ సంచి 'పుంగి' వాయిద్యంలోని బుర్ర వంటిది, గాని ఈ మాషక్‌ను అంటే సంచీని, అనేక రకాలుగా ఇతర పనుల్లోకూడ ఉపయోగిస్తారు. ఇళ్ళ కట్టడాలు కట్టే మేస్త్రిలతో పనిచేసే వాళ్ళు, కట్టడాల్ని తడపడానికి దీనితో నీళ్ళను మోసుకుపోతూంటారు. ఇంకా కొంతమంది దనిలో నీళ్ళు నిలవ చేసుకుంటారు. సరిగ్గా గాలి పోకుండా కుట్టి, దీన్ని గాలితో నింపితే, నీటి మీద తేలుతూ, నదులు దాటడానికి కూడ పనికి వస్తుంది. ఇదే సంచిని లేక తిత్తిని ఒక వాయిద్యంగా మార్చవచ్చు. ఒక కొసని గాలి ఊదడానికి ఒక వెదురు గొట్టం గట్టిగా బిగించి, రెండో కొసని రెండు బద్ద గొట్టాల్ని బిగిస్తే, ఇదొక వాయిద్య మవుతుంది. వెదురు గొట్టంలోంచి గాలి ఊది, తిత్తిని గాలితో నింపి, రెండో కొసనున్న బద్ద గొట్టం యొక్క కన్నాలను, వేళ్ళతో మూసి, తెరుస్తూ వాయించ వచ్చు. ఈ సంచిని చేతికి కింద భాగంలో పెట్టి పట్టుకుంటే, వాయించేటపుడు కావలసినంతగా నొక్కి సంచిలోని గాలిని క్రమంగా బయటికి వదలవచ్చు.

చలిస్తూ కొట్టుకుని ధ్వని చేసే (beating reed) బద్దతో కూడిన ఇంకొక వాయిద్యాన్ని కూడ చెప్పాలి. దాని పేరు 'పేపా' అంటారు. ఇది అస్సాంలోని 'బిహు' అనే

వసంతోత్సవ నాట్యాల్లో ఉపయోగించేది. 20 సెంటీమీటర్ల పొడవైన రెండు వెదురు గొట్టాల్ని కలిపికట్టి దీన్ని తయారు చేస్తారు. వీటిలో ఒక గొట్టానికి చివర బద్ద ఉంది, ఆ బద్దను ఇంకొక గొట్టంతో కప్పి బిగిస్తారు, లేకపోతే ఊరికే వదిలి వేయవచ్చు. ఈ చివరి భాగాన్ని నోట్లో పెట్టుకుని వాయిస్తారు. గొట్టానికి రెండవ వైపుకి కన్నాలుంటాయి. ఈ గొట్టాల చివరి భాగంలో గేదె కొమ్ములు ఒక్కొక్క గొట్టానికి అమర్చబడి ఉంటాయి. గేదె కొమ్ములు దాని ధ్వనిని విస్తారం చేస్తాయి. (చిత్రం : 28)



28. పేప

ఒకే బద్దతో ధ్వనించే (single reed aerophones) ఇన్ని రకాల వాయిద్యాల్ని పెంపొందించిన మన దేశ మింతవరకు శాస్త్రీయ సంగీతానికి పనికి వచ్చే ఒక వాయిద్యాన్ని కూడ తయారు చేయలేక పోయిందంటే అది చాల ఆశ్చర్యకరమైన విషయమే. ఒక పక్కని క్లారినెట్ వంటి ఒంటి బద్ద గలిగిన వాయిద్యాల్ని విదేశాలనుంచి దిగుమతి చేసుకుంటున్నాం. ఈ క్లారినెట్ ఎంత ప్రసిద్ధమైనదైనా, మన శాస్త్రీయ సంగీతానికి ఎంతవరకు పనికి వస్తుందో సందేహాస్పదమైన విషయమే. పోనీ అంటే, రెండు బద్దలున్న వాయిద్యాల్ని (double reed pipes), నాదస్వరం, శహనాయ్ మొదలైన వాటిని సృష్టించగల సమర్థత మనకున్నమాట నిజమే. అవి ఈ దేశంలోనే కాక విదేశాల్లో కూడ ఎంతో గౌరవింపడబడుతూన్న వాయిద్యాలు. ఈ రెండు బద్దలున్న వాయిద్యాలు మన దేశంలో అసలు ఒక సమస్యగా తయారయ్యాయి కూడ. వాటి చరిత్రను, పుట్టు పూర్వోత్తరాలను మనం నిరూపించ లేకుండా ఉన్నాం. మన దేశంలో ఎన్నో రకాల రెండు బద్దలున్న వాయిద్యాలు ఎన్నో పేర్లతో, దేశమంతటా వున్నాయి. అలాంటప్పుడు అవి 'విదేశవాయిద్యా' లంటే ఎలా నమ్మడం? వాటి తరగతుల్ని, పేర్లను పరిశీలిస్తే, వాటిలో కొంత విదేశీయ ప్రభావం తెలిసొస్తోంది. వాటి పేర్లను చూడబోతే అచ్చు మన దేశపు పేర్లు - ఉదాహరణకు, 'ముఖరి', 'మోహారి', 'మధుకరి' మొదలైనవన్నీ మన దేశభాషల పేర్లుగానే తోస్తున్నాయి. ఏమంటే, 'మోరి' అంటే గొట్టం (tube) అని అర్థం. ముఖ వీణ పేరు చెప్పనే అక్కర్లేదు, నోటితో వాయించే వాయిద్యమని తెలుస్తూనే వుంది. ఇకొకరకం పేర్లు, నాదస్వరం, నాగసర్, నాయనం మొదలైన పేర్లున్నాయి. ఆ చెప్పిన పేర్లు మన దేశపు పేర్లేకాని, శహనాయ్, సుంద్రీ, నఫేర్ప మొదలైన రెండు బద్దలున్న వాయిద్యాలు మాత్రం, మన దేశీయ వాయిద్యాలు కావని తెలుస్తోంది. 'ముఖరి' అన్న పేరు సుమారు 11 శతాబ్దాల క్రితం ప్రథమతహా, చెప్పబడింది, 'ముఖవీణ' పేరు 12వ శతాబ్దంనుంచీ దక్షిణ దేశ సాహిత్య



29. అటవికుల మొహరి

గ్రంథాల్లో పరిచయమైంది. 'నాదస్వరం' కూడ 14వ శతాబ్దం నుంచీ బాగా తెలిసిన పేరు. శహనాయ్ మన సాహిత్య గ్రంథాల్లో 13వ శతాబ్దం నుంచీ పేర్కొనబడింది, కాని మధ్య ఏషియాలోను, పశ్చిమ ఏషియాలోను, బాగా వ్యాపించిన 'జుర్నా' వాయిద్యాన్నికిది 'బంధు'వని తోస్తుంది. ఇంకో రెండు వింతైన పేర్లున్నాయి,- 'మేళం', 'ఒళగ' అన్నవి. మేళం అంటే గుంపు అని, 'ఒళగ' లేక 'ఓలగ' అంటే కోర్టు లేక దర్బారు అని అర్థం. నాదస్వరం అనేకానేక సందర్భాల్లో ముఖ్యంగా ప్రసిద్ధమయిన వాయిద్యం గనుక ఈ వాయిద్యానికే 'మేళ' మన్నారు. నాదస్వర వాయిద్యానికి 4,5 గురు వాయిద్యకారులుండడం సామాన్యం కూడాను. అలాగే 'ఒలగ' లేక 'ఓలగ' పదం కూడ తమిళ, కన్నడ, తెలుగు భాషల్లో ఒకే విధంగా అర్థమవుతుంది. ఈ పెద్దరకం నాదస్వర వాయిద్యాన్నే 'బారీ నాదస్వరం' అని కూడ అంటారు. తమిళనాడు గ్రామీణ జీవితంలో 'నయ్యాండి' మేళం బాగా ప్రసిద్ధం, అలాగే కర్ణాటకలోని 'కరగమేళం' కూడ ప్రసిద్ధమే. ఈ వాయిద్యమే శాస్త్రీయ సంగీత కచ్చేరీల్లో కూడ ఈనాడు బాగా గౌరవింప బడుతోంది. పైన చెప్పిన వాయిద్యాల నిర్మాణం ఒకేలాగ ఉంటుంది. ఒక సెంటీమీటరు పొడుగైన, ఒక విధమైన గట్టిరకం గడ్డితో రెడు బద్దలు (reeds), ఒక పక్క సన్నంగా వుండేట్లు చేసి ఒక సన్నని గొట్టంలో అమరుస్తారు. దీన్ని ఇంగ్లీషులో (Staple) 'స్టేపుల్' అంటారు. ఈ స్టేపుల్ నాదస్వర గొట్టంలో సన్నంగా వుండే వైపు వున్న కన్నంలో అమర్చబడుతుంది. నాదస్వర గొట్టం, క్రమంగా లావుగా వుండి, చివుర్ని గుండ్రటి ముఖంతో (Flare) వుంటుంది. గొట్టంలో క్రమంగా కిందికి 6,7 కన్నాలుంటాయి. మన గ్రంథాల్లో ఈ వాయిద్యాన్ని ఉమ్మెత్త పువ్వు ఆకారంలో వుంటుందని చెప్పేరు. ఈ రకాలన్నీ ముఖ్యంగా కర్రతో చేసేవేకాని అక్కడక్కడ వెండి, బంగారం, ఒక రకం మెత్తటి రాయి కూడ ఉపయోగించిన వాయిద్యాలుండేవని తెలుస్తూంది. చాలా పురాతన కాలంనుంచి నేటి వరకు వీటిని ఉత్సవాల్లోను, సంబరాల్లోను, ముఖ్యంగా వైవాహిక శుభకార్యాల్లో మంగళ



30. జానపదుల సన్నాయి

ప్రదమైన వాయిద్యంగా ఉపయోగిస్తున్నారు. ఈ రోజుల్లో నాదస్వర కచ్చేరీలు, సంగీత సభల్లోను, రేడియోలోను బాహుళ్యంగా ప్రజాదరణ పొందుతున్నాయని చెప్పాలి. (చిత్రాలు : 29, 30)

ఇంక దేనిని తాకకుండా చలించి ధ్వనించే బద్దలున్న (free reed) వాయిద్యాల్ని గురించి తెలుసుకోవాలి. ఇదివరలో చెప్పినట్లు ఈ బద్ద యొక్క ఒక కొస, గాలి ప్రవాహంలో చలించేట్లు, దేనికైనా అతకబడి ఉంటుంది నోటితో ఊదికాని, తిత్తులను ఆడించికాని, గాలిని ఈ బద్ద సమర్చిన వైపుకు పంపుతాం. మనం వినే ధ్వని ఆ బద్ద యొక్క చలనం వల్ల ఏర్పడింది కాని, మరి దేని సంపర్కం వల్లన కలిగేది కాదు.

మన దేశంలో తూర్పు ప్రాంతాల్ని 'ఖంగ్' లేక 'రూసెమ్' అనే వాయిద్యం బహు ప్రసిద్ధమైంది. బయటికి అది నాగస్వరం లాగే కనిపిస్తుంది. నాగస్వరంలో లాగే దీనికి కూడ ఒక బుర్ర ఉంది. దీనిలో మామూలుగా గాలిని ఊదుతారు. దీనిలో ధ్వని ఏర్పడ్డం మాత్రం కొంత విశేషంగా జరుగుతుంది. ఈ బుర్రతో 3 గొట్టాలు ఒక వరుసలోను, ఇంకొక 3 గొట్టాలు ఇంకొవైపున మొత్తం 6 గొట్టాలు, సగం బుర్రలోను, సగం బయటికి కనిపించేట్లు అమర్చబడి ఉంటాయి. బుర్ర లోపలి ఉన్న గొట్టాల చివర్ని కొంచెం కోసి, ఒక సన్నని బద్ద వంటి ముక్కని మాత్రం అట్టిపెడతారు. ఇది గాలిలో దేనిని తాకకుండా చలించే బద్ద (free reed) గా పనిచేస్తుంది. బుర్ర బయట వున్న గొట్టాల భాగంలో, ఒక్కొక్క గొట్టానికి ఒక కన్నముండి, గొట్టాల చిగుర్ని, గాలి బయటికి పోకుండా చిన్న టోపీ వంటి బిరడాలు అమర్చబడి ఉంటాయి. వీటిలో ధ్వని ఏర్పడ్డం కూడా కొంత విశేషమే. వాయించేవాడు దీని బుర్రలోకి గాలిని ఊదుతూ, బయటికున్న గొట్టాల కన్నాల్ని మూస్తాడు. ఇలా ఏ గొట్టం తాలూకు కన్నాల్ని మూస్తాడో ఆ గొట్టం తాలూకు బుర్ర లోపలున్న బద్ద చలించి ధ్వనిస్తుది. మిగతా గొట్టాలకన్నాలు తెరుచుకుని ఉన్నందువల్ల ఆ గొట్టాల బద్దలు చలించవు, అందువల్ల అవి ధ్వనించవు. ఇలాగ ఏ గొట్టం కన్నాన్ని మూస్తే ఆ స్వరం పలుకుతూంటుంది. ఇదే దీని విశేషం. నాగస్వరంలో,

ఇలా లేదు. అక్కడ కావలసిన శబ్దాన్ని బట్టి, గొట్టపు కన్నాన్ని తెరుస్తారు. ఖంగ్ వాయిద్యంలో కన్నాన్ని మూసి వాయించాలి. దీనిలో చిన్న చిన్న పాటలు అతి మధురంగా వినిపిస్తాయి. మణిపూర్ ప్రాంతాల్లో దీని ఉనికి కనుగొనడం వల్ల మనకి వాయిద్య చరిత్రలో ఒక విశేషం తెలిసొస్తోంది. ఇదే పద్ధతి మీద ఆధారపడిన వాయిద్యాలు, లావోస, బర్మాదేశాల్లో కూడ కనిపిస్తాయి. చైనాలోని 'షెంగ్' అనే వాయిద్యం, జపాన్‌లోని 'షో' అనేది, కొరియాలోని 'షెంగ్వాంగ్' అనే వాయిద్యం కూడ ఈ ఖంగ్ వాయిద్య పద్ధతిలోనే తయారై ఇంతకంటే నేర్పరితనంతో, క్లిష్టంగా వున్న వాయిద్యాలు. ఈ రకం వాయిద్యాలు, ఇన్ని దేశాల్లో తూర్పు ఏషియాలో ప్రసిద్ధంగా వుండడం వల్ల, ఈ 'మంగొలాయిడ్' (Mongoloid) ప్రజల అభిరుచి, సంస్కృతి ఒక మాదిరిగా వున్నట్లు తెలుస్తూంది. స్వయంగా చలిస్తూ ధ్వనించే బద్దల (free reed) వాయిద్యాలన్ని దేశాల్లో ఇక్కడ సుప్రసిద్ధంగా వుంటే, ఇదే



31. ఖుంగ్ లేక రుపిమ్

పద్ధతిలో 'ఫ్రీరీడ్' లతో చేసిన హార్మోనియం ఎక్కడో యూరోప్‌లో బయలుదేరిందనగలమా? ఈ విషయ నిర్ణయం పాఠకులకే వదలివేస్తున్నాం. (చిత్రం : 31)

హార్మోనియం వాయిద్య నిర్మాణమంతా 'నోటి హార్మోనియం' (Mouth Organ) పద్ధతి ననుసరించిందంటారు. క్రీస్తుపూర్వం వెయ్యి సంవత్సరాల క్రితమే చైనీయులు 'షెంగ్' వాయిద్యం బాగా ప్రసిద్ధమైనది. దాని ఆలూకు బొమ్మలు క్రీస్తు తర్వాత 600 సంవత్సరాల నాటివి మనకు కనిపిస్తున్నాయి. మన ఏషియనుల 'మౌత్ ఆర్గన్' రష్యాదేశానికి ప్రయాణం చేసింది. అక్కడ నుంచి ఈ ఒక బద్దతో చలించే వాయిద్యాల (single reed) రకాలు పశ్చిమ యూరోప్‌కు 19వ శతాబ్దంలో పరిచయమయ్యాయి.

యూరోప్‌లోని వాయిద్య నిర్మాతలు అనేక రకాల 'మౌత్ ఆర్గన్', 'రీడ్ ఆర్గన్', 'ఎకార్డియన్' మొదలైన వాయిద్యాల్ని, ఫ్రీరీడ్ నుపయోగించి తయారు చెయ్యడం మొదలుపెట్టారు. అక్కడనుంచి ఈ రీడ్‌ఆర్గన్' అనేక రకాలైన వర్తక వ్యాపారులతోను, రాజ్య నిర్మాతలతోను, మతోపదేశకులతోను, తిరిగి మన దేశంలో ప్రవేశించింది. ఇలా మన దేశపు ఖంగ్ వాయిద్యం - ప్రయాణంలో వలయాకారంగా ఒక చుట్టుచుట్టి తిరిగి మన దేశం వచ్చి, 'హార్మోనియం వేషం' ధరించింది.

హార్మోనియం నాలుగు భాగాలున్నాయి - (1) తిత్తి (bellows); (2) గాలి కొలిచే అర (air chamber); (3) మెట్లు (keys); (4) రీడ్లు (reeds). వీటిలో తిత్తిని, ఒకచర్మాన్ని 2,3 మడతలు మడిచి, అట్టలతో అతికి, ఆఖరి మడతను క్రర చెక్కకు అతికి బిగిస్తారు. ఈ బిగించిన మడతను చేత్తో లాగుతూ, బయటి గాలిని లోపలి అరలోకి పంపవచ్చు. కాలితో వాయించే హార్మోనియంకు, కాళ్ళను ఆన్చడానికి రెండు చిన్న పీట (pedals) లుంది. ఈ రెండు పీటలకు చర్మం మడతలతో చేసిన తిత్తి మీదకు అమరుస్తారు. కాళ్ళతో నొక్కి తిత్తుల నాడిస్తే, బయటి గాలి రెండు గొట్టాల ద్వారా గాలి అర (air chamber) లోకి ప్రవేశిస్తుంది. తిత్తుల్లో బయటి గాలి లోపల ప్రవేశించడానికి కన్నాలుంటాయి. ఈ కన్నాలికి ఒక చిన్న తోలు ముక్క లోపలికి (valve) అంటించి ఉంటుంది. ఆ తోలు ముక్క బయటి గాలిని లోపలికి వదులుతుంది తప్ప లోపలి గాలిని బయటికి పోనియదు. ఇలాగే గాలి అర లేక పెట్టెలోకి గాలి కన్నాల్లోంచి ప్రవేశిస్తుంది. ఈ కన్నాల దగ్గర గూడ తోలు ముక్కలుండి, పెట్టెలో ప్రవేశించిన గాలిని బయటికి పోనియవు. ఈ పెట్టె (air chamber) రీడ్సు చేసే ధ్వనిని విస్తారం చేయడానికి కూడ (resonator) పనికి వస్తుంది. అందువల్ల హార్మోనియంలోని ముఖ్య భాగం ఇదేనని చెప్పాలి. తిత్తులను నొక్కి వాయిస్తూ గాలిని లోపలికి పంపిస్తే లోపలి గాలిలో ఒత్తిడి (pressure) ఎక్కువవుతుంటుంది. పైకి కనిపించే మెట్టులో (keys) ఒక్కొక్క మెట్టుకు, పెట్టెలోపల ఒక్కొక్క రీడ్ అమర్చబడి ఉంటుంది. మనకు కావలసిన స్వరాలను పలికించడానికి మెట్లను నొక్కితే, పెట్టె లోపల వున్న ఆ మెట్ల తాలూకు రీడ్లు చలించి ధ్వనిస్తాయి. ఈ రీడ్లు చలించేటపుడు పెట్టె లోపలి గాలి మెట్ల ద్వారా బయటికి పోతూంటుంది. వరుసగా వుండే ఈ మెట్లను 'కీబోర్డు' (keyboard) అంటారు, అందువల్ల హార్మోనియంను, 'పియానో, హార్ప్సికార్డ్' వాయిద్యాల వలె 'కీబోర్డు' వాయిద్యమంటారు.

ఈ హార్మోనియం వాయిద్యాన్ని గూర్చి అనేక అభిప్రాయాలున్నప్పటికీ, ఇది దేశమంతటా బహు జనాదరణ పొందిన వాయిద్యమని చెప్పాలి. మన పండితాభిప్రాయం దీనికి సరిగా వ్యతిరేకంగా వుండి, మన రాగసంగీత పద్ధతి కిది ఏ మాత్రం తగని వాయిద్యమని అంటారు. దీన్ని గూర్చి అనేక చర్చలు, వాదోపవాదాలు జరిగాయి. కాని మనం నిజాన్ని గుర్తించి తెలుసుకోవాలి. ముఖ్య విషయం ఈ వాయిద్యాన్ని, మన వీణ, సితార్, సారంగి, వయోలిన్ వాయిద్యాల వలెగాక, అతి సులభంగా వాయించి

నేర్చుకోవచ్చు. పై వాయిద్యాలవలె దీన్ని ఎక్కువ శ్రమతో శృతి చేయనక్కరలేదు. సులువుగా ఈ వాయిద్యాన్ని ఎక్కడికైనా తీసుకుని పోవచ్చు. దీని వెలకూడ చాలా మందికి అందుబాటులో వుండేది. ఈ కారణాలవల్ల దీనికింత ప్రజాదరణ లభించిందని చెప్పాలి. అయితే దీనిలోని స్వరాలన్నీ వాటి స్వస్థాన సౌందర్యాన్ని కొంత పోగొట్టుకుని, ఒకే విధమైన సమమట్టానికి మార్చుబడి ఉన్నవి. ఈ విధమైన మార్పు చెందిన స్వరస్థాయిని ఇంగ్లీషులో 'ఈక్వల్ టెంపర్మెంటల్ స్కేల్' (equal tempermental scale) అంటారు. పశ్చిమ దేశాల్లో అనేక రకాలైన వాయిద్యాలుపయోగించి 'ఆర్కెస్ట్రా' (orchestra) కచ్చేరిల కోసం వారీ పద్ధతి నవలంభించారు. మన సంగీతంలోని స్వరాలు, స్వరస్థానాలు, షడ్జపంచమ భావంవల్ల నేర్పడి, వాటి స్వస్థావ సౌందర్యాన్ని, నాద శుద్ధిని విడవకుండా శ్రోతలకు మహదానందాన్నందిస్తూంటాయి. దాని వల్లనే మన సంగీతం గమక యుక్తమైన రాగ పద్ధతిలో వృద్ధిజెంది వ్యాపించడానికి వీలైంది. మన రాగాలాపన పద్ధతి, స్వరకల్పన మొదలైన మన ప్రత్యేక సంగీత రీతులు సంగీత ప్రపంచంలోనే ఒక గౌరవ స్థానాన్ని మనకి సమకూర్చాయి. ఇదేమీ స్వోత్కర్షగాదు. విదేశీయులు మన సంగీతం విని ఆనందించి వ్యాఖ్యానించిన విషయమే ఇక్కడ తిరిగి చెప్పడమైంది. విదేశీయుల స్వర స్థాయి నామోదించి, చేసిన హార్మోనియం వాయిద్యం మన సంగీతాని కెంతవరకు ఉపయుక్తమో సందేహించ వలసిన విషయం. హార్మోనియంలోని స్వరాలతో మన రాగాలను వాయించడం, ఆలాపించడం వట్టి ఎండమావి వంటిదని పండితాభిప్రాయం.హార్మోనియంలో ఒక మెట్టుకు ఒక స్వర మేర్పడి నందువల్ల స్వరాంతర ఛాయలు, గమక విశేషాలు వినిపించడాని కవకాశం లేదు. అలా అందచందాలు లేకుండా వినబడే హార్మోనియం సంగీతం, ఆకులు, చిగుళ్ళు, పువ్వులు, కాయలు, పళ్ళు మొదలైన వన్నీ లేని మోడులా తయారవుతుంది ఆ సంగీత వృక్షం. ఈ కారణం వల్లనే దీనికి పండితామోదం కొరవయింది.

# 6

# తంతి వాయిద్యాలు

తంతి వాయిద్యాలు లేక తత వాయిద్యాయలు విస్తార సంఖ్యలో ఎన్ని రకాలుగా పెరిగి పోయాయంటే, వాటిని విభజించి తరగతుల వారీగా వర్ణించడం, వాటి చరిత్రను గురించి శోధించడం బహు కష్టసాధ్యమైన పనిగా తయారైంది. ఈ రోజుల్లో ఈ వాయిద్యాన్ని గురించి  చెప్పడానికి తెలుగులో సరిమైన పదాలు కూడ లేవు కనుక కలగాపులగపు భాషలో వాటిని చెప్పాలి. వీటిలో 'హార్పులు', 'లైర్పు', 'సాల్టరీలు', 'డల్సిమర్సు' 'జిథర్సు', 'ల్యూట్స్' మొదలైన రకాలు, వీటిలో ఎన్నో రకాలు, వాటిని వాయించే పద్ధతులు, అన్నీ అసంఖ్యాలే, అందు వల్ల వీటి అభివృద్ధి, వ్యాప్తి అనేక రకాలైన పరిస్థితుల్లో, అనేక రకాలైన సాధనాలు, పనిముట్లతో జరిగింది. వీటి చరిత్రను గురించి అనేకమైన అభిప్రాయాలున్నాయి, కాని అవేమి సమన్వయ దృష్టితో కూడినవి కావు, అవి సర్వత్రా ఆమోదించిన అభిప్రాయాలూ కావు. కొంతమంది వీటిని వేటకు పనికి వచ్చే విల్లమ్ముల నుంచి బయలు దేరాయన్నారు; మరికొంతమంది 'భూమివీణ' వాయిద్యమే వీటి ప్రాథమిక దశన్నారు; ఇంకా కొంతమంది వెదురు కర్రలతో చేసిన 'జిథర్' వీణల నుంచి వృద్ధయ్యేయన్నారు. ఇలా శోధనలు, చర్చలు సాగుతూనే ఉన్నాయి.

వేటాడే విల్లు, అమ్ములు చాల పురాతనమైన పనిముట్లు, చాలా రకాల వీణలు వీటి ప్రాతిపదికతోనే పరిణామం చెందాయని చాలా మంది అభిప్రాయం. 'భూమివీణ' (Ground harp) వీటిలో నొకటిగా బాగా ప్రాథమికమని చెప్పాలి. ఒక చిన్న గోతిని, ఒక చర్మంతో కప్పి, బాగా వంగే వెదురు కర్ర నొక దాన్ని పక్కను పాతి నిలబెట్టి, ఈ కర్ర చిగురు భాగం నుంచి ఒక తాడు గట్టిగా కింద వున్న తోలుకు విల్లుతాడు లాగ బిగించడం; ఈ తాడును చిన్న కర్ర ముక్కతో లాగి వాయిస్తూండడం; కాని ఈ విధమైన 'భూమివీణ' వాయిద్యాన్ని మన దేశంలో ఎక్కడా చూసినట్లు కనిపించదు. వెదురుతో చేసే 'జిథర్' వీణ అంటే, ఒక వెదురు కర్ర పైపెచ్చును కొంచెం పైకి లాగి, కర్రనుంచి బయటికి లాగెయ్యకుండా, కర్ర మీదే వుంచి, ఆ సన్నని పెచ్చుల్ని, రెండింటిని తమాషాగా అల్లి, తాడులాగ పేనడం. ఈ పేనిన తాడుని ఇంకొక పుల్లతో కొట్టి వాయిస్తారు. దీన్ని ఈ రకం వీణలకి 'బాల్యావస్థ' అని చెప్పవచ్చు. ఇలాటి వాటిని మన అస్సాం ప్రాంతంలో 'జింటాంగ్' అని, మన రాష్ట్రంలో 'రుంజ గొట్టం' లేక 'రుంజగొట్టం'

అనే పేర్లతో చూర్ణం కద్దు. తంతి వాయిద్యాలిలా అనేక విధాలైన కృత్రిమ మార్గాల్లో బయలుదేరి వృద్ధిచెందాయి. అదంతా మనకి చీకటి మార్గంలా తోస్తుంది. ఆ చీకటి తోవలోకి ప్రవేశించడం మన తరం కాకుండా వుంది.

తంతి వాయిద్యాన్ని మూడు పెద్ద విభజనలు చేసి చెప్పవచ్చు. మొదటివి, పాటల్ని కాని, రాగాన్ని గాని వాయించడానికి వీలులేని రకాలు. అవి కేవలం శృతికోసం, తాళ గతి సూచించడం కోసం పనికి వస్తాయి. వీటిని శృతి, తాళవాయిద్యాలని (drones and rhythmic adjuncts) చెప్పవచ్చు. రెండవ రకం లోనివి, - ఒక స్వరానికి ఒక తంతి ఉండేట్లు ఏర్పాటైన రకాలు. వీటిలో హార్పులు, లైర్పు, దల్సిమర్పు మొదలైన వుండి, పాటలు వాయించడానికి వీలైనవి. వీటిని ఇంగ్లీషులో పాలికార్డు (polychords) లంటారు. ఇంక మూడో రకం చాలా పెద్ద కుటుంబం. ఇంగ్లీషులో వీటిని మోనోకార్డు (monochords) లంటారు. అయితే వీటిలో ఒకే తంతి ఉంటుందని భ్రమ పడకూడదు. వీటిలో నాలుగైదు తంతు లుండవచ్చు, కాని ఒక్కొక్క తంతితోను మనకు కావలసిన పాటో, రాగమో వాయించవచ్చు. ఇలా వయోలిన్ వాయిద్యంలో ఒక్క తంతి మీద భైరవి పెద్దవర్ణమంతా వాయించగల సమర్థులున్నారు, అంటే మనకి ఈ వాయిద్యాలలోని సౌకర్యం తెలిసొస్తుంది. ఈ రకం వాయిద్యాల్లో మళ్లీ మెట్లున్నవి, లేనివి, విల్లుతో వాయించేవి, కుణపం (plectrum) తో వాయించేవి, పొడుగు, పొట్టి దండి లున్నవి ఎన్నో రకాలున్నాయి. ఈ విభజన, ఇటుక్రితం చెప్పిన, సుషిర వాయిద్యాలతో పోలిస్తే బాగా అర్థమవుతుంది. 'హార్మోనికా', 'ప్యాన్‌పైప్', 'ఫ్లెష్ట్' మొదలైన వాయిద్యాల్లో ఒక్కొక్క స్వరానికి ఒక బద్ద ఉంటుందని చెప్పబడింది. వీటిని 'పాలికార్డు' వాయిద్యాలతో పోల్చవచ్చు. వేణువు, శహనాయి, నాదస్వరం మొదలైన వాయిద్యాల్ని 'మోనోకార్డు' వాయిద్యాలతో పోల్చి చెప్పాలి. ఇక్కడ ఒక గొట్టంతో సంగీతాన్ని పూర్తిగా వాయించడాని కేర్పాటుంది. ఇదంతా పోలిక కోసం చెప్పవలసి వచ్చింది. ఈ తంతి వాయిద్యాలు ఇన్ని రకాలున్నాయి కనుక ఒక్కొక్క తరగతికి, తరగతి లక్షణాలన్నీ వుటికి పుచ్చుకున్న ఒక్కొక్క వాయిద్యాన్ని తెలుసుకుంటూ ముందుకు సాగాలి.

ఇంక ఈ శృతి, తాళ వాయిద్యాల తరగతికి చెందిన 'తుంతునే', 'తుంతిన' వాయిద్యాన్ని తెలుసుకుందాం. ఇది మన పశ్చిమ ప్రాంతంలోను. దక్షిణ పీఠ భూమి ప్రాంతంలోను సన్యాసులు, బిచ్చగాళ్ళు మొదలైన వాళ్ళ వద్ద కనిపిస్తుంది. ఈ వాయిద్యం 25 సెంటీమీటర్లు పొడుగుండి, 15 మొదలు 20 సెంటీమీటర్ల అర్థ కొలత గల కుంచం ఆకారంలో వుంటుది. ఈ కుంచం కింది భాగాన్ని చర్మంతో కప్పుతారు. 75 సెంటీమీటర్ల పొడుగైన ఒక వెదురు కర్రను కుంచం వెలుపల మేకులతో బిగిస్తారు. ఈ వెదురు కర్ర కొసని ఒక పూటీ (peg) ఉంటుంది. ఈ పూటీని, కుంచం కింది భాగంలో వున్న చర్మాన్ని కలుపుతూ ఒక దారం బిగించబడి ఉంటుంది. పూటీని

తిప్పుతూ ఈ దారాన్ని బాగా బిగించవచ్చు లేక వదులు చేయవచ్చు. పాట పాడే వాళ్ళు వాయిద్యాన్ని చేత్తో పట్టుకుని, ఇంకొక చేతి వేలుతో తాళం వరసలో మీటుతూ, పాట



32. తంతి వాయిద్యాలు – తున్ తునె, ఏకతార్, తంబురా

పాడుతూంటారు. ఇలా పాడుతూంటే ఈ వాయిద్యంలో పాటకి ఆధార శృతి మనకి వినబడుతూంటుంది. మహారాష్ట్రలో 'పోవదా' (povada ballad) పాటకు కూడ దీన్ని ఉపయోగిస్తారు. (చిత్రం : 32)

ఈ తుంతిన వాయిద్యాన్ని 'కన్న గారని' పించుకుంటుంది 'గోపీ యంత్రం' లేక 'ఏకతార' అనే వాయిద్యం. ఇది బెంగాల్, ఒరిస్సా ప్రాంతాల్లో కనిపించే వాయిద్యం. ఇక్కడ బాగా గ్రామ గ్రామం తిరుగుతూండే, వైష్ణవ సాంప్రదాయ పాటలు పాడేవాళ్ళు, వేదాంత తత్వాలు పాడే వాళ్ళు, సూఫీ తత్వపు పాటలు పాడేవాళ్ళందరు కూడ ఈ గోపీ యంత్రాన్నే లేక 'ఖమర్' అనే వాయిద్యంతోనే, 'బాయన్' అనే చిన్న డోలుతో కూడ పాటలు పాడుకుంటారు. తుంతునె లాగే ఈ గోపీ యంత్రం కూడ కర్రతో చేసిన కుంచం

ఆకారంలో వున్న గుండ్రటి వాయిద్యం, కాని దీని మట్టం అంటే కింది భాగం కొంచెం వెడల్పు ఎక్కువగాను, పై భాగం కొంచెం సన్నగాను ఉంటుంది. కింది భాగం తోలుతో కప్పుతారు. కొమ్మతో వున్న కుంచానికి బయట మేకుతో బిగిస్తారు. ఆ కర్ర కొసని ఒక పూటీ కూడ ఉండవచ్చు. ఒక తాడుని పైనున్న పూటీకి, కర్ర కొమ్మ మధ్యనుంచి పోనిచ్చి, కుంచం కంద వున్న తోలుకు బిగిస్తారు. ఇది వాయించేటపుడు, కొమ్మ వలె వున్న కర్రను చేత్తో పట్టుకుని, రెండో చేత్తో మీటి వాయిస్తూ, చేత్తో పట్టుకున్న కర్రను కొంచెం నొక్కుతూ వాయిస్తారు. ఇలా నొక్కితే దారం బిగువు ఎక్కువై స్వర స్థాయి కొంచెం హెచ్చుగా వినిపిస్తుంది. తుంతునె వాయిద్యంలోని ధ్వని కంటె దీనిలో వినిపించే ధ్వని ఇంకా బాగుంటుంది. ఈ ధ్వని తాళానికి అనుగుణంగా వినిపిస్తూంటుంది. మన వాయిద్య కూటాల్లో ఈ రోజుల్లో 'వాంపింగ్' (vamping) అని పాటకి తాళం గతిలో రెండు మూడు స్వరాలతో కూడిన ఒక చిన్న 'ఊతపదం' లాటి ధ్వని రక్తి కోసం వాడుతూంటారు. మన గోపీయంత్రంలో కూడ అలాంటి 'వాంపింగ్' ధ్వని వినవస్తుంది. ఇది పాటకి ఆధారమైన శృతి లాగ వినడానికి బాగుంటుంది.

ఈ తుంతునే గోపీ యంత్రాల వంటిదే ఇంకొక వాయిద్యం ఉంది. దానికి హిందీ భాషలో 'ప్రేమ్‌తాల్' అని, బెంగాలీలో 'ఖమక్' అని, మహారాష్ట్ర భాషలో 'భోంకా' అని, మన తెలుగులో 'జమిడిక' లేక 'జమిలి' వాయిద్యమని అంటారు. ఇవన్నీ తాళానికి అనుగుణంగా ధ్వనించే వాయిద్యాలు. తుంతునె, గోపీ యంత్రాల ధ్వని ఆధార శృతి లాగ వినిపిస్తుంది. ఈ జమిలి వాయిద్యంలో ప్రాథమికంగా అనపకాయ బుర్రల్ని కూడ ఉపయోగించేవారని తెలుస్తూంది. కుంచం ఆకారంలో గుండ్రంగా చేసినవి కూడ సామాన్యంగా కనిపించేవే. తుంతునె, గోపీ యంత్రంలో లాగే వీటికి కూడ గుండ్రటి



33. ప్రేమ్‌తాల్ లేక భోంకా

కుంచం, కింద భాగం తోలుతో కప్పి ఉంటుంది. ఒక రకమైన 'గట్' (Gut) తాడు ఈ చర్మానికి బిగింపబడి కుంచంలో నుంచి పైకి వస్తుంది. పైకి కనిపించే ఈ గట్ తాడుకు కొసని ఓ కర్రముక్క కడతారు. కుంచాన్ని చంక కింద పెట్టుకుని, ఆ చేత్తోటే తాడు కొసనున్న కర్రముక్కను లాగి పట్టుకుని, ఇంకో చేత్తో కాణం (plectrum) పుచ్చుకుని ఈ తాడును మీటుతూ పాట పాడుతూంటారు. మీటేటపుడు, కర్రముక్కతో పట్టుకున్న తాటిని వదిలించి కదుపుతూంటారు. దాని వల్ల ఆ వచ్చే ధ్వని వింతగా, తాళయుక్తంగా, చెవుల కింపుగా వినిపిస్తోంటుంది. దీన్ని పాముల వాళ్ళు, ఇతర జానపదులు పాటలకి ఉపయోగించటం సామాన్యం. (చిత్రం : 33)

ఒరిస్సాలోని సంతాల్ జాతి గిరిజనుల్లో 'ఖువాంగ్' అనే వాయిద్యాన్ని నాట్యాల్లో ఉపయోగిస్తారు. దీనిలో చిన్న పెద్ద రకం వాయిద్యాలున్నాయి, కాని సామాన్యంగా ఒక మీటరు పొడుగైన వెదురు కర్రకు రెండు కొసల్నీ, రెండు వంచిన చిన్న కర్రముక్కల్నీ వెదురు కర్రలో బిగిస్తారు. ఈ రెండు కర్రముక్కలనీ కలుపుతూ మధ్యలో ఒక నారతాడుంటుంది. కోడిగుడ్డు ఆకారంగా వుండే ఒక వెదురు బుట్టను అల్లి, దాన్ని మామూలు కాగితాలతో కప్పి, చూడ్డానికింపుగా వుండేట్లు రంగు కాగితాల పీలికలు కూడ



34. ఖువాంగ్

వేళ్ళాడదీస్తారు. ఈ బుట్టని వెదురు కర్రకు మధ్యని వేళ్ళాడదీస్తారు. ఈ బుట్ట, తాడు లాగితే వచ్చే ధ్వనిని విస్తృతపరచడానికి (resonator) కూడ ఉపయోగిస్తుంది.

నాట్యం చేసే వాళ్ళు ఈ వెదురు కర్రను ఒక చేత్తో పట్టుకుని. రెండో చేత్తో నారు కాటిని లాగి ధ్వని చేస్తూ నాట్యం చేస్తారు. 'ఖూం, ఖూం' అని ఒక వింత శబ్దం వినబడుతూంటుంది. గిరిజనులు, ఆటవికులు వాయించే ఈ వాయిద్యం బొత్తిగా సామాన్యంగా, అనాగరికంగా కనిపిస్తుంది, కాని తర్వాత తర్వాత వచ్చిన 'జిథర్' వీణలకు ఆనపకాయ బుర్రలు, కర్రతో చేసిన బుర్రలు కట్టి వాయించే అలవాటు ఇక్కడ నుంచే ప్రారంభమయిందా అనిపిస్తుంది. (చిత్రం : 34)

ఇంక శృతి కోసరం ఉపయోగించే తంబూర మొదలైన శృతి వాయిద్యాల్ని (drones) గూర్చి కొంత తెలుసుకోవాలి. శృతి కుపయుక్తాలైన వాయిద్యాలన్నీ 'ఏక్‌తార' కుటుంబానికి చెందినవే గాని వాటిలో తంబూరని పోలినవి, అట్టే నేర్పరితనం లేకుండా తయారైన రకాలెన్నో ఉన్నాయి. ఏక్‌తార అనేది, దీన్ని భాషల్లో 'ఏక్‌నాద' అని కూడ అంటారు, ఒకే తంతి గల వాయిద్యం. దీనిలో ఒక ఎండిపోయిన ఆనపకాయ బుర్ర ఉంది, ఆ బుర్రలోకి ఒక వెదురు గొట్టం లాటి దండిని దూర్చి తయారు చేస్తారు. దండిని బుర్రలోకి దూర్చి బిగించడం ఒక ముఖ్యమైన విషయం. ఈ అలవాటే తర్వాత కాలంలో 'లూట్' రకాల వీణలకి, అంటే సితార, వీణ, సరోద్ మొదలైన వాయిద్యాల నిర్మాణానికి దారితీసిందనిపిస్తుంది. లూట్ రకాల వీణల్లో దండి బుర్రతో కలిసిపోయి, బుర్ర ఒక పక్క పొడుగ్గా వుండి దండిగా మారిందా అనిపిస్తోంది. 'బువాంగ్' వాయిద్యాన్ని గురించి చెప్పుకున్నప్పుడు, దీని కిందకు వేలాడదీసిన వెదురు బుట్ట, వెదురు కర్ర కిందకున్నట్లు చెప్పుకున్నాం. అలా కిందుగా వేలాడదీసే అలవాటే జథర్ వీణలకు, అంటే, విచిత్రవీణ, రుద్రవీణ మొదలైన వాటి నిర్మాణానికి దారి తీసిందని చెప్పాలి. ఇంక ఏక్‌తార విషయం, దండి బుర్రలోకి దూర్చ బడి, దండి భాగం కొంచెం బుర్ర కిందకు గూడ కనిపిస్తోంటుంది. ఈ కనిపించే దండి భాగానికిఒక కొక్కెం (hook) బిగించి ఉంటుంది. ఈ కొక్కెం నుంచి ఒక తీగను, బుర్ర పైభాగం మీదుగా దండి చివర వున్న ఒక పూటీకి బిగిస్తారు. పూటీతో తీగెను బాగా బిగించడం, వదులు చేయడం అవసరమైనప్పుడు చేసుకోవచ్చు. బుర్ర పై భాగం మీద తీగ కిందకు ఒక కర్రతో చేసిన చిన్న పీట వంటి దాన్ని (bridge) అమరుస్తారు. ఏక్‌తార వాయిద్యాన్ని, దండిని చేత్తో పట్టుకుని చూపుడు వేలుతో ఇటు అటు తీగను మీటుతూ వాయిస్తారు. ఏక్‌తార అనే పేరు ఒక్కొక్కప్పుడు మనల్ని గంద్రగోళ పెడుతూంటుంది. ఏక్‌తార అంటే ఒకటే తీగ వున్న వాయిద్యమనుకొంటాం, కాని, గుజరాత్‌లోని 'రాంసాగర్' అనే ఏక్‌తార వాయిద్యముంది. దానికి రెండు తీగలున్నాయి. అలాగే వాటి నిర్మాణంలో ఎంతో తేడా కనిపిస్తున్నా, గోపీ యంత్రాన్ని ఏక్‌తార అనే వాళ్ళున్నారు, ఏమంటే రెండింటిలోను కూడ ఒక తాడు కనిపిస్తుంది. కనుక. ఈ పేర్లు ఈ నాటికి కూడ గందరగోళానికి తావిస్తూనే ఉంటాయి. జానపదులు, బిచ్చగాళ్ళు విశేషంగా ఈ వాయిద్యాల్ని తయారుచేసుకొని ఉపయోగిస్తారు. వాళ్ళకి పేర్లని గురించి అట్టే పట్టింపులుండవు. (చిత్రం : 32)

శృతి వాయిద్య నిర్మాణంలో తర్వాత దశని గుర్తించాలంటే, 'తంబూరి' వాయిద్యాన్ని గురించి తెలుసుకోవాలి. ఇది కూడ దక్షిణాదిని జనపదులు, బిచ్చగాళ్ళు వాడే వాయిద్యమే. ఇది సుమారు ఒక మీటరు పొడుగ్గా వుండి, సులభంగా ఎక్కడికైనా తీసుకుపోవచ్చు. దీనిలో బుర్ర, కర్రతో చేసిన గుండ్రటి కుండవలె వుంటుంది. పై భాగం చదునైన పలచటి చెక్కతో కప్పబడి ఉంటుంది. ఈ బుర్రకి పక్కన ఒక సన్నని మెడ ఉండి, మెడ దండితో కలిసిపోయి ఉంటుంది. దండి కొసని ఒక పాము పడగ ఆకారంలో బొమ్మ మాదిరిగా (Motif) ఉంటుంది. బొమ్మ కిందికి దండిలోకి నాలుగు పూటీలు ఉంటాయి. బుర్ర కింద నుంచి, బుర్ర మీద వున్న పీటపైనుంచి, దండి కొసని ఉన్న పూటీల వరకు వ్యాపించి నాలుగు ఇనపతీగలు పూటీల్లో బిగింపబడి ఉంటాయి. ఇనపతీగలను వేలితో మీటుతూ శృతితో కూడిన పాట పాడడానికిది బాగా పనికి వస్తుంది.

బిచ్చగాళ్ళు, జానపదులు ఉపయోగించే తంబూరి నుంచే, మన మీ రోజుల్లో చూసే 'తుంబుర' అనే శృతి వాయిద్యం (drone) ఉద్భవించిందని, సుమారు 16వ శతాబ్ద నుంచీ మనకి తెలుసు. అటు క్రితం పురాణాల్లో తుంబురు, నారదులు 'తంబుర'ను ఉపయోగించేరని చెప్పేరు, గాని వారు చరిత్రకందని దేవతా స్వరూపులు. ఇలా చెప్పడం వల్ల, ధ్వని పూర్వంగా, మనకీ వాయిద్యం అనాదిగా పరిచయమైన వాయిద్యమని, ఆ చెప్పిన పెద్దల అభిప్రాయమై వుండవచ్చు. తంబుర అనే పదాన్ని బట్టి, ఇది తుంబిఫల లేక తుంబి అనే ఒక రకమైన ఆపనపకాయతో చేయబడినదని కూడ తెలుస్తొంది. పూర్వ సంగీత గ్రంథాల్లో కూడ ప్రామాణికంగా ఈ వాయిద్య స్వరూపం ఇలా ఉంది, దీని పూర్వ చరిత్ర ఇది అని ఎక్కడా చెప్పినట్లు లేదు. అలాగే చరిత్రలో ప్రమాణాలు కూడ చాల తక్కువగానే కనిపిస్తాయి. ఏది ఏమైనా తంబుర యొక్క నాదవైభవాన్ని వర్ణించడం చాల కష్టమై పని. తంబుర వాయిద్యంలోని నాదగుణము (quality of sound), ఆ నాదంలోని ఘనత (richness of tone), అందులో వినిపించే అనుస్వరాలు (overtones) అనితర సాధ్యమైనవి. సంగీత ప్రపంచంలో తంబురకి అనన్యమైన కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టేయి. మన సంగీత వైశిష్ట్యానికి తంబుర వాయిద్యాన్నొక నిదర్శనంగా చూపవచ్చు.

తంబుర నిర్మాణం చాలా సామాన్యమైనది. ఉత్తర దేశంలోని తంబూరలు సుమారు 90 సెంటీమీటర్ల అర్థకొలత గల ఆనపకాయ బుర్రలతో చేస్తున్నారు. దక్షిణాన్ని తంబూర బుర్రలు కొద్దిపాటి చిన్నవిగా వుండి, పనస మొదలైన కర్రలతో చేస్తున్నారు. ఈ రకం గట్టి పెచ్చు గల ఆనపకాయలకు మహారాష్ట్రలోని పండర్‌పూర్ ప్రాంతం బాగా ప్రసిద్ధిన స్థలం. బుర్రల్ని తంబూరకోసం తయారు చెయ్యడంలో ఒక ప్రత్యేకత కూడ ఉందని తెలుస్తొంది. ముదిరిపోయిన ఆనపకాయ బుర్రల్ని, వెచ్చగా వుండి పొగ తగిలే 'వంటిల్లు' వంటి స్థలాల్లో 2, 3 సంవత్సరాలు వేలాడగట్టి, దాని పెచ్చు గట్టిపడి బాగా ఆరుదల (seasoning) కోసం, ఉంచుతారని తెలుస్తొంది. అటు తర్వాత వాటిలోని

ఎండిపోయిన గుజ్జును తీసివేసి, కావలసిన విధంగా వాటిని కోస్తారు. బుర్రకు పైభాగాన్ని పల్చటి చెక్కతో కప్పుతారు. ఒకవైపున కోసి మెడ (neck) అతుకుతారు. ఈ అతికిన మెడ నుంచి దండిని చేర్చి అతుకుతారు. పురుషులుపయోగించే తంబూర బుర్రతో కలిసి సుమారు 150 సెంటీమీటర్లుంటుంది. స్త్రీలుపయోగించేది కొంచెం పొట్టిగా వుంటుంది. తంబూరలో కూడ బుర్రకు ఒక వైపు వున్న కర్రముక్కలోనికి 4 ఇనప తీగలను దూర్చి, బుర్ర మీద వున్న పీట మీదుగా దండి కొసనున్న పూటీలలో బిగిస్తారు. బుర్ర మీద వుండే పీటను దంతము, విరుగుడు చేవ, కొమ్ము మొదలైన గట్టి వస్తువులతో చేస్తారు. పీట ఆకారం వెడల్పుగా వుండి, సారంగి, సితార్ వాయిద్యాల పీటల వలె సన్నగా వుండక, మధ్య భాగం కొంచెం ఎత్తుగాను, రెండువైపులకు కొంచెం పల్లంగా వుంటుంది. అన్నిటికంటె ముఖ్యమైన విషయం, తంబూరలోని 'జీవం', లేక 'జీవన్', లేక 'జువరి' అనే ఊలు, సిల్కు వగైరాల ముక్కలు. ఈ ముక్కల్ని పీట మీద తీగ కింద అమరుస్తారు. దీనితో తంబూర నాదానికి ఒక గణనీయమైన, విశిష్టమైన నాద పరిపుష్టి ఏర్పడుతుంది. ఈ జీవాన్నుపయోగించడం మనకి వేలాది సంవత్సరాలుగా తెలుసునని చెప్పడానికి నిదర్శనలున్నాయి. జీవాల్ని మన దేశంలోను ఉపయోగించడం లేదని తెలుస్తూంది. చరిత్ర పూర్వకంగా చూస్తే, ప్రాథమికంగా జీవాన్నుపయోగించడం విధానం, 'ఏకతంత్రి' వాయిద్యంలో సన్నని వెదురు పేడును ఉపయోగించడంతో ప్రారంభమైనట్లుగా తెలుస్తూంది. 'ఏకతంత్రి' వాయిద్యమంటే ఏకతార వాయిద్యం కాదు. (చిత్రం : 32)

ఇంక మన రాగ పద్ధతి కుపయోగపడే తంతి వాయిద్యాలను (melodic stringed instruments) గూర్చి తెలుసుకోవాలి. ఈ వాయిద్యాల తరగతి చాలా పెద్దది. ఈ రకం వాయిద్యాలు మన సంగీతానికెంతో అభివృద్ధిని చేకూర్చడమే గాక మన సంగీత విధానాన్ని మార్చివేశాయని చెప్పాలి. ఇదివరలో ఈ విషయం కొంత చెప్పడమైంది. ఈ తరగతి వాయిద్యాల్లో రెండు వేరు విధాలైన వాయిద్యాలుండి, అందులో ఒక విధానం కాలగర్భంలో కలిసిపోయింది. ఇదివరలో చెప్పినట్లు ఒక పద్ధతిలో లేక విధానంలో ఒక తంతి, ఒక స్వరం ప్రాతిపదికతో ఏర్పడ్డ వాయిద్యాలు (polychords); రెండవ విధానంలో ఒక తంతి, అనేక స్వరాలతో (monochords) వుండే వాయిద్యాలు. ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన విషయం, ఒక తంతి, అనేక స్వరాలు అంటే ఈ వాయిద్యాల్లో ఒకే తంతి ఉంటుందని కాదు. ఒక తంతితో రాగాన్ని గాని, స్వర సముదాయాల్ని గాని వాయించడానికి వీలైనవి. ఈ వాయిద్యాల్లో అలాటి తంతులు 3, 4 కూడ వుండవచ్చు. ఏమైనా మొదటి విధానానికి చెందిన హార్పు, లైర్, డల్సిమర్ మొదలైన రకాల వీణలు, మన పూర్వులు ఉపయోగించి నందువల్ల, వాటికి కావలసిన నిర్దిష్ట స్వరాలు, ఆ స్వరాల్ని మార్చడం లేక మార్పుతో వాయించడం (shift of tonic note) ఎలాగ అని ఒక విధానం అంటే మూర్ఛన పద్ధతి అమల్లో ఉండేది. కాలక్రమేణ

తంతులను మెట్ల ఏర్పాటుతో అనేక స్వరాలను వాయించడాని కుపయోగించడం (monochords) ప్రారంభమయ్యేక, వీణ, సితార్, సరోద్ మొదలైన సంగీత వాయిద్యాల నిర్మాణం. స్వర విభజన, దానివల్ల మన సంగీత ప్రయోజనం అంతా పూర్తిగా మారింది. చరిత్రలోను, గ్రంథాల్లోను ఈ రెండు విధానాల వాయిద్యాల్ని కూడ 'వీణ' అని సాధారణ నామంతో వర్ణనలు సాగించడం వల్ల అనవసరమైన గందరగోళపు అభిప్రాయాలకు దారి తీశాయి. క్రమంగా మొదటి పద్ధతికి చెందిన మూర్ఛన పద్ధతి పోయి, తంతులను మేళము చేసి, మెట్లను బిగించి, అనేక స్వరాలు వాయించడమనే మేళ పద్ధతి అమల్లో ఉండేది; తర్వాత మేళ పద్ధతి కర్ణాటక, హిందూస్థాని సంగీతాలకి కూడ దేశ వ్యాప్తంగా ఆమోదింపబడింది. ఒక తంతి, ఒక స్వర పద్ధతిలో ఏర్పర్చ 'పోలికార్డ్స్' వాయిద్యాలు చాలా పురాతనమైనవని చెప్పబడింది. వాటిని కూడ వీణలనే మన వారు వ్యవహరించారుగాని వాటి నిర్మాణ మెలా జరిగిందో మనకేమీ తెలియదు. చాలమంది అభిప్రాయంలో అవి విల్లుతో ప్రారంభమయ్యేయనే చెబుతారు. విల్లులోని తంతో లేక నారినే, మొదట వాయిద్యంగా ఉపయోగించిన వారు పాట పాడుతూ తాళం కోసం మీటి ఉపయోగించే వారని, క్రమేపీ ఒక నారి తంతికి బదులు విల్లులో కిందుగా రెండు, మూడు తంతులు కట్టి ఉపయోగించడం జరిగిందని, ఈ పద్ధతిలోనే క్రమేపీ వేరు స్వరాల వలె వినిపించినందువల్ల అది 'వీణ' వంటి వాయిద్యంగా తయారైందని చెపుతారు.



35. విల్లాడి వాయిద్యం

పై అభిప్రాయానికి నిదర్శనం తమిళనాడులోను, కేరళలోను బాగా ప్రసిద్ధిన 'విల్లడి' వాయిద్యం. విల్లు అంటే వేటకు ఉపయోగించే విల్లు. అడి అంటే దెబ్బ. విల్లును కొట్టి వాయించడమని అభిప్రాయం. ఈ వాయిద్యాన్ని జానపదులు తమ పాటలకు,

గేయాలకు తాళ లయ సూచకంగా వినియోగిస్తారు. దీని పొడుగు సుమారు 2, 3 మీటర్లుండి, నార గాని, సన్నని తోలుగాని, 'వింటి నారికి' ఉపయోగిస్తారు. ఈ విల్లునొక బోర్లించిన కుండమీద అమరుస్తారు. కుండ వల్ల వింటిని కొట్టి వాయిస్తే ధ్వని విస్తార (amplify) మవుతుంది. వింటికి రెండు, మూడు చోట్ల చిరు గంటలు కూడ కడతారు. ఇది 'విల్లు పాట్టు' అనే జానపదుల పాటకు అనుసరణగా వుటుంది. పాడేవారు విల్లుకు ఎదురుగా కూర్చుని 'వంతలతో సహా' పాట పాడుతూ, తాళ లయల కనుకూలంగా చిన్న కర్రతో నారి మీద కొడుతూంటారు. గంటలతో కూడిన నారి ధ్వని, పాట కలిసి రక్తికడతాయి. (చిత్రం : 35)

హార్పులు, లైర్లు కూడ 'పోలికార్డ్' వాయిద్యాలని చెప్పబడ్డాయి. ఈ రెండు రకాల వాయిద్యాలు కూడ విల్లుగాని, విల్లు ఆకారంలో కర్రతో గాని చేసిన వాయిద్యాలు. హార్పులంటే, విల్లుకు నారి కట్టినట్లుగా రెండు కొసల్ని నారతోగాని, 'గట్' తాడుతోగాని కట్టడం. అలాగే విల్లుకు రెండు వైపులా నారికి కిందుగా 6, 7 తాళ్ళు, ఒక దానితో నింకొకటి కలిసిపోకుండా (parallel) కట్టడంతో ఈ హార్పు వాయిద్యం తయారవుతుంది. ఇలా అడ్డంగా, వరుసగా విల్లులో కట్టిన తాళ్ళు లేక తంతుల పొడవు క్రమంగా తగ్గుతూ వచ్చినందువల్ల, తంతుల ధ్వని యొక్క స్వర స్థాయి హెచ్చుగా వినిపిస్తుంది. ఇంక లైర్ వాయిద్యంలో 'వింటి నారి'కి బదులు ఒక కర్రను ఉపయోగిస్తారు, అంటే వంచిన విల్లు, ఆ విల్లులో నారికి బదులుగా కట్టిన కర్ర (cross bar) ఉంటాయి. ఇలా కట్టిన అడ్డ కర్రనుంచి కింద వున్న విల్లుకు 8, 9 తాళ్ళు, పక్కపక్కల్ని, ఒక దానితో నింకొకటి కలిసి పోకుండా (parallel) నిలువుగా కట్టడం. ఇక్కడ కూడ ఈ తాళ్ళు క్రమంగా పొట్టిగా వుండి, అవి వాయిస్తే వేరే స్వరాల్లాగ ధ్వనిస్తాయి. ఇలాగ విల్లులో నిలువుగా కట్టిన తాళ్ళతో కూడిన వాయిద్యాన్ని లైర్ అంటారు. కాని వీటి రెండు రకాల్లోను కూడ ధ్వని మందంగా వుండి, మంచి గుణమున్న నాదం కాదు. అందువల్ల ఈ రకం వాయిద్యాల్ని, నోటిని తెరిచి నోటి దగ్గిర పెట్టుకుని వాయిస్తే, నోటి కన్నం (cavity of mouth) ఆ ధ్వనిని విస్తృతం చేస్తుందని గ్రహించి, ఆఫ్రికా దేశంలో అలా నోటికి దగ్గిరగా పెట్టుకుని వాయించే వారని తెలుస్తోంది. ఏమైనా ఈ రకం వాయిద్యాలకు ధ్వనిని అధికం చేసే సాధనం కావలసి వచ్చింది. అదే మనం పైన చెప్పుకున్న, విల్లడి వాయిద్యంలోని ప్రక్రియ అంటే విల్లడి వాయిద్యాన్ని బోర్లించిన కుండ పైనుంచి వాయించడం. కాని ఇది కూడ అంత తృప్తికరంగా కనబడలేదు. అప్పుడు ఆనపకాయ బుర్రల్ని విల్లుకుకింది భాగంలో కట్టి ధ్వని విస్తారం చెయ్యడం ప్రాథమికంగా తెలుసుకొని, కర్రతో చేసిన బుర్రల్ను ఉపయోగించడం నేర్చుకున్నారని చెవుతారు.

లైర్ రకాల వాయిద్యం మన దేశంలో లేదనే చెప్పాలి. ఎక్కడో సింధు ప్రాంత నాగరికతను సూచించే బొమ్మల్లో ఒకే ఒక బొమ్మ కనబడింది, కాని, ఇది లైర్ వాయిద్యంలాటి బొమ్మా లేక లైర్ వాయిద్యమేనా అన్నది కేవలం వివాదాంశం, హార్పు

రకాలు మాత్రం కొన్ని రకాల అధికార ముద్రల్లోను, కొన్ని జాలికాల్లోను దొరికాయి కాని వాటి రూపురేఖల్లో మనం వివరాలేమీ గుర్తించ వీలుగా లేవు. (చిత్రం : 36)

'వీణ' అనే మాట లేక పదం మనకి వేదంలోనే మొదటి పరిచయం. అశ్వమేథ యాగంలో వేద పఠనానికి అనుసరణగా వీణను పయోగించి నట్లు చెప్పబడింది. వేదంలో వీణని గూర్చి ఇలా పొగిడారు. 'ఈ వీణ అందానికి సిరిసంపదలకు మారుపేర'ని చెప్పేరు. ఉషః కాలంలో వీణ వాయించడం ఆ కాలంలో బాగా అలవాటుగా వుండేదని తెలియడానికి ఋగ్వేదంలో ఒక ఇతిహాసముంది. ఒకసారి రాక్షసులు కణ్వమహరిష్షని ఒక చీకటి గదిలో కళ్ళుకట్టి బంధించి, ఉషోదయం ఎప్పుడైందో కళ్ళు తెరవకుండా చెపితే నిన్ను విడిచి పెడతామన్నారట. కొన్ని యామాలు గడిచిన తర్వాత ఆయనకు వీణా నాదం వినిపించిందట. వెంటనే ఆయన ఉషోదయమైందని గుర్తుపట్టి రాక్షసులకు చెప్పగానే వాళ్ళాయన్ని విడిచి వేశారట. మన పురాణాల్లోను, ఇతర సాహిత్యంలోను కూడ వీణని గురించి కావలసినన్ని వర్ణనలు కనిపిస్తాయి. హనుమంతుడు సీతాదేవిని వెదుకుతూ రావణాంతఃపురంలో ప్రవేశించి, ఒక చోట వీణా వాదకులు నిద్రిస్తూండడం చూసేడట. అందులో ఒక స్త్రీ వీణని తన వక్షస్థలం మీద వుంచుకుని, నిద్రిస్తోందట. వాల్మీకి ఆ దృశ్యాన్ని కలువపూల గుచ్ఛమొకటి పడవ మీద వున్నట్లున్నదని వర్ణించేడు. ఇంక, యువరాజు ఉదయనుడు వాసవదత్తను వీణావాదనతో సమ్మోహితురాల్ని చేయడమే కాకుండా, అడివిలోని మత్తగజాన్ని కూడ తన వశం చేసుకున్నట్లు చెప్పబడింది. పరమశివుని చేతి 'డమరు' వాయిద్యంలా, శ్రీకృష్ణుని వేణువులా, వీణకి కూడ ఒక పవిత్ర రూప చిత్రణ, దివ్య గుణాదేశం చేయబడింది. శివుని దక్షిణామూర్తి స్వరూపంలో ఆయన వీణాధర దక్షిణామూర్తి అయ్యేడు. అనపకాయ బుర్రతో కూడిన ఒక మెట్లులేని వీణ ఆయన చేతిలో, సనకాదిమునులకు జ్ఞానబోధ చేస్తున్న సమయంలో కనిపిస్తుంది. సరస్వతీదేవి 'వీణ పుస్తక ధారిణి' గద! జ్ఞానానికి, నాదానికి ఆవిడొక దివ్యరూపం. వీణ, పుస్తకాలు లేని సరస్వతీ విగ్రహ మెక్కడా లేదు. ఇంకొక విషయం- ఓంకార ప్రణవ నాద మొక్క లోతుపాతులు, ఆవిడకు కూడ అర్థంకాక - నాద సముద్రలో మునిగి పోకుండా, తన వీణ యొక్క అనపకాయబుర్రను రక్షణగా చేసుకుని



36. హార్పు

తేలి ఉంటోందట'. ఈ దివ్యోన్నత భావాన్ని వ్యాఖ్యానించడం చాలా అనవసరమైన పని.

వేదంలో చెప్పిన వీణను 'వన' లేక 'మహావీణ' అని వర్ణించేరు. ఈ వీణ 'దండ' లో పది కన్నాలుండి, ఒక్కొక్క కన్నం నుంచి పది తంతులు చొప్పున నూరు తంతులున్న వాయిద్యంగా చెప్పేరు. ఈ తంతులు 'ముంజ' అనే ఒక రకం గడ్డితో పేనిన తంతులట. వీటిలో 33 తంతుల్ని యజ్ఞకార్యక్రమాల కధిపతిమైన 'అధ్వర్యుడు' కట్టాలట. ఇంకొక 33 తంతులను ఋగ్వేదపఠనం చేసే 'హోత' కట్టాలట. సామవేదం చదివే 'ఉద్గాత' మరి 33 తంతులను కట్టాలి. ఆఖరి తంతిని యజమాని లేక యాగకర్త కట్టాలట. ఉద్గాత 'ఆసంది' అనే పీఠం మీద కూర్చుంటే, మిగిలిన వారు గడ్డి చాపల మీద కూర్చుని యజ్ఞ మంత్రాలు చదువుతారట. తర్వాత సాహిత్యంలో దీన్ని 'శత తంత్రి వీణ' అని పేర్కొన్నారు. ఈ వీణ కాశ్మీర్‌లో కనిపించే 'సంతూర్' వాయిద్యంలా ఉంటుందని కొంతమంది అభిప్రాయం.

ఈ 'తత' వాయిద్యాల్లోని తంతులను పురాణ కాలంలో 'ముంజ' మొదలైన వాటిగడ్డితో అల్లి, తర్వాత కాలంలో జంతువుల పేగు దారాలు 'గట్' (gut) ను ఉపయోగించారని, క్రమేపీ లోహ తంతులు వాడడం నేర్చుకున్నారని తెలుస్తూంది. తమిళ భాషలోని గ్రంధాల్లో తత వాయిద్యాలకు 'నరంబుక్కరువి' అంటే గట్ దారాల్ని వాడే వారని చెప్పారు. బృహత్కథా సరిత్సాగరంలో, ఒక కథలో కనకపురంలోని ఒక యువరాజు 'బిందుమతి' అనే బెస్తకుల స్త్రీని, 'దేవాంశతో కూడిన నీవు బెస్తకులంలో పుట్టడం ఎలా జరిగిందని' ప్రశ్నిస్తాడు. శక్తిదేవుని భార్యయైన ఆ బిందుమతి సమాధానం చెపుతూ - తాను పూర్వం దేవతల్లో వుండేదాన్నని, ఒకసారి తన వీణకు తతి కావలసి వచ్చి, ఇక ఆవు పేగును కొరికినందువల్ల తనకీ మర్త్యజన్మ బెస్తకులంలో కలిగిందని చెప్పింది. ఆవు పేగును కొరికినందువల్లనే తనకీ శాపం కలిగిందని చెపుతూ, ఆవు మాంసం తినేవాళ్ళ గతేమిటి అనే ప్రశ్నతో ముగిస్తుంది. ఆ రోజుల్లో ఇనప తీగల్ని ఉపయోగించడం బాగా పరిపాటై పోయిందిగాని సారంగి మొదలైన విల్లుతో వాయించే వాయిద్యాల్లో అక్కడక్కడ నన్నని 'గట్' తంతులు వాడడం ఇంకా అలవాటుంది.

హార్పు వాయిద్యాల్ని గురించి చెపుతూ సంగీత గ్రంధాలు రెండు రకాల్ని పేర్కొన్నాయి. ఒకటి 7 తీగల రకం, ఇంకొకటి 9 తీగల రకం. ప్రాంతీయమైన స్వల్ప తేడాలుండేవనిపిస్తోంది. ఏమంటే, 7 తీగల వాయిద్యాన్ని, 'చిత్ర' అని, 'పరివాదిని' అని, 'సప్తతంత్రి' అని గ్రంధాల్లో చెప్పారు. వివరాలు సరిగా చెప్పక పోవడం వల్ల తంత్రుల సంఖ్యను బట్టి పేర్లు వేరుగా చెప్పారా లేక ఒకే వాయిద్యానికి మూడు పేర్లు చెప్పారా అని సందేహం రాక తప్పడం లేదు. చిత్ర అనే పేరు మాత్రం రామాయణంలో చాలాసార్లు చెప్పబడింది. 9 తంతులున్న దాని పేరు 'విపంచి' అని చెప్పి, చిత్ర' వాయిద్యాన్ని వేలితో మీటి వాయిస్తే, 'విపంచి'ని 'కోణ' అనే (plectrum) కర్రముక్కతో వాయించినట్లు మహా కావ్యాల్లో చెప్పారు.

బాగా ప్రాథమికావస్థలో హార్పు వాయిద్యాలకు, తతుల్ని విల్లుకు బిగించి కట్టేవారే మోగాని, క్రమక్రమంగా నైపుణ్యంతో ధ్వని విస్తారం కోసం ఒక వస్తువు వుపయోగించడం (resonator) నేర్చుకుని, తంతుల నింకొక పక్క బిగించడానికి ఒక వంచిన కర్రను ఉపయోగించేరని తెలుస్తూంది. మన దేశంలో తంతులను పైటీలతో (pegs) బిగించడం, క్రమేపీ కాని,మొదట్లో తెలియలేదు. తంతులు 'రిసొనేటర్' లో బిగించిన తర్వాత, వాటిని చిన్న తోలు ముక్కకు బిగించి, ఆ తోలు ముక్కను తంతులు బిగించే ఇంకొక కర్రకు చుట్టేవారు. తంతులను బిగించవలసినవస్తే, ఈ తోలు ముక్కను కర్ర పైకి, కిందికి జరిపి తంతిని బిగిస్తే స్వరస్థాయి హెచ్చుయ్యేది. ఇలా తీగను బిగించి కావలసిన స్వరస్థానాలకు సరిచేయడం బాగా శ్రమతో కూడిన పనైనా, వాళ్ళు స్వరాలను, స్వరస్థానాలను చాలా సమర్థవంతంగా శృతిచేసి ఉండాలని తెలుస్తూంది. ధ్వని విస్తృత చేయడం కోసం, మొట్టమొదట అనపకాయ బుర్రల్ని ఉపయోగించినా,



37. సప్త తంత్రి వీణ

తర్వాత ఈ పనికి కర్రతో చేసిన చిన్న 'నావ' లేక 'దోని' (boat-shaped) ఆకారంలో వున్న దాన్ని, తోలుతో కప్పిగాని, కర్రచెక్కతో కప్పిగాని ఉపయోగించేరని తెలుస్తూంది. ఈ ధ్వని విస్తృత పరికరానికి 'అంభన' లేక 'దోని' అని పేరుండేది. ఈ దోనికి ఒక వైపు కర్ర, 'దండ' బిగించి వీటి రెండిటి మధ్యను తంతులను బిగించేవారు. ఆ రోజుల్లో హార్పు వాయిద్య మిలా ఉండి వుండవచ్చు. ఒక ఊహాచిత్రాన్నిచ్చుట, పాఠకుల కవగాహనకోసం చిత్రించడమైంది. (చిత్రం : 37)

ఋగ్వేదంలో 'భగవద్దత్తవీణ' (శరీరానికి), మానవ కృతవీణకి చక్కని పోలికలు చెప్ప బడ్డాయి. శరీరం లేక భగవద్దత్త వీణకి తలకాయ, పొట్ట, నాలిక, నరాలు, చర్మం ఉన్నట్లే, మానవాకృత వీణలో తలకాయ అనపకాయబుర్ర గాను, లోపలి గుల్ల భాగాన్ని పొట్టగాను (Ambhana), వాయించడం నాలికగాను, తంతులను నరాలుగాను, సంగీతాన్ని మాటగాను, శరీరాన్ని చర్మంతో కప్పినట్లు వీణకూడ చర్మంతో కప్పబడిందని చెప్పారు.

ఈ పుస్తక ప్రారంభంలో ఆర్యుల, ఆర్యేతరుల నాగరికతని చర్చిస్తూ, వారి సాంఘిక, సాంస్కృతిక సంబంధాల్ని గురించి చెప్పుకున్నాం. సామాన్య దృష్టిలో ద్రవిడుల సంస్కృతి, ఆచారాలు వేరుగా వుండేవని, ఆర్యులు మన దేశంలో ప్రవేశించిన తర్వాత, ఆర్యుల ఆచారాలు, ద్రవిడులవి కలిసిపోయేయని అభిప్రాయం; కాని చాలా లోతు దృష్టిగల పెద్దల్లో ఇలాంటి సాంస్కృతిక వ్యత్యాసాలను వ్యతిరేకించి, తర్కించడం తప్పని, మన దేశమంతటా ఒకే ప్రజ, ఒకే సస్కృతి అని అంటారు. ఇలాంటి సంస్కృతులు ఒకదానికొకటి ఇచ్చి పుచ్చుకోవడం మొదలైన చర్చ, సంగీతం దగ్గరకి వచ్చేటప్పటికి, మరింత క్లిష్టంగా తయారై, వట్టి పొగమంచులా మారుతుంది. ఏమంటే సంస్కృతులు, నాగరికతలు ఎంత వేగంగా కలిసిపోతాయంటే, మనం వాటిని గుర్తించి, వ్రాయడం మొదలుపెట్టేసరికి అవి పైకి అవినాభావంగా కలిసిపోయి, కొన్నింటి మూల సిద్ధాంతాలు మాత్రం మిగిలి గుర్తించ గలిగేట్లుంటాయి. ఈ కలయిక ఒక జాతిలోనే కాక అంతర్జాతీయంగా కూడా పరమ సత్యం అనాలి, ఎలాగంటే ఈజిప్టు, అరేబియా, గ్రీసు మొదలైన దేశాల నుంచి వాయిద్యాలు వచ్చి మన దేశ 'ద్రవిడ' ప్రజల్లో కలిసిపోయి ఉండవచ్చు. ఇదంతా మనస్సులో దూరంగా ఉంచుకొని, తమిళుల ప్రాచీన సాహిత్యం కొంత తిరగేస్తే ఆర్యుల కంటె భిన్నమైనదని తోచే సంగీత సమాచారం కొంత కనిపిస్తుంది. తమిళ సాహిత్యంలో తంతి వాయిద్యాల్లో ముఖ్యంగా చెప్పినది 'యాళ్' వాయిద్యం. కాని ఈ యాళ్ (Yazh) వాయిద్యం ఆర్యులదని చెప్పబడ్డ 'పోలికార్డ్' వీణల కంటె భిన్నమైనదా? ఈ సాహిత్యంలో కొన్ని సందర్భాల్లో 'యాళ్', 'వీణై' పదాల్ని పక్కపక్కల చెపుతూ వచ్చారు. యాళ్ చెప్పవలసిన చోట వీణై అని, వీణై అని చెప్పవలసిన సందర్భంలో యాళ్ అని ఉదహరించబడ్డాయి. దాని వల్ల కొందరు పండితులు యాళ్, వీణై వాయిద్యాలు వేరని, మరికొందరు అవి ఒకటేనని అభిప్రాయ పడుతున్నారు. పోనీ అంటే, మకరయాళ్ అన్నా, మకరవీణై అన్నా ఒకటేనని చాలా మందికి తెలుసు. ఇలాంటి సందర్భంలో ఈ వాయిద్యాల్ని ఆర్యుల వనడమా లేక ద్రవిడుల వనడమా? ఇంక వాటి నిర్మాణాన్ని కూడ ఒకే రకంగా వర్ణించేరు. సరే, సాంస్కృతిక విషయాలటుంచి, కొంతమంది పండితులు పురాణ గ్రంథాలైన, పట్టుపట్టు, సిలప్పదికారం, మణిమేకలై, జీవక చింతామణి మొదలైన



38. యాళ్

గ్రంథాల్ని, ఇంకా పురావస్తు నిదర్శనలను బాగా చదివి, జీర్ణించుకొని ఈ యాళ్ వాయిద్యాల్ని గురించి వివరాలతో చెప్పారు. (చిత్రం : 38)

బహుశః 'విల్‌యాళ్' అన్నది ప్రథమంలో చెప్పబడ్డ 'పరంబుకరువి' వాయిద్యంగా ఉండి ఉండాలి. కట్టనర్ అనే పురాణ గ్రంథకర్త, ఒక వేటగాడు 'కుమిళ్' (Kumizh) చెట్టు యొక్క గుల్లగా వున్న కొమ్మతో విల్లు తయారుచేసి దానికొక నారతాడు నారిగా కట్టి, విల్‌యాళ్ వాయిద్యం తయారు చేసుకుని, అది వాయించుకుంటూ, 'కురంజిపన్' పాడుకుంటూ హాయిగా తిరిగేవాడని చెప్పాడు. పన్ అంటే రాగమన్నమాట. తర్వాత ఇంకా ఎక్కువ తంతులతో (narambu = పేగుతంతి) ఈ హార్పులను తయారు చెయ్యడం నేర్చుకున్నారు. 'శంకోటియాళ్' అన్నదానికి ధ్వని విస్తారం కోసం ఒక 'రెసొనేటర్' ఉండి, కర్ర చెక్కతో కప్పబడింద్తె ఉండాలి. దాని'కోటు' అంటే దండ ఒక నిలువైన గొట్టం వంటిదని చెప్పబడింది. దానికి 17 తంతులుండేవట. 'సంకోట' యాళ్‌కు 4 తంతులు మంద్రస్థాయిలోను, 7 తంతులు మధ్యస్థాయిలోను, 3 తంతులు తార స్థాయిలోను బిగించి ఉండేదని చెప్పారు. పెరియాళ్ చాల పెద్ద వాయిద్యమై ఉండాలి. దాన్ని నావ ఆకారంలోని 'పత్తర్' అంటే రెసొనేటర్‌ను తోలుతో కప్పి 21 తంతుల బిగించి తయారు చేసిందట.. సిరియాళ్ అన్నది పెరియాళ్ కంటే చిన్నదన్నమాట. మకరయాళ్ లేక మకరవీణైకి 19 తంతులుండి, ఇవన్నీ పేగు తంతులే, చాలా భాగ్యవంతులు వారి అంతఃపురాల్లో వాయించుకునేవి. తమిళ గ్రంథకర్తలు దీన్ని 'అవనక్కైవీణై' అంటే యవనులు (గ్రీసుదేశస్థులు లేక గ్రీకులు) ఉపయోగించేదని చెప్పారు. యవనులు అంటే గ్రీకులే కాక ఇతర దేశస్థులందర్నీ యవనులనడం అలవాటుంది. అయితే గ్రీకులు వాయించే ఒక మార్పుకు 'మగడిస్' లనే పేరుంది. గ్రీకులు దీన్నొక 'లిడియన్' దేశపు ప్రాచీన వాయిద్యంగా భావిస్తారు. ఏనక్రియోన్' (Anacreon) అనే విడియన్ కవి, క్రీస్తుపూర్వం 6వ శతాబ్దానికి చెందినవాడు, తన పద్యంలో ఇలా వ్రాసేడు. 'ఓ లూకేసిస్! నేనొక లిడియన్ హార్పు వాయిస్తున్నాను. అది 20 తంతులున్న ఒక 'మగడే' నీవు మంచి యవ్వనంలో వున్నావు'. అని వ్రాసేడు. ఒకటి జ్ఞాపకముంచు కోవాలి. గ్రీకులకు స్వంతంగా సంగీత వాయిద్యాలేమీ ఉండేవి కావు. ఏమైనా 'మగడీస్' ఉంటే, అవి మెసపటోమియా, ఇరాన్ మొదలైన దేశాల్నుంచి దిగుమతి చేసుకున్నవై యుండాలి. వాటిని వాళ్ళు ప్రాచ్య దేశాల్నుంచి వచ్చినవని అనుకొనేవారు. ప్లాటో మహాశయుడు వీటి నింద్రియాల నుద్రిక్తపరుస్తాయని ఖండించేడు. ఈ మకరయాళ్ (మగడిస్ = మకర) మన దక్షిణ దేశానికి పశ్చిమ ఏషియా నుంచి కాని, లేక అక్కడనుంచి గ్రీసు ద్వారా కాని ప్రయాణం చేసి వుండవచ్చు. క్రీస్తు తర్వాత 10వ శతాబ్దానికి పూర్వమే, ఈ మకరవీణ ఇండొనీషియా చేరుకుంది. ఇండొనీషియాలో, తూర్పు జావాలో వున్న 'జలతుండ్' శిల్పాల్లో (క్రీ.శ. 977) ఈ మకరవీణ, ఒక రెసొనేటర్‌తో, మొసలి ముఖంతో వున్నట్లు కనిపిస్తుంది. ఆ దేశంలో కూడ దీనిని

భాగ్యవంతులు, రాజులు, ఉపయోగించేరని తెలుస్తోంది. తమిళనాడులో 'ఆదియాళ్' కూడ అంటే మొదటి యాళ్ ఉంది. కృతయుగంలో రాక్షసుల్ని, దెయ్యాల్ని, భూతాల్ని స్వాధీనం చేసుకోవడానికి దీన్ని ఉపయోగించేరని గాథలు చెపుతాయి. ఆ వాయిద్యానికి. ఒక్కొక్క స్థాయిలో 200 తంతుల చొప్పున, 5 స్థాయిల్లో మొత్తం 1000 తంతులు బిగించేవారట. ఇది ఎంతవరకు నిజమో, ఎంతవరకు ఉత్ప్రేక్షో మనకు తెలియదు. 'పెరుకలం' అనే యాళ్, ఈ ఆదియాళ్ బహుశః ఒకటేనేమో! ఈ రోజుల్లో సితార్ వాయిద్యం బాగా ప్రసిద్ధినట్లు, యాళ్ ఆ రోజుల్లో బాగా ప్రసిద్ధి చెందింది, ప్రాముఖ్యమైంది కూడాను. శిలప్పదికారంలో 'కనల్వరి' అనే పాటలో, రాజనర్తకి మాధవి, కథానాయకుడైన కోవలన్, ఎలా కలుసుకున్నారో వర్ణించి చెప్పారు. 'చేతులతో నమస్కరించి, – ఆమె నగిషీ చేసిన పెట్టె తెరిచి, అందులోంచి – పత్తర్ (రెసొనేటర్), కోటు (దండి) తతులతో కూడి, పువ్వులు నగిషీ చేసి చక్కటి పెండ్లికూతుర్ని అలంకరించినట్లున్న యాళ్ను, బైటికి తీసి, ముందుగా తాను తంతులన్నీ సక్రమంగా, సుస్వరంగా వున్నాయో లేదో మీటి చూసిందట. యాళ్ను మీటి సరిచూస్తున్న ఆమె చేతి వేళ్ళు ఉంగరాలతో సహా కదులుతూంటే, భ్రమరాలు పుష్పగుచ్ఛం మీద సంచరిస్తూన్నట్టుగా కనిపిచేయట. స్వరాలన్నిటినీ సరిజూసి కోవలన్ చేతికి యాళ్ నందిస్తూ అందట. 'మిమ్మల్ని నేను ఆజ్ఞాపించను. మీకే పాట కావాలో సెలవియ్యండి.' ఆయన కావేరి నది మీద, 'కనల్వరి' (సముద్రపుటొడ్డు) మీద పాటలు ఎంతో హాయిగా గానం చేశాడట' అని చెప్పబడింది.

భర్హత్, బుద్ధగయల శాసనాల్లో కనిపించే హార్పులకు 5 తంతులే కనిపిస్తున్నాయి. కాని క్రీస్తుకు పూర్వం 3వ శతాబ్దానికి చెందిన అజంతాకు దగ్గరగా వున్న 'పితల్ ఖోరా'లోని శిల్పాల్లోను, శిల్ప బొమ్మల్లోను, 2వ శతాబ్దానికి చెందిన మధ్యప్రదేశ్లోని 'సాంచి' వద్ద వున్న వాటిల్లోను, క్రీస్తు తర్వాత 3వ శతాబ్దపు అమరావతి, నాగార్జున కొండ శిల్పాల్లోను కూడ సామాన్యంగా 7 తంతుల హార్పులే కనిపిస్తాయి. చిత్రమేమంటే, మహారాష్ట్ర, ఆంధ్రల్లోను, కొంచెంగా తమిళనాడులోను కనవడ్డ పురావస్తు నిదర్శనాల ప్రకారం హార్పులిక్కడ ఉండేవని తెలుస్తూందిగాని, పక్కనే వున్న కర్ణాటకలో మాత్రం హార్పులున్నట్లుగా పురాతన కాలం నుంచీ కూడ నిదర్శనాలేమీ దొరకలేదు. ఇంకో చక్కటి ఆధారమేమిటంటే నాణాల మీద ముద్రించిన బొమ్మలు. సుప్రసిద్ధ చరిత్రకారుడు ముజుందార్ ఇలా చెప్పాడు. 'సముద్ర గుప్తుడు గొప్ప సేనాధిపతి, మహా మేధావియైన రాజ్యాంగ వేత్త. అదీగాక శాంతియుత మార్గావలంబి కూడాను. అలహాబాద్లో దొరికిన శాసనాల ప్రకారం ఆయన మంచి కవి, గాయకుడు, విద్యాపోషకుడు. ఆయనకు కవిరాజు అని బిరుదుండేది. ఆయన సంగీతాభిమానానికి నిదర్శనంగా ఒక బంగారు నాణెంలో, ఆయన పీఠం వేసుకు కూర్చుని, ఒళ్ళో వీణ వుంచుకుని వాయిస్తున్నట్లుంటుంది,' అని చెప్పాడు. ఇంకొక విషయం, ఈ శిల్పాలన్నీ బౌద్ధ సాంప్రదాయ పరంగా కనిపిస్తాయి. అందువల్ల ఈ శిల్పాలను బౌద్ధమత బోధకులు, వర్తక వ్యాపారులు,

బౌద్ధరాజుల దండయాత్రల్లో ఉత్తరదేశం నుంచి దక్షిణానికి తీసుకుని వచ్చినవా అనిపిస్తుంది. వీటిలో ఎక్కువ బొమ్మలు బోధిసత్వుని జీవిత విశేషాల్ని చిత్రించేవే. జ్ఞానార్జన కోసం గౌతము డర్ధరాత్రి మహారాజ జీవితాన్ని త్యాగం చేసిన దివ్య దృశ్యాలన్నీ, కళాకారులకు, మహా శిల్పులకు కరుణా రసభరిత పరమానంద స్వరూపాలై, మహోత్కృష్టమైన కళాఖండ సృష్టిని ప్రేరేపించాయి. నిదర్శనకు నాగార్జున కొండ శిల్పాలు చాలు. ఈ బొమ్మల్లో గౌతముడు నిష్క్రమిస్తూంటే, నర్తక గాయక బృందమంతా విచార నిమగ్నులై, మూర్ఛితులైనట్లు కనిపిస్తారు. వాళ్ళ వాయిద్యాలైన హార్పులు, మద్దిళ్ళు, ఫణువులు కింద పడి ఉన్నట్లు, వాళ్ళ ఒళ్ళో పడి ఉన్నట్లు కనిపిస్తాయి. ఈ చెప్పిన హార్పులన్నీ విల్లాకారంలో రెసొనేటర్, దండితో కూడిన వాయిద్యాలు. ఇవన్నీ ఇదివరలో చెప్పిన 'పోలికార్డు' తరగతికి చెందినవి.

పెట్టె ఆకారంలో వున్న రెసొనేటర్‌తో వున్నవి, దండి ప్రత్యేకంగా లేకుండా ఉండేవి, ఇంకొక తరగతి పోలికార్డు వాయిద్యాలున్నాయి. వీటికి ఈ పెట్టెమీదే తీగలు బిగిస్తారు. మన దేశంలో ప్రస్తుత కాలంలో 'సంతూర్', 'సంరమండల్' అనే వాయిద్యాలు అలాంటివే.

'సంతూర్' వాయిద్యం కాశ్మీరులో మట్టుకు బాగా ప్రసిద్ధైనది. మన దేశంలో అది మరెక్కడా కనిపించదు. పాశ్చాత్య దేశాల్లో దాన్ని 'డల్సిమర్' అని, 'సింబలోన్' అని అంటారు. కొంతమంది పండితులు దీన్ని వేదంలో చెప్పిన 'వన' వీణ అంటారు. వన వీణ అన్న దానికి 100 తంతు లుండేవని, గడ్డితో పేనిన తంతులని, కర్ర ముక్కలతో



39. సంతూర్

కొట్టి వాయించేవారని ఇదివరలో చెప్పబడింది. తర్వాత కాలంలో దీన్ని 'శతతంత్రి వీణ' అన్నారని, తర్వాత ఆ పేరు 'సంతూర్'గా మారిందని అంటారు. ప్రస్తుతం సంతూర్‌కు

చాల తీగలున్నాయి, దాన్ని కర్రతో కొట్టి వాయిస్తారు. దీని తయారీ మూడు భుజాలు గల కర్రతో చేసిన పెట్టెతో చేసిందని చెప్పాలి. దీని మీద ఒక వరసలో రెండు చొప్పున మొత్తం 30 'పీట' (bridge) లున్నాయి. ఒక్కొక్క వరుసలో రెండు పీటల మీద నాలుగు తంతులు ఒకే స్వరానికి శృతి చేసి ఉంటాయి. ఇలా మొత్తం 60 తంతులు, 15 స్వరాలకు శృతి చేసి ఉంటాయి. వాయించేవాడు పెట్టెను ఎదురుగా వుంచుకొని, చిన్న వంపున్న రెండు కర్రలతో కొట్టి దీన్ని వాయిస్తాడు. కాశ్మీరులో 'పెర్షియన్ మోద్సు' పాటల వంటి 'మకమ్సు' (Maqams) అనే ఒక రకం పాటల్ని దీని మీద వాయిస్తారు. ప్రస్తుతం దీని మీద రాగాల వంటివి కూడ వాయిస్తున్నారని, ఫిలిం పరిశ్రమలో దీన్ని బాగా ఉపయోగిస్తున్నారని తెలుస్తుంది. (చిత్రం : 39)

ఇంకో పెట్టె ఆకారంలో వున్న పోలికార్డు తరగతికి చెందిన వాయిద్యం 'స్వర మండల్' అన్నది. దీన్నే 'ఇండియన్ సాల్టెరీ' (Indian Psaltery) అని కూడ అంటారు. సంతూర్ లాగే ఇది కూడ ఒక పెట్టె ఆకారంలోనే ఉంటుంది. కాని సంతూర్ కంటె ఇది బాగా చిన్నది. దీనిలో పీటలు ఉండవు, కాని దీని తంతులు చిన్న కర్రవలక (ledge) మీదికి బిగింపబడి, అవతల వైపు చిన్న లోహపు ముక్కలకు (tuning pins) బిగిస్తారు. ఇక్కడ ఒక స్వరానికి ఒకే తంతి ఉంటుంది, సంతూర్‌లో వలె నాలుగు తంతులుండవు. వేళ్ళకు 'మీటు' (plectra) పెట్టుకుని, వాయించేవాళ్ళు. దీన్ని మీటి వాయిస్తారు. కొంతమంది గాయకులు ఇది మీటి వాయిస్తూ పాడ్డం కూడ కద్దు. అలా పాడుతూంటే, పాట పక్కని దీనిని మీటు వినడానికి మహ రక్తిగా వుంటుంది. ఇది మన పురాణ గ్రంథాల్లో చెప్పిన 'మత్తకోకిల' అనే వాయిద్యంలా కనిపిస్తుంది, క్రమంగా దీని పేరు మారిందేమో! ఈ వాయిద్యాన్ని మధ్య యుగ సాహిత్య గ్రంథాల్లో, 15వ శతాబ్దం నుంచి చెబుతూన్నట్లు తోస్తుంది. తర్వాత హిందీ కవులు కూడ దీన్ని చెపుతూ వచ్చారు. 'అయినీ అక్బరీ' గ్రంథంలో ఇది చెప్పబడింది. ఈ పోలికార్డు వాయిద్యం పశ్చిమ ఏషియాలో 'కనూన్' అని, సిరియా దేశంలో 'కిథేరా' అని 11వ శతాబ్దం నుంచి వ్యవహరింపబడుతున్నట్లు కనిపిస్తుంది. 'అయినీ అక్బరీ'లో స్వరమండల్ 'కనూన్' వాయిద్యంలా ఉంటుందని, దానికి 21 తంతులున్నాయని, వాటిలో కొన్ని ఇనప తీగలని, కొన్ని ఇత్తడివని, మరికొన్ని 'పేగు దారాలు' అంటే గట్‌లని పేర్కొనబడింది.

చరిత్ర కందని కాలం నుంచీ క్రీస్తు తర్వాత సుమారు 10వ శతాబ్దం వరకు, మనకు తెలిసి సుమారు 3000 సంవత్సరాలపాటు, ఏకచ్ఛత్రాధిపత్యంగా మన సంగీత లోకంలో ఎంతో కీర్తి ప్రతిష్ఠలతో పాటించిన ఈ హార్పులనే పోలికార్డు వాయిద్యాలు, వాటి నిర్మాణం, వాయించే విధానాలు ఎంతో శాస్త్రీయ పద్ధతితో, నైపుణ్యంతో నడుస్తూన్న సమయంలో హఠాత్తుగా ఇవన్నీ సంగీత లోకాన్నుంచి మాయమైపోయాయి. జ్ఞాపకార్థం ఈ సంతూర్, స్వరమండల్ వాయిద్యాలు మాత్రం మిగిలిపోయాయి. 10వ శతాబ్దం నుంచి తంతిని మీటి వాయించి, పక్కనే ఒక చెక్కమీద (finger board) స్వర

స్థానాల నేర్పాటు చేసుకున్న 'మోనోకార్డు' వాయిద్యాలు అంటే కచ్ఛపి, సితార్, సరోద్, సరస్వతి వీణ మొదలైన 'లూట్' వాయిద్యాలు, కిన్నరి, రుద్ర వీణ మొదలైన 'జిథర్' వాయిద్యాలు సంగీత లోకంలో ప్రవేశించి ఈ నాటి వరకు స్థిరపడి పోయాయి. ఈవిధమైన మహా విప్లవం మన వాయిద్యాల మీద, మన సంగీత విధానం మీద ఎంతో ప్రభావాన్ని కనబరుస్తూంది. ఇది అనేక విధాలుగా తెలుసుకోవలసిన విషయమే గాని దాన్నిక్కడ ప్రస్తావించడం ఈ పుస్తక పరిమితి నతిక్రమించడం అవుతుంది.

సంగీత గ్రంథాల్ని, ఇతర సాహిత్యాన్ని తిరగేస్తే మళ్ళీ పూర్వం చెప్పిన లోపాలే ఎదురవుతాయి. నిదర్శనం లేని సమాచారం, ఆధారం లేని అభిప్రాయాలు, అసంపూర్ణమైన వర్ణనలు మొదలైన సమస్యలే మనకి కనబడేవి. అలాంటి సందర్భంలో ఒకళ్ళు చేయగలిగేది, విడివిపెట్టిన విషయాల్ని కొంతవరకు ఒక దానితో నొకటి సమన్వయం చేయడం; సందర్భోచితంగా, వాయిద్యాల పూర్వాపర చరిత్రను గ్రహించి, ముఖ్య ఘట్టాల్ని సూచించడం మాత్రం చెయ్యగలం. అవనద్ధ, తత వాయిద్యాల విషయంలో ఈ పని చెయ్యడం మరీ కష్టతరమైంది. విషయాన్నంతా కలగాపులగం చేసి, విడతీసి చెప్పక పోవడం, ఒకే వాయిద్యానికి వేరు వేరు పేర్లు చెప్పడం, చెప్పిన పేరు సమగ్రంగా లేకపోవడం మొదలైనవన్నీ అవరోధాలుగా తయారయ్యేయి. 'ఏక తంత్రి', 'నకులి', 'త్రితంత్రి' అని వీణల్ని ఒక తంతి, రెండు తంతులు, మూడు తంతులని మూడు రకాలుగా చెప్పేరు. అవి హార్పు రకాలా, జిథర్ రకాలా, లూట్ రకాలా అని వివరాలు లేవు. ఇంగ్లీషు తర్జుమాలో గూడ ఈ వివరాలేమీ తెలిసిరావటం లేదు. అందుచేత చాలా జాగ్రత్తగా, పరిశీలనా దృష్టితో అర్థం చేసుకోవలసిన అగత్య మేర్పడింది.

జిథర్ వాయిద్యాలంటే స్వర స్థానాల్ని వాయించడానికి ఒక చెక్క అంటే దండి ఏర్పాటుండి, మెట్లున్నవి గాని అయి ఉండవచ్చు. వీటిలో ముఖ్య విషయం, ధ్వని విస్తారం కోసం ఏర్పడ్డ బుర్ర, దండికి కింది భాగంలో కట్టబడి ఉంటుంది ఈ వాయిద్యాలకి ప్రాథమిక దశ, ధ్వని విస్తారం కోసం బుర్రగాని, మెట్ల ఏర్పాటుగాని లేకపోయినా, జింటాంగ్ వాయిద్యం, దాని తరగతిలో చెప్పిన ఇతర వాయిద్యాలై ఉంటాయని చెప్పవచ్చు. ఈ జింటాంగ్ ప్రథమంలో వెదురుతో చేసినదైనా ఇతరమైన సమగ్ర జిథర్ వాయిద్యాల నిర్మాణానికి దారి తీసిందని చెప్పాలి. వాయిద్య నిర్మాణ ప్రథమావస్థలు, తర్వాత వాటి సమగ్ర రూపాల్ని చర్చించడం ఇక్కడ వీలుపడదు. దానికి ఇతర సాంకేతిక సమాచారం కావలసివస్తుంది. ఈ పుస్తకంలో దాన్నంతా వివరించడం కష్టం.

ఒరిస్సాలోని 'తుయిలా' వాయిద్యం, జిథర్ రకాల్లో అతి సామాన్య నిర్మాణం గల వాయిద్యం. దీన్ని వాయించేవాళ్ళు అక్కడ కూడా తక్కువైపోయారు. దీని ముఖ్య భాగం ఒక వెదురు కర్ర. ఆ కర్రమీద ఒక 'గట్' దారం బిగించి ఉంటుంది. ఇక్కడ గట్‌ని కొసని బిగించడానికి ఒక పీటగాని, కర్ర చెక్క గాని, పూటీ గాని ఏమీ లేవు. వెదురు కర్ర కింద

సగానికి కోసిన ఒక అనపకాయ బుర్ర అతకబడి ఉంటుంది. వాయించేవాళ్ళు దీని బుర్రని వక్షస్థలం మీద అయిమూలగా పెట్టుకుని, దారాన్ని కింద భాగంలో మీటి మరో చేత్తో ఆపుతూ స్వర స్థానాన్ని వాయిస్తారు. ఇలా వాయించేటపుడు 7 స్వర స్థానాలకి 3 వేళ్ళు మాత్రం ఉపయోగిస్తారు. (చిత్రం : 40)



40. తుయిల

ఇప్పుడున్న వర్ణనలను బట్టి, ఈ తుయిలా వాయిద్యం పురాణ కాలంలో చెప్పిన 'ఆలాపిని వీణ' వలె వుండవచ్చని అనుకోగలం. ఆలాపిని వీణ అన్నది పురాణ గ్రంథాల్లో తొమ్మిది ముష్టిలు (ముష్టి=గుప్పిట=fist length) పొడుగైన దండి గలదని, 20 సెంటీమీటర్లు చుట్టుకొలత గల ఆనపకాయ బుర్ర ఉన్నదని, ఒక తంతిగాని మూడు తంతులు గాని ఉండవచ్చని చెప్పబడింది. తంతుల కొరకు గట్‌గాని, నూలు దారం గాని, సిల్కు దారం గాని ఉండవచ్చని చెప్పారు.

'ఏకతార', 'ఏక్ తంత్రి', రెండు ఒకే మాదిరి పేర్లుగాని వాయిద్యాలు వేరైనవి. మధ్య యుగానికి కొంచెం ముందు నుంచి అంటే 11వ శతాబ్దం నుంచి 'ఏక్ తంత్రి' అనే పేరుతో ఇది చెప్పబడింది గాని భరతుని కాలంలోని 'ఘోషక' వాయిద్యమిదే అయి ఉండవచ్చు. దీన్నే 'బ్రహ్మవీణ' అని, సరస్వతిదేవి దీనిలో వెలిసిందని గ్రంథాలు వర్ణించేయి. దీని దండి సుమారు 140 సెంటీమీటర్ల పొడవుండి, ఒక ఆనపకాయ బుర్ర ఈ దండి కింద అతకబడింది. ఒక వెడల్పైన పీట ఉండి, దాని మీదనుంచి ఒక గట్ దారం కిందికి కట్టబడి ఉంది. తుయిలా, ఆలాపిని వీణల వలెనే దీన్ని కూడ వక్షస్థలం మీద పెట్టుకుని ఒక చేత్తో మీటుతూ, ఇంకో చేత్తో 'క్రమిక' అనే గుండ్రటి వెదురు కర్రముక్కతో, కిందికి పైకి కదుపుతూ స్వరాలు రాగం కూడ వాయించవచ్చు. అయితే దీని పీట మీద గట్ కింద ఒక చిన్న సన్నని వెదురు పేడుని 'జీవం' కోసం ఉంచుతారు. దానితో మీటే ధ్వని ఎక్కువవుతుంది. సంగీత గ్రంథాల్లో దీన్ని వాయించే విధానాలు అంటే కుడి చేత్తో మీటడం ఎలాగో, ఎడం చేత్తో క్రమిక తంతి మీద ఎలా కదిపి వాయించాలో ప్రత్యేకంగా ఎన్నో వివరాలతో వ్రాశారు. ఇక్కడ మనం గుర్తించవలసిన విషయాలున్నాయి. వాయిద్యాన్ని వక్షస్థలం మీద పెట్టుకుని అంటే నిలబెట్టి వాయించడం ఒకటి. ఈ రోజుల్లో

రుద్రవీణ, సరస్వతీ వీణను కూడ నిలబెట్టి వాయించే అలవాటును కొంతమంది దగ్గిర చూస్తున్నాం. తంతి కింద జీవం పెట్టి, నాదాన్ని ఇనుమడింపచేసి వాయించడం రెండవ విషయం. తంబూర వాయిద్యంలోని విశేషం ముఖ్యంగా ఈ జీవమే, అది ఈ నాడు కూడ అనుసరిస్తున్న విధానమే. మూడవది 'క్రమిక' ఉపయోగించడం. ఉత్తర భారత దేశంలో విచిత్ర వీణకి, దక్షిణాదిని గోటు వాయిద్యానికి కూడ క్రమిక ఉపయోగిస్తున్నారు.

హిందూస్థాని సంగీతంలో ఉపయోగించే విచిత్రవీణ ఒక మెట్లు లేని జిథర్ వాయిద్యం. దీని ఫింగర్ బోర్డు అంటే స్వరస్థానాలు వాయించే చెక్క, 125 సెంటీమీటర్ల పొడుగుండి, కింద రెండు ఆనపకాయ బుర్రలు రెండు కొసల్ని అతకబడి ఉంటాయి. ఒక వెదల్పయిన పీట దండికి ఒక కొసని ఉంటుంది. ఇంకొక కొసని చెక్కలో (ledge)నాలుగు పూటీలు (pegs) ఉండి, వాయించడానికి ముఖ్యమైన నాలుగు తంతుల్ని పీట మీద పుంచి దండి కొసనున్న పూటీల్లో బిగిస్తారు. ఇవిగాక 'చికరీ' అనే (chikari) రెండు తంతులు ఆధార శృతిని సూచించడం కోసం బిగిస్తారు. పైన చెప్పిన ముఖ్య తంతులు నాలుగింటిని గూడ కాబవం (plectra) అంటే తీగతో తయారుచేసి వేలుకు తగిలించుకునే నఖం వంటి దాన్ని పెట్టుకుని మీటుతూ వాయిస్తారు. పాట గాని వాయించడం కోసం ఇక్కడ ఎడం చేతిలో 'క్రమిక' బదులుగా ఒక గాజు బంతి (glass ball) ఉపయోగించి, తీగలమీద కదుపుతూ వాయిస్తారు. ముఖ్య తంతుల కింద 'తరాబ్' అనే 12 సన్న తీగల్ని, అమర్చి బిగిస్తారు. వాయిస్తూంటే ఈ తరాబ్ తీగలు



41. విచిత్ర వీణ

అనుకంపనతో (sympathetic vibration) కంపించి, నాద గుణం బాగా శ్రావ్యతని (resonate) పుంజుకుంటుంది. దీని నిర్మాణాన్ని బట్టి, వాయించే విధానాన్ని బట్టి, ఇది 'ఏక్ తంత్రి' వాయిద్య కుటుంబంలోనిదేనని బాగా స్పష్టంగా తెలుస్తుంది. విచిత్ర వీణ అనే దీని పేరు సుమారు ఒక శతాబ్దం నుంచి అమల్లో ఉందని తెలుస్తూంది. అయినీ అక్బరీ గ్రంథంలో 'సార్ వీణ' అనే వాయిద్యాన్ని ముఖ్యమైన వాయిద్యాల్లో ఒకటిగా చెప్పారు. బహుశః ఈ విచిత్ర వీణ, సార్ వీణ ఒకటే అయి ఉండవచ్చు. (చిత్రం : 41)

ఈ విచిత్ర వీణ మొదలైన రకాలకి మెట్లున్న జిథర్ వీణలు అంటే కిన్నరి, రుద్రవీణ మొదలైన వాయిద్యాలు తయారయ్యేయి. ఇందులో కిన్నరి మధ్య యుగంలో చాలా ప్రసిద్ధంగా వుండేది. రుద్రవీణ కొద్ది కాలం క్రితం వరకు హిందూస్థానీ సంగీత కచ్చేరీల్లో సుప్రసిద్ధంగా వుండేది. ఈ మెట్టున్న జిథర్ వాయిద్యాలకి ప్రథమ దశలో వుండే వాయిద్యాల్లో, సవర జాతి వారుపయోగించిన 'మెమెరాజన్' వాయిద్యాన్ని చెప్పవచ్చు. వెర్రియర్ ఎల్విన్ దొర దాన్ని విధంగా వర్ణించేరు. 'గిటార్‌ని పోలిన ఇంకో వాయిద్యం మెమెరాజన్ అనే వాయిద్యం. దీన్ని వక్షస్థలం మీద పెట్టుకుని (breast instrument) వాయించేదని చెప్పాలి. ఒక 'వెదురు మెడ' ఉండి, నాలుగైదు మెట్లు దాని మీద మైనంతో బిగిస్తారు. రెండు ఇనప తీగలు దీనిమీద బిగిస్తారు. ఇందులో ఒకటి ఆధార శృతిని అందిస్తుంది. ఇంకో తీగ మీద వాయిస్తారు. దీని కిందుగా, రెండు చిన్న ఆనపకాయ బుర్రలు, కింద భాగం కొంచెం కోసి వున్న వాటిని అమరుస్తారు. మెమెరాజన్ బుర్రల్ని వక్షస్థలం మీద పెట్టుకుని వాయిస్తూ, వాటిని అదుముతూ, వదులు చేస్తూ వాయిస్తారు. ఇలా చెయ్యడం వల్ల వాయించే ధ్వని తక్కువగాను, కొంచెం హెచ్చుగాను వినిపిస్తూంటుంది. కుడి చేత్తో మీటుతూ, ఎడం చేత్తో మెట్ల మీద వేళ్ళతో వాయిస్తారు. (ఇక్కడ ఎల్విన్ దొరగారు చెప్పింది తప్పుగా కనిపిస్తుంది. మెమెరాజన్ జిథర్ రక ల వాయిద్యం. గిటార్ లూట్ రకాలకి చెందినది. అందుచేత ఈ వర్ణన తప్పు. ఈ వాయిద్యానికి 'నెక్' అని వర్ణించేరు. ఇందులో 'నెక్' అసలు లేనేలేదు. ఇది రెండో తప్పు.) ఈ మెమెరాజన్ వంటి ప్రాథమిక దశలోని వాయిద్యాలే, రాజాస్థానంలోని 'భోపా' కులంవారు వాయించే 'జంతర్' అనే వాయిద్యం; కాశ్మీర్‌లోని 'ఖింగ్' అనే వాయిద్యాలను చెప్పవచ్చు. దీనిలో జంతర్ వాయిద్యం కొంచెం పెద్దదిగా వుండే జిథర్ రకం, రెండు పెద్ద బుర్రలతో వుంటుంది. దీని మీద ఎముకలతో చేసిన 14 మెట్లుంటాయి. కాశ్మీర్‌లోని 'ఖింగ్' వాయిద్యం ఇంకా చిన్నది; దాని మీద 7 మెట్లుంటాయి.

మీటి వాయించే పురాతన జాథర్ రకాల వాయిద్యాల్లో కిన్నరి చాలా ముఖ్యమైంది. దాన్నిప్పుడు శాస్త్రీయ సంగీత కచ్చేరీల్లో ఉపయోగించడం లేదు గాని మన రాష్ట్రంలో చెంచు, రాజగోండులనే గిరిజనుల్లో అక్కడక్కడ కనిపిస్తుంది. ఈ కిన్నరి వాయిద్యం 'బృహత్కిన్నరే కావచ్చు. ఈ గొండు జాతి వారిలో 'పహండికూప లింగాల్' అనే భక్తుడు

దేవుళ్ళను వెతుక్కుంటూ వెళ్ళిన ఇతిహాస మొకటుంది. 'అతను కీకారణ్యంలో ఒక సన్నని మార్గంలో పోగాపోగా ఒక చోట ఒక మర్రి చెట్టును చూసి దాని నీడలో కూర్చున్నాడట. తిర్గి తిరిగి అలిసిపోయిన వానికి ఆ నీడ ఎంతో హాయిగా వుంటే, ఆ సంతోషంలో వాడు తన కిన్నరి తీసి వాయించడం మొదలుపెట్టి, తనకి తెలిసిన 18 పాటల్ని వాయిస్తూ కూర్చున్నాడట. కొంచెంసేపట్లో కొంత అలికిడి వినిపించి, తన కెదురుగా వున్న తాడి చెట్టు బాగా ఊగిపోతూ కనిపించిందట. ఇంతలో గొండు దేవతలు 'సుర్పుర్యాదిగుహ'లో కదిలి మాట్లాడుకోవడం వినిపించిందట. ఆ దేవుళ్ళు వాళ్ళలో వాళ్ళు ఇలా మాట్లాడుకుంటున్నారట. 'విను, విను! ఎంత మంచి పాటలు వినిపిస్తున్నాయో! ఆ వాయించేది మన పూజారి కటోర అయి ఉండాలి' అని. ఇది మన లింగాల్ విని, అంతులేని సంతోషంతో తన దేవుళ్ళని కనుగొన్నాని ఉప్పొంగిపోయడట. కర్ణాటకలో జోగులని ఒక తెగ భక్తులున్నారు. వీళ్ళు మన భారతంలో అర్జునుడు అజ్ఞాత వేషంలో బ్రహ్మచర్యం పాటిస్తూ, నియమ నిష్టలతో దేశాటనం చేసినట్లుగా, తాము కూడ ఆ సాంప్రదాయంలో అలా దేశ పర్యటన చేసేవారమని చెప్పుకుంటారు. వీళ్ళు కిన్నరి వాయిద్యం అనుసరణగా పాటలు పాడుకుంటూ పర్యటన చేస్తూంటారు కిన్నరి మధ్యయుగంలో బాగా ప్రసిద్ధమయిన వాయిద్యమని చాల గ్రంథాల్లో చెప్పడమే కాకుండా, మధ్యయుగ శిల్పాల్లో ఇది విరివిగా కనిపిస్తుంది. అయిదవ శతాబ్దానికి చెందిన మతంగుని బృహద్దేశి అనే గ్రంథంలో కిన్నరి వీణకి మెట్లిలా అమర్చాలో మొదటిసారిగా వర్ణించేడు. 11వ శతాబ్దం నుంచీ కిన్నరి వర్ణనలు గ్రంథాల్లో బాగా కనిపిస్తాయి. దీనిలో చిన్న పెద్ద రకాలు 'లఘు కిన్నరి', 'బృహత్కిన్నరి' అని రెండుగా చెప్పారు. ఇవి శాస్త్రీయ సంగీతానికి పనికివచ్చే రకాలు. 'దేశి' రకాలవి, 'బృహతి', 'మధ్యమ', 'లఘ్వి' అని మూడుగా చెప్పేరు. శాస్త్రీయ సంగీతానికి పనికివచ్చే లఘు కిన్నరికి, 75 సెంటీమీటర్ల వెదురు దండి (finger board), కింద రెండు ఆనపకాయ బుర్రలుండి, రాబందుల పక్క ఎముకలతో చేసిన 14 మెట్లున్నట్లు చెప్పేరు. ఈ మెట్లను దండి మీద కాల్చిన గుడ్డ బూడిద, మైనంతోను చేసిన ముద్దతో బిగించేవారని చెప్పేరు. ఈ మెట్ల మీద ఇనప తీగకాని, ఇత్తడి తీగకాని దండి చివర పూటీకి బిగించేవారని చెప్పేరు. బృహత్కిన్నరి యొక్క పొడవు ఇంకా 20 సెంటీమీటర్లు ఎక్కువగా వుంటుందని, బాగా లావైన వెదురు దండి ఉంటుందని చెప్పారు. దానికి 3 ఆనపకాయ బుర్రలుండేవట. దాని మీద గట్ బిగించేవారట. అబుల్‌ఫజల్ తన అయినీ అక్బరీ గ్రంథంలో 'జంతర్'కు (Yantra), కిన్నరికి, వీణకి ఉండే సంబంధాలు వివరంగా చెప్పేడు. 'గుల్లగా వుండే, గజం పొడవు గల, కర్ర 'మెద'లో చేసిన 'యంత్ర' వాయిద్యానికి రెండు కొసల్ని రెండు సగం కోసిన, ఆనపకాయ బుర్రలు దండికి కింద అతకబడి ఉంటాయి. మెద అంటే దండిమీద 16 మెట్లు బిగింపబడి ఉంటాయి. ఈ మెట్లమీద 5 ఇనప తీగలు రెండు వైపులా బిగించినవి ఉంటాయి.

మెట్లను బిగించడం వల్ల వాయించేటపుడు స్వరాల్లో హెచ్చు తగ్గు లేర్పడుతున్నాయి. 'వీణ' యంత్ర వాయిద్యం లాగే ఉంటుంది. కాని దానికి మూడు తీగలుంటాయి. 'కిన్నర్' వీణను పోలి ఉంటుంది కాని దాని దండి పొడుగైంది, 3 అనపకాయ బుర్రలు, 2 తాగలు ఉంటాయి' అని చెప్పేరు. (చిత్రం : 42)



42. అటవికుల కిన్నరి

తర్వాత వచ్చిన జిథర్ రకాల వీణలన్నీ కూడా ఈ కిన్నరి యొక్క 'సంతాన'మనే అనాలి. వీటిలో బాగా ప్రసిద్ధిగా శాస్త్రీయ సంగీతంలోను, సామాన్య జనాదరణలోను హిందూస్థానీ సంగీతానికి మకుటాయమానంగా విరాజిల్లిన ముఖ్య వాయిద్యం 'రుద్రవీణ' అన్నది. సామాన్య ప్రజలు దీన్ని 'బీన్' అనివ్యవహరించేవారు. కిన్నరిలో లాగే దీని దండి బాగా లావుపాటి నునుపైన వెదురు కర్రతో చేసినది. దండి కింద బుర్రలుంటాయి. ఒక కొసని చదునైన పీట ఉంటుంది. రాగం వాయించడానికి ముఖ్య తంతులు నాలుగుంటాయి. దండి మీద సన్నని మెట్లు మైనంతో బిగించి ఉంటాయి. కుడి చేత్తో తీగలను మీటుతూ ఎడం చేత్తో మెట్లమీద స్వరాల్ని, రాగాన్ని వాయిస్తారు. ముఖ్య తంతులు 4 కాక, దండిమీద మరో రెండు తంతులు శృతి, తాళం చూపడానికి అనువుగాను, ఇంకొక పక్కకి ఇంకో తంతి కూడ బిగించి ఉంటాయి. ఈ బీన్ వాయిద్యం రాజదర్బార్ లోనే కాక సామాన్య జనుల్లో కూడా స్త్రీ పురుషులు వాయిస్తూండేవారని తెలుస్తూంది. ఉత్తరాన అసంఖ్యాకాలైన కళా చిత్రాల్లో దీన్ని చూడవచ్చు. అలాంటి కళా చిత్రాల్లో 'రాగమాల' అనే పేరుతో చిత్రించిన రాగ రాగిణుల బొమ్మలు ఒక రకం సంగీత సాహిత్యాల్లో వర్ణించిన రాగాల స్వరూపాల్నే ఈ బొమ్మల్లో చిత్రించారు. వీటిలో కొన్ని పురుష రాగాల బొమ్మలు, కొన్ని స్త్రీ రాగాలవి. 'రాగిణి తోడి'కి ఎప్పుడూ నీడలాగ అనుసరించేది బీన్ వాయిద్యం. ఈ బీన్ వాయిద్యం లేళ్ళనెంతగానో ఆకర్షించి సమ్మోహ పరుస్తుందట. 'తోడి రాగిణి మల్లెపూవులాగ తెల్లగా వుండి, ఒళ్ళంతా పసుపు, కర్పూరం పూసుకుని, తన బీన్ వాయిద్యం వాయిస్తూ కనబడేసరికి అడవిలోని లేళ్ళన్నీ నిశ్చేష్టితాలవుతాయట.' మహాకవి సూరదాస్ ఈ విషయాన్నింకా రక్తిగా వర్ణించేడు. తను వ్రాసిన పద్యాల్లో నాయకుణ్ణి ఉద్దేశించి ఇలా చెపుతాడాయన. 'అతి మనోహరమైన నీ వీణ వాయించేవు కనుక! ఏమీ వద్దు. ఏమంటే, ఆ వీణానాదం విని చంద్రుని రథంలాగే

లేళ్ళు సమ్మోహితాలై అలా ఆగిపోతాయి. దాంతో చంద్ర గమనం స్తంభించి పోతుంది!' అని అంటాడు. అక్బర్ చక్రవర్తి దర్బార్లో బీన్ చాల ముఖ్యమైన వాయిద్యాల్లో ఒకటి. అబుల్ ఫజల్ తన గ్రంథంలో గ్వాలియరుకు చెందిన షాహిబ్ ఖాన్, పూర్బిన్ ఖాన్‌లను ఆస్థాన 'బీన్‌కార్ల'ని (బీన్ వాయించేవారు) పేర్కొన్నారు ఇలాగే ఆ రోజుల్లో అతి ప్రసిద్ధులైన వాయిద్యకార్లలో, తాన్‌సేన్ కొడుకులైన బిలాస్ ఖాన్, సూరత్‌సూన్‌లను, తాన్‌సేనుని అల్లుడైన మిశ్రి సింగుని చెప్పాలి. వీరిలో ముఖ్యంగా బిలాస్ ఖాన్ 'రబాబ్' వాయిద్యాన్ని వాయిస్తూ, దాన్ని బాగా ప్రజాదరణలోకి తెచ్చిన మంచి ప్రఖుద్ధుడని చెబుతారు. సూరత్‌సూన్, మిశ్రి సింగు లిద్దరూ రుద్రవీణ బాగా ప్రసిద్ధంగా వాయించేవారని చెపుతారు. వంశపారంపర్యంగా వీరందరూ సంగీత విద్వాంసుల కుటుంబానికి చెందిన వారు గనుక ఆ రోజుల్లో ప్రజలు వారిని 'సేనియా'లని గొప్పగా చెప్పుకునేవారని తెలుస్తోంది. అది చూసి హిందూస్థానీ వాయిద్యకారులందరూ తాము 'సేనియాల'మని ఈ రోజుల్లో కూడా చెప్పుకుంటున్నారు. ఇది చాల హాస్యాస్పదమైన విషయం. ఆ రోజుల్లో వాళ్ళ వాయిద్యాలు గాని, వాళ్ళ వాయిద్య రీతులు గాని (styles of play) వీళ్ళ దగ్గరేమున్నాయి? ఇప్పుడు బాగా ప్రసిద్ధాలైన సితార్, సరోద్, సారంగి మొదలైన వాయిద్యాలు, వాటిని వాయించే పద్ధతులు, విధానాలు అన్నీ మారిపోయి ఆ రోజుల్లోని పద్ధతులకి, ఇప్పటి విధానాలకి ఏమీ సంబంధం లేకుండా పోయింది. ఇప్పటి 'సితారియా' (సితార్ వాయించేవారు)లను వింటే ఈ విషయం బాగా తెలుస్తుంది. గురుశిష్య పరంపరలో ఏమైనా సంబంధం వుండవచ్చుగాని, ఆ రోజుల్లోని పద్ధతులన్నీ ఇప్పుడు లేవు. ఇప్పటి వాయిద్యకారులు మేమంతా 'సేనియాలమే' అని చెప్పుకోవడం ఏమంత సమంజసంగా వుంటుంది? ఈ రోజుల్లో రుద్రవీణ 'ముఖం' చూసేవారెవ్వరూ లేరు. అది వాయించే సమర్థులెవ్వరూ కనిపించడం లేదు. (43, పుస్తకంలోని మొదటి చిత్రం.)

ఈ జిథర్ రకాల వాయిద్యాల్లో, మెట్లు లేని ఏకతంత్రి, ఆలాపిని, విచిత్ర వీణ మొదలైన వాయిద్యాలు, మెట్లున్న కిన్నరి, బీన్ మొదలైన వాయిద్యాలు అన్నీ కూడా మన దేశపు వాయిద్యాలు అంటే వాటి లక్షణాలని బట్టి అవి మన ప్రజల్లో పుట్టి పెరిగిన వాయిద్యాలుగా, అచ్చు ముద్ర వేసినట్లుగా స్పష్టంగా కనిపిస్తాయి. ఇంకా శిల్పాల్లోని జిథర్ వాయిద్యాల చిత్రాలన్నీ కూడా మన హైందవ దేవాలయాల మీద కనిపించేవే. మళ్ళీ లూట్ వాయిద్యాల్ని గురించి ఇంత నిశ్చయంగా, ఘంటాపథంగా చెప్పలేం. లూట్ వాయిద్యాలు గాంధార శిల్పకళాఖండాల్లోను (Gandharian Art movements), వాటి వ్యాప్తితోపాటుగా కనిపిస్తూ, బౌద్ధుల శిల్పాలతో కూడ వ్యాపిస్తూ వాయవ్య మూలనుంచి ఆరంభించి దక్షిణానికి క్రమంగా దిగినట్లుగా మనకు కనిపిస్తుంది. ఏమైనా ఇవి కొన్ని ఇతరమైన ప్రదేశాల్లో కూడ కనిపిస్తున్నాయి గనుక ఈ విషయాన్నింకా పరిశీలించ వలసివుంది.

లూట్ వాయిద్యాలంటే ఇదివరలో చెప్పినట్లు, బుర్ర (resonator) దండితో (fingerboard) కలిసిపోయినట్లుగా అంటే బుర్రని పొడిగిస్తే దండిగా మారినట్లు కనిపించే వాయిద్యాల్లో బుర్ర దండికింద అతకబడి ఉంటాయి. ఏక్‌తార వాయిద్యాన్ని ప్రస్తావించినపుడు ఏక్‌తార వాయిద్యం, జిథర్ రకాల వాయిద్యాలకి ప్రథమ స్వరూపమని, ఆ తర్వాత ఏక్‌తారలోని ఆనపకాయ బుర్రకి బదులు క్రమంగా కర్రతో చేసిన బుర్రలు ఉపయోగంలోకి వచ్చాయని తెలుసుకున్నాం. ఈ క్రమమైన మార్పుకి ఉదాహరణగా మన రెండు రకాల తంబురాల్ని చెప్పుకోవచ్చు. అయితే తంబురాలు కేవలం ఆధార శృతిని సూచింపడాని కేర్పడ్డ వాయిద్యాలు గాని సంగీతం వాయించడానికి పనికిరావు. లూట్ వాయిద్యాల్లో పొడుగు మెడ గలవి, పొట్టి మెడ గలవి అని రెండు రకాలున్నాయి. గాని ఈ పొడుగు, పొట్టి విశేషణాలు మెడకి సంబంధించినవి కావు. ఇవి దండికి సంబంధించినవి. వీటిలో మెడ అంటే బుర్రకి ఒక వైపు వున్న సన్నని మెడ వంటి ఆకారం గల భాగమన్న మాట. ఈ మెడ నుంచి వ్యాపించిన దండి కొన్నింటిలో పొడుగ్గాను, కొన్నింటిలో పొట్టిగాను ఉన్నందువల్ల మెడను పొడగు మెడ, పొట్టి మెడ అనడం ఉచితంగాదు. కాని గ్రంథాల్లో వీటిని పొడుగు మెడ, పొట్టి మెడలతో వున్నవని వర్ణించారు. పోనీ అలాగే మనమూ చెప్పుకున్నా పెద్ద తప్పేమీ కాదు.

మెట్లు లేని పొట్టి మెడ గల లూట్ వాయిద్యాలు కూడా బాగా మనకి పురాతనమైనవే. కచ్ఛపి వీణ ఈ రకమే. దీన్ని మొదటిసారిగా భరతుని నాట్యశాస్త్రంలోను, మధ్యయుగపు గ్రంథాల్లోను వర్ణించడమే గాక అనేక చిత్రాల్లో చిత్రించారు. కచ్ఛపి అంటే తాబేలన్న మాట. తాబేటి చిప్పలాగ ఈ వాయిద్యం మధ్య ఎత్తుగా వుండి, పక్కలకి వంపులో (convex) వున్న లూట్ రకం వాయిద్యమన్న మాట. లోపల గుల్లగా వుండే పొట్టని (belly) చర్మంతో కప్పుతారు. ఈ పొట్టనుంచే వ్యాపించి మెడ, పొట్టి దండి అమర్చబడి ఉంటాయి. ఈ పొట్టని కప్పే చర్మం మీద అర్థచంద్రాకారంలో ఒక పీటని నిలబెట్టి, ఈ పీట మీదనుంచి 5 తీగల్ని దండి చివరవున్న పూటీల్లో బిగిస్తారు. ఇది మెట్లు లేకుండా మీటి వాయించే వాయిద్యం. అయినా ఇది అక్కడక్కడా మెట్లతో వున్నది కూడా అంటే అజంతా చిత్రాల్లోను, కర్ణాటకలోని 5 మొదలు 7వ శతాబ్దానికి చెందిన 'పట్టడకల్లు' చిత్రాల్లోను కనిపిస్తోంది. ఈ రోజుల్లో కూడిలాటి వాయిద్యాన్ని ఉత్తర భారతదేశంలో చూస్తున్నాం కాని వాటి పేరు మాత్రం 'దోతారా' అని, 'రుబైయా' అని వినిపిస్తున్నాయి. వాటిలో కొద్దిపాటి వివరాలు కొంచెం వ్యత్యాసంగా కనిపిస్తాయి.

రబాబ్ వాయిద్యం ఈ కచ్ఛపి వీణకి 'బంధువై' వుండవచ్చు లేదా 'సంతానమే' కావచ్చు. ఇది మన పశ్చిమోత్తర దేశంలో తప్ప మరెక్కడా కనిపించదు. రబాబ్ అనే మాట వల్ల ఇది విల్లుతో వాయించేది గాని, మీటి వాయించేది గాని, లూట్ రకం వాయిద్యమని తెలుస్తోంది. చాల మంది పండితుల అభిప్రాయంలో ఇది అరేబియా దేశంలో ప్రసిద్ధిన విల్లుతో వాయించే రబాబ్ వాయిద్యం, మన దేశపు రబాబ్ ఒకటేనని

అంటున్నారు. 10వ శతాబ్దానికి చెందిన అరేబియాలోని 'అల్‌ఫరాబి', దీన్ని విల్లుతో వాయించే రబాబ్ వాయిద్యమని చెప్పినట్లు తెలుస్తూంది. కాని ఇదే రబాబ్ వాయిద్యం మన కాశ్మీరులోను, ఆఫ్ఘనిస్థానంలోను ఇంకా మన ఉత్తర భారతదేశంలోను మీటి వాయించే వాయిద్యంగా సుమారు 500 సంవత్సరాల క్రితం నుంచి బాగా పరిచయమైన వాయిద్యమని తెలుస్తూంది. కబీర్, కృష్ణదాస్ మొదలైన మహాకవులు దీన్ని పేర్కొన్నారు. అయినీ అక్బరీ గ్రంథంలో దీన్ని 6 తంతులు గల వాయిద్యంగా, ఇంకా కొన్నింటికి 12 తంతులు, 18 తంతులున్నట్లు వర్ణించారు. 17వ శతాబ్దపు సంగీత పారిజాత గ్రంథంలో దీన్ని పేర్కొని, రబాబ్ అన్న పేరు సంస్కృతంలోని 'రవ' (sound) నుంచి వచ్చిందని చెప్పారు. ప్రజాబాహుళ్యంలో ఇది తాన్‌సేన్ సృష్టించిన వాయిద్యమని ప్రతీతి ఉంది గాని, అది వట్టి మాట, ఏమంటే తాన్‌సేన్ కంటె ముందే ఇది హిందీ సాహిత్యంలో కనిపిస్తోంది. కాని ఈ వాయిద్యానికి సరియైన నకలు, 15వ శతాబ్దపు 'గురు నానక్'కు అనుంగు చెలికాడు, ఆప్తమిత్రుడు అయిన 'మర్దనుడు' వాయించిన రబాబ్ వాయిద్యం. భాయి మర్దన, అరేబియా నుంచి వచ్చిన వారి పారంపర్యంలోని వాడని, అతని రబాబ్ వాయిద్య నైపుణ్యం అపారమని అనేక గాథలున్నాయి. అతను వాయించే రబాబ్ వాయిద్యాన్ని మార్చి కొత్త రకంగా ఎంతో ఉత్తమంగా గురు నానకే తయారు చేశారని తెలుస్తూంది. 19వ శతాబ్దానికి చెందిన సాదిక్ అలి ఖాన్ ఇలా చెపుతాడు. 'రబాబ్‌కు 5 ముఖ్య తంతులుండి, కిందగా 22 తంతులు ధ్వని విస్తారం కోసం అమర్చబడి ఉన్నాయి. 6 తంతులున్నది కూడ ఉన్నట్లు తెలుస్తూంది కాని దాని తంతులు 'సిల్కు తంతులు' గాని గట్ తంతులు కావు. కొంతమంది తెలిసిన వారు ఈ రబాబ్ వాయిద్యాని గురు నానక్ షా ఫకీరే తయారు చేసిందని చెపుతారు. గురు నానక్ సంగీత కళలో అపార జ్ఞానము, ప్రజ్ఞ గల ధీశాలి' అని అన్నాడు. గురు నానక్ అతి ప్రశాంతంగా, నిర్మలమైన భక్తితో తన్మయావస్థలో మునిగి వున్నప్పుడు, మర్దనుడు పక్కని గూర్చుని రబాబ్‌ను మీటి వాయిస్తూ, 'ఓ నిరాకారా! హే నిరాకారా! నిరంజన!' అంటూ కూర్చునే వాడట.

కాశ్మీరులో ఈ రోజుల్లో కనిపించే రబాబ్ వాయిద్యానికి, కర్రతో చేసిన సన్నటి 'నడుం' (waist)తో వున్న 'మొండెం' (body) ఉంటుంది. మొండాల్ని చర్మం తో కప్పుతారు. దండి (fingerboard) కర్ర చెక్కతో కప్పబడి ఉంటుంది. మొండెం పైని చర్మం మీద ఒక పలచని పీట మెద 6 గట్ తంతులుండి, తంతుల్ని దండి చివర వున్న పూటీల్లో బిగిస్తారు. ఈ 6 గట్ తంతులే గాక, వీటి కింద 11 లోహపు తంతుల్ని ధ్వని విస్తారం కోసం బిగిస్తారు. దీనిలో మెట్లు లేవుకాని 3 గట్ తంతులు దండి చివర ప్రత్యేకగా స్వరస్థాన సూచనకోసం బిగించి ఉంచుతారు. స్వరస్థానాల కోసం చేసిన ఈ ప్రక్రియ క్రమంగా తర్వాత వచ్చిన మెట్ల ఉపయోగానికి దారి తీసిందేమో అనిపిస్తుది.

సరిగ్గా ఈ రబాబ్ లాంటి వాయిద్యం, ఈ రోజుల్లో హిందూస్థాని సంగీత కచ్చేరీల్లో బాగా ప్రసిద్ధమై, ప్రపంచ మంతటా కూడా పరిచయమై పోయిన 'సరోద్' అని

పేరున్నది. ఈ 'సరోద్' అనే పేరు, 'శారద వీణ' అనే పేరు నుంచి వచ్చిందని కొందరి అభిప్రాయం, కాని దీనికి సరియైన నిదర్శనాలు ఏ సంగీత గ్రంథంలోను కనిపించవు. అయితే 913వ సంవత్సరంలో సమర్ఖండ్ ప్రాంతానికి చెందిన 'ఇబిన్ అల్వాస్' అనే ఆయన 'షరూద్' అనే పేరుతో చాల స్థాయిలతో వాయించే సౌకర్యంగల తంతి వాయిద్యాన్ని నిర్మించాడని తెలుస్తోంది. పురాతన ఇండో పెర్షియన్ సాహిత్యంలో సరోద్ అనే పేరు చెప్పబడిది. మధ్య యుగ ప్రారంభంలో 'హసన్ నిజామి' అనే ఆయన ఢిల్లీ సుల్తానుల రాజదర్బారని వర్ణిస్తూ ఒక గాయకుణ్ణి గురించి ఇలా చెప్పేడు. 'ఆ గాయకుడు 'రుద్' వాయిద్య తంతితో తన గొంతును కలిపి 'సరోద్' సంగీతంతో దీనావస్థలో వున్న ప్రేమికునివలె కోయిల గొంతుతో పాటొయాడు', అన్నాడు. ఇంకోసారి ఇలా చెప్పాడు. 'ఎంతో అందంగా దేవతస్త్రీ వలె వున్న ఒక గాయని నెమలి కన్నులతో అలంకరించుకుని చక్కని చెక్కిళ్ళ ముఖంతో తన కోయిల కంఠంతో అత్యద్భుతమైన పాటల్ని దివ్యగానం చేసింది. తన 'ముసికర్' వాయిద్యం వాయిస్తూ పశుపక్ష్యాదుల్ని కూడ ఆకర్షించేట్లు, ఆకాశంలోని పక్షులు కూడ కిందికి వచ్చి వినేట్లు, వాయించింది,' అన్నాడు. అయితే ఇక్కడ 'రుద్' అన్నది ఒక వాయిద్యమని తెలుస్తోంది కాని 'సరోద్' అన్నది ఒక పాటా లేక మన లూట్ వాయిద్యమా ఏమీ తెలియడం లేదు. ఈ రోజుల్లో కూడ మధ్యేషియాలో 'ఉద్' అనే పొట్టి మెడగల లూట్ వాయిద్యం కనిపిస్తుంది. ఇదంతా చూస్తే, మన దేశపు సరోద్ వాయిద్యం మధ్యేషియాలోని 'ఉద్' వాయిద్యం నుంచి వచ్చిన దానిలాగే కనిపిస్తుంది. పైగా దాని నిర్మాణంలోను, పేరులోనుకూడ - సరోద్ పదం, ఉద్, సరోద్ పదాల పోలికగానే - ఆ వాయిద్య పోలికలే కనిపిస్తాయి. రబాబ్ వాయిద్యంలో లాగే దీనిలోకూడా, వస్నని నడుమున్న మొండెం ఉంది కాని మొండెం



44. సరోద్

అంత లోతు లేకుండా కొంచెం 'మెరక' గా (shallow) వుంటుంది. ఇంకో చిన్న తేడా, దండి కర్ర చెక్కతో కప్పడానికి బదులు ఇనప రేకుతో కప్పబడి ఉంటుంది. దీని మీద నాలుగు ముఖ్య తంతులు, శృతికోసం రెండు తంతులు, ధ్వని విస్తారం కోసం 'తరాబ్' అనే 12 తంతులు అన్నీ ఇనప తంతులే ఉంటాయి. రబాబ్ లాగే దీన్ని కూడ 'జవ' అనే చిన్న కర్రముక్కతో వాయిస్తారు. (చిత్రం : 44)

ఈ రకం వాయిద్యాల్లో ఈ సరోద్‌కు ఒక 'పెద్ద అన్న' గారున్నారు. 'సుర్‌సింగార్' అనే పేరుతో ఈ వాయిద్యం సరోద్‌కు రెట్టింపు పెద్ద ఆకారంలో వుంటుంది. దీని 'ఫింగర్ బోర్డు' కూడ రేకుతో కప్పుతారు. దీని మొండెం తోలుతో కాక పలచని కర్ర చెక్కతో కప్పబడి ఉంటుంది. 19వ శతాబ్దారంభంలో వారణాసిలోని మహారాజా ఉదిత్ నారయణ్‌సింగ్' అనే రాజావారి ఆస్థానంలో వుండే 'జఫర్‌ఖాన్ రబాబి' అనే ఆస్థాన విద్వాంసుడే సుర్‌సింగార్‌ను సృష్టించాడని చెపుతారు. దీని పెద్ద ఆకారం వల్ల, స్వాభావిక స్థితి వల్ల, దీని నాదం లోతుగా, చాల వినసొంపుగా వుండేదని తెలుస్తోంది. కాని ఈ రోజుల్లో మంచి రకమైన ఈ లూట్ వాయిద్యాన్ని విందామంటే వాయించే వాళ్ళు విస్తారంగా కనిపించరు.

ఇంకో వింతైన వాయిద్యం ఈ రకంలోదే 'స్వరబట్' లేక 'స్వరగట్' వాయిద్యం. ఇది నిజంగా కచ్ఛపి, రుబయా వాయిద్యాల లక్షణాలు, దోతర, రబాబ్ వాయిద్య లక్షణాలన్నీ కూడ కలిపి తయారుచేసిన సృష్టిలా కనిపిస్తుంది. రబాబ్ లాగే ఇది కనిపిస్తుంది కాని దానికంటె కొంచెం పెద్ద ఆకారంలో వుంది. దీని ఫింగర్‌బోర్డు మాత్రం దోతర వాయిద్యంలో లాగ సన్నంగా కనిపిస్తుంది. ఒక వింత విషయం, ఈ వాయిద్యం ఉత్తర దేశంలో కంటె దక్షిణాదిని అక్కడక్కడ కనబడుతోంది. దక్షిణాదిని త్యాగరాజుగారి శిష్యుడైన ఉమయాళ్‌పురం కృష్ణభాగవతర్ వాయిస్తున్నట్లున్న స్వరగట్ బొమ్మ ఒకటే నమ్మదగ్గ ఆధారంగా కనిపిస్తోంది. తమిళనాడులోని పుదుక్కోట మ్యూజియం (పురావస్తుశాల) లో కూడ ఈ వాయిద్యం కనిపిస్తోంది.

మనదేశంలో పెద్ద మెడ (దండి)తో వున్న లూట్ వాయిద్యాలెలా అభివృద్ధిచెంది వ్యాపించాయో ఇంకా స్పష్టంగా తెలియదు. మనదేశ మధ్య భాగంలో ఆదిమానవుల రాతి గుహలున్నాయి. ఆ గుహల్లోని కొన్ని బొమ్మల్లో పొడుగు మెడతో వున్న లూట్ రకాల వాయిద్యాలు కనిపించాయి. కాని సర్వసాధారణంగా, - ఎక్కడో చెల్లాచెదురుగా ఒకటి, రెండు తప్ప, - మనకి కనిపించే బొమ్మలు పొట్టి మెడతో వున్నవే విస్తారంగా వున్నాయి సరియైన, సందేహంలేని, అభిప్రాయం ఈ విషయంలో ఏర్పడాలంటే ఇంకా ఎంతో విషయసేకరణ చాల అవసరం.

మెట్లు లేకుండా పొడుగు మెడతో వున్న లూట్ రకం వాయిద్యం దక్షిణాదిని మనం చూసే 'గోటువాయిద్యం'. దీనికి ' మహానాటకవీణ' అని కూడ పేరుంది. దీని విషయంలో కూడ ఏమీ చరిత్ర, నిదర్శనాలు దొరకవు. 17వ శతాబ్దంలోని ఒక తెలుగు గ్రంథంలో దీన్ని మొదటిసారిగా చెప్పినట్లు తెలుస్తోంది. ఈ వాయిద్య నిర్మాణం సర్వ సాధారణమే కాని దీన్ని వాయించడం శ్రమతో కూడిన పని. గుండ్రంగా వుండే కర్రతో చేసిన కుండను, పైన పలచని చెక్కతో కప్పుతారు. ఈ కుండకి ఒక పక్కని మెడ, ఆ మెడతో కలిసి ఉండే దండి, మెట్లు లేకుండా ఉంటుంది. ఈ దండికి చివర ఒక మృగముఖం (Motif) ఆకారంలోని 'యాళి' ఉంటుంది. ఈ చివరే నాలుగు

పూటీలుంటాయి. 4 తంతులు కుండమీద వున్న పీటమీదుగా దండి చివర వున్న పూటీల్లో బిగింపబడి ఉంటాయి. ఇవికాక శృతి, తాళం కోసం పనికి వచ్చే 3 తంతులు పక్కని బిగింపబడి ఉంటాయి. ఇంకా ధ్వని విస్తారం కోసం దండిలో మధ్యని కొన్ని తంతులు (tarab) అమర్చబడి ఉంటాయి. ఇలా ధ్వని విస్తారం కోసం తంతులువయోగించడం దక్షిణాదిని ఈ ఒక వాయిద్యంలోనే కనిపిస్తుంది. ఇక్కడి వారికిది కొత్త ప్రక్రియలా కనిపిస్తుంది, ఏమంటే ఆ తంతులకి పేరు ఏమిటని అడిగితే వీళ్ళు 'ఏమో మాకు తెలియదు' అంటారు. ఇది మీటి తంతుల్ని వాయిస్తూ, ఒక గుండ్రని చావ కర్రతోకాని, 'ఇబొని' తో చేసిన ముక్కతోకాని తీగల మీద ఎడం చేత్తో స్వర స్థానాల్ని వాయిస్తారు. ఇందులో గమకాలు వాయించడానికి కూడ అవకాశముంది. తీగలమీద వాయించే కర్రముక్కకి 'కొడు' అని పేరుంది. దీన్నుంచే ఈ వాయిద్యాని కీపేరు వచ్చినట్లుగా కనిపిస్తుంది. ఇలా కర్రముక్కతో వాయించే వాయిద్య ఇదివరలో 'ఏకతంత్రి' వాయిద్యాన్ని పరిచయం చేసినపుడు చెప్పుకున్నాం. హవై దీవుల్లోని 'హవైగిటార్' అనే వాయిద్యాన్ని కూడా ఇలా కర్రముక్కతో వాయిస్తారని తెలుస్తోంది. మెట్లు లేకుండా, వాయించే ముఖ్య తంతులు దండి మీద ఎత్తుగా బిగింపబడి ఉన్నందున, ఇది వాయించడం చాలా సున్నితంగా, నేర్పుగా, శ్రమతో చేయవలసిన పని.

సరస్వతీవీణ, వీణ రకాలన్నింటికీ 'రాణి' అని చెప్పాలి. (హిందూస్థానీ సంగీత విద్వాంసులుకూడ తమ జిథర్ రకం వీణను 'వీణ' అనే చెపుతారు. మనం మాత్రం దక్షిణాదివీణను 'సరస్వతీవీణ' అని, ఉత్తరాది జిథర్ రకాన్ని 'రుద్రవీణ' అని చెప్పుకోవచ్చు.) సరస్వతీవీణ కింత ప్రాముఖ్యం, దాని సౌష్టవం, అందం, నాద గుణాల వల్లనేకాక దానిలో వైవిధ్యతోబాటు పరిపూర్ణ అక్షణం వల్ల వచ్చిందని చెప్పాలి. మంచి సంగీతానికి కావలసిన లక్షణాలన్నీ, ఏర్పాట్లన్ని ఇందులో ఉన్నాయి. రాగం వాయించడానికి చాలా స్థాయిలున్నాయి. శృతి, తాళాలకు తాళ తంతులున్నాయి. అందువల్ల దీనిలో మరే వాయిద్యంలోను లేని, సమన్వితమైన లక్షణం ఉంది. ఈ సరస్వతీ వీణ నిర్మాణం. 17వ శతాబ్దంలో తంజావూరు రాజా రఘునాథ నాయకుని కాలంలో జరిగిందని తెలుస్తోంది. అందువల్లనే దీన్ని 'తంజావూరు వీణ' అని కూడ అంటారు. ఈ వీణకర్రతో చేయబడి, 'కుడం' అనే దీని కుండ (resonator) పలచని కర్రచెక్కతో కప్పబడి, ఒక వైపుకు సన్నని మెడతో (neck) వుండి, ఈ మెడ నుంచి ఒక దండి అతకబడి ఉంటుంది. దండి చివర 'యాళి' ముఖం (Motif) తో వుంటుంది. ఇది మాత్రం ఇదివరలో చెప్పిన 'యాళ్' (Yazh) కాదు. కుండకు మధ్య భాగంలో పైని 'పీట' (bridge) ఉంటుంది. ఈ పీట కొంచెం తీగలున్నవైపుకు వంగి ఉంటుంది. పీట మీద ఒక ఇత్తడి రేకు అతకబడి 'ఏకతంత్రి' వాయిద్యంలో లాగ ఉంటుంది. పీటకి పక్కని ఒక వంగిన కర్రముక్క (auxiliary bridge) తాళ తంతులు మూడు

బిగించడం కోసం ఉంది. తాళతంతులు దీనిమీద బిగిస్తారు. ముఖ్య తంతులు నాలుగు పీటమీదనుచ తాళతంతులు మూడు పక్కనున్న కర్రముక్క మీదికి బిగింపబడి ఉంటాయి. తాళ తంతులకు 'సారణి' అని పేరుంది. ముఖ్య తంతులను కుడిచేతి చూపుడు, మధ్య వేళ్ళతో కిందికి మీటుతూ వాయిస్తే, తాళ తంతుల్ని చిటికెన వేలితో కింది నుంచి పైకి మీటుతూ వాయిస్తారు. ఎడంచేత్తో దండి మీద వున్న ఇత్తడి మెట్లు (brass frets) మీద స్వరాల కోసం కిందికి, పైకి కావలసిన విధంగా వాయిస్తూంటారు. దండికి చివరి భాగంలో నాలుగు ముఖ్య తంతులను బిగించి, దండిలో పక్కనున్న 3 పూటీల్లో తాళ తంతులను బిగిస్తారు. దండి చివరి భాగంలో వున్న 'యాళి' ముఖం కిందికి ఒక ఆనపకాయ బుర్రగాని, కర్రతో చేసిన బుర్రకాని అతకబడి ఉంటుంది. వీణని వాయించడం సాధారణంగా 'పడుకోబెట్టి' (horizontal position) వాయించడమే అలవాటు అంటే వాయించేవారు 'పీఠం' వేసుకుని (cross legged) కూర్చుని, వీణ కుండని కింద ఉంచి, దండి చివరి ఆనపకాయ బుర్రను ఎడమ కాలిమీద ఆనించి వాయించడం సులువుగా వుంటుంది. అయితే పూర్వం కొంతమంది వైణికులు వీణని నిలబెట్టి (vertical position) అంటే కుండని ఒళ్ళో పెట్టుకుని వీణని నిలబెట్టి వవాయించడం కూడ సాంప్రదాయంగా వుండేది. ఈ రకంగా మన రాష్ట్రంలోను, మైసూరులోను వాయించడం అలవాటుండేదని తెలుస్తూంది. కాని ఈ అలవాటు ప్రస్తుత కాలంలో విస్తారంగా లేదు. వీణని వాయించే విధానాలు ఎంతో నైపుణ్యంతో ఉత్తమమైన రీతిలో వృద్ధి చెందాయి గనుక ఆ వాయిద్యంలో వేర్వేరు 'శైలి' లేక 'బాణి' (styles) అమల్లో వుంటుందని తెలుస్తూంది. ఈ విధమైన శైలి లేక బాణీల్లో తంజావూరు బాణి ముఖ్యమైంది. తంజావూరు బాణీ అంటే విశేషం గమకయుక్తంగా, గౌరవమైన వేగంతో, తొందరపాటు లేకుండా, అతిమనోహరంగా వుండే విధానమని చెప్పవచ్చు. మన రాష్ట్రంలోను, మైసూరు లోని బాణీలు కొంచెం



45. సరస్వతి వీణ

వ్యత్యాసంగా వుండేవని చెప్పవచ్చు. వీటిలో మీటు విధానాల ప్రత్యేకత, రెండు, మూడు తంతులను కలిపి ఒకేసారి వాయించడం, ఎక్కువ నిలుపులతో (stuccato) కూడి వాయించడం, తాన వరుసలలో రక్తితో కూడిన వైవిధ్యం ఎంతో ఆకర్షణీయంగా వుండేవని చెప్పాలి. ఒక్క విషయం మనమిక్కడ గుర్తుంచుకోవాలి. మన దేశ సంగీతంలో, వాయిద్యాల కోసం అని ప్రత్యేకమైన రచనలేమీ సాగలేదు. మన సంగీతమంతా గానం కోస ఏర్పాటైన విధానం. దాన్నే వాయిద్యాలలో వాయించడం మన సాంప్రదాయం. విదేశాల్లో వాయిద్య కూటాలకు (orchestras) వేరు వేరు రచనలు ప్రత్యేకంగా చేసిన వున్నాయి. మన దేశంలో ఆ పద్ధతి లేదు. మనకి ముందు తరంలోని అతి ప్రఖ్యాతులైన వైణికుల్లో మద్రాసులోని వీణ ధనమ్మాళ్, మన రాష్ట్రంలోని సంగమేశ్వర శాస్త్రి, మైసూరులోని వీణ శేషన్నగార్లను చెప్పుకోవాలి. (చిత్రం : 45)

కర్ణాటక సంగీతంలో వీణకెంత గౌరవమున్నదో, హిందూస్థానీ సంగీతంలో ప్రస్తుతం సితారకంత గౌరవం, ప్రాధాన్యం వచ్చాయి. విదేశీయులు కూడ సితార్ వాయిద్యాన్నెంతగానో గౌరవిస్తూ, ఆదరించడం మనకెంతో సతోషకరమైన విషయం. విదేశీయులకు మన సితారంటే గౌరవము, ఇష్టమేకాక, వారిలో అనేక మంది మన సితారాల వద్ద సితార నభ్యసించి, నైపుణ్యం సంపాదిస్తున్నారు. సితార్ యొక్క 'పెద్దలు' మన దేశపు పశ్చిమోత్తర సరిహద్దుల కవతలివైపు నుంచి మన దేశానికి వచ్చినా ఇప్పుడా సితార మన దేశంలో అతి ముఖ్యమైన సంగీత వాయిద్యము. సాంస్కృతిక చిహ్నం కూడా. సితార పొడుగు మెడగల (దండి) లూట్ రకం వాయిద్యం. దాని వలె వున్న బొమ్మలు కొన్నింటిని మధ్యేషియాలో పశ్చిమంగా వున్న కొన్ని గుహల్లో చూసినట్లిదివరలో చెప్పుకున్నాం. 13వ శతాబ్దపు ప్రసిద్ధ కవి, గాయకుడైన అమీర్‌ఖుస్రో దీన్ని కనుగొన్నాడని నిన్నమొన్నటి వరకు అభిప్రాయముండేది కాని దీనికి సరియైన నిదర్శనవేమీ కనిపించడం లేదు. సరిగ్గా నమ్మదగ్గ గ్రంథాల్లో 18వ శతాబ్దానికి పూర్వముండే ఏ విషయాన్ని స్పష్టంగా చెప్పినట్లు లేదు. 18వ శతాబ్దపు ఒకానొక గ్రంథకర్త మాత్రం సితార్ వాయిద్యమంటే 'నిబద్ధతంబూర' అని చెప్పాడు. సితార్‌కి, తంబూరకి ఉండే సంబంధం ఈ మాటతోటే తెలుస్తోంది. ఇంకొక అభిప్రాయంలో ఇది వరలో చెప్పిన త్రితంత్రి వాయిద్యం నుంచి సితార్ పుట్టిందని అంటారు. అలాగే 'సెహ్‌తార్' అనే పదంనుంచి వచ్చిందని కొందరి అభిప్రాయం. పెర్షియన్ భాషలో 'సెహ' అంటే మూడు, తార్ అంటే తంతి. మూడు తంతులున్నందన అలా సెహ్‌తార్‌గా వుండి, క్రమంగా అది సితార్‌గా మారిందని వారి యోచన. సంస్కృతంమాట 'త్రితంత్రి' కూడ ఈ విధంగానే ఉంది. మాటల పోలిక బాగానే ఉంది కాని, త్రితంతి, సితార్ల నిర్మాణం చాలా వ్యత్యాసమైంది. త్రితంత్రి జిథర్ రకం వాయిద్యం. సితార్ లూట్ రకం. అందవల్ల ఈ విషయం నమ్మదగ్గదిగా లేదు. కాని కాశ్మీర్‌లో 'సెతార్' లేక సైతార్' అనే లూట్ రకం వాయిద్యమొకటి, సితార్ కంటే చిన్న ఆకారంతో వున్నది ఉంది. దాని దండి ఒక

అనపకాయ బుర్రనుంచి ముందుకు వచ్చింది. దాని మీద ఒక వెదల్పు పీటకాని, సన్నటి పీటకాని ఉంటుంది. 7 తంతు లున్నాయి. దండిమీద కదపడానికి వీలైన గట్‌తో చేసిన మెట్లు (movable gut frets) ఉన్నాయి. అందుచేత లూట్ వాయిద్యం, కదిలే మెట్లున్నది, పేరులో పోలికున్నది అయిన ఈ సెతార్ మన సితార్‌కు ముందుండిన వాయిద్యమై వుండ వచ్చునిపిస్తోంది.

సుమారు ఒక శతాబ్దానికి పూర్వం సితార్ వాయిద్యాని కింత ప్రాముఖ్యం కాని, గౌరవంకాని ఉండేదికాదు. అది దరిమిలా వచ్చిన విశేషం. ఆ రోజుల్లో సితారుకేమీ ఆదరణ లేదు. అప్పటి సంగీత లోకంలో 'రుద్రవీణ', 'మహారాణిగా' పరిపాలిస్తూ ఉండేది. సంగీత విద్వాంసులా రోజుల్లో రుద్రవీణను తమ పారంపర్యమైన వంశ గౌరవచిహ్నంగా చూసుకునే వారు. ఎవరైనా సంగీతం నేర్చుకోవడానికి వారిని ఆశ్రయిస్తే, మొదట 'పట్టిసితార్' వాయిద్యాన్ని నేర్పి పంపించే వారట. సితారు ప్రాధమికంగా నేర్చుకునే అప్రాధాన్యమైన వాయిద్యమారోజుల్లో. అయితే18వ శతాబ్దపు ఉత్తర భాగంలో చాలమంది సుప్రసిద్ధ విద్వాంసులు సితార్ వాయిద్యంతో సంగీత కచ్చేరీలు నిర్వహిస్తూ సితార్‌కు గొప్ప పేరు ప్రఖ్యాతులు గడించి పెట్టేరని తెలుస్తూంది. అటువంటి వారిలో అమీర్‌ఖాన్, బర్కతుల్లాఖాన్, బహదూర్‌ఖాన్, గులాంరజా మున్నగు వారుండేవారని చెపుతారు. వీరి పేరు ప్రఖ్యాతుల వల్ల ప్రజలలోని అభిరుచి కూడ కొంతవలకు మారిపోయిందని తెలుస్తూంది. రుద్రవీణ యొక్క గౌరవమైన నాద పుష్టి, సౌష్టవమైన దాని శైలి వెనకబడిపోయినట్లే, ధ్రువద్ గానం, పఖావాజ్ వాయిద్యం అపురూపమై కనిపించకుండా పోయాయి. ఈ తరంలో ఖ్యాల్ గానం, తబలా వాయిద్యం ముందుకు వచ్చినట్లే, సితార్ వాయిద్యం పైన చెప్పిన విద్వాంసుల ప్రతిభ, ప్రతిష్ఠలవల్ల ఒక గౌరవ స్థానాన్ని ఆక్రమించిందని చెప్పాలి. ఇలా సితారు వాయించి కీర్తి ప్రతిష్ఠ లార్జించిన సంగీత విద్వాంసులు ప్రత్యేకమైన తమ శైలి, లేక బాణీలను ప్రచారంలోకి తీసుకువచ్చారు. అలా వచ్చిన బాణీలు ఈ రోజుల్లో కూడ అమల్లో వున్నాయి. వీరిలో మసీతఖాన్ అనే సితారు విద్వాంసుని శైలిని 'మసీత్‌ఖానీ బజ్' అంటారు . ఈ శైలి అతి సుగమంగా, గజగమనంలా గౌరవమైన నడకతో, క్లిష్టమైన, అవాంఛనీయమైన కల్పన లేమీ లేకుండా, సావకాశంగా హాయిగా వుండే రాగప్రస్తారాని కనుకూలంగా వుంటుంది. గులాంరజా అనే విద్వాంసుని శైలి వేగమైన నడకతో, అతి క్లిష్టమైన కల్పనలతో శ్రోతల్ని ఆశ్చర్యపరుస్తు ముగ్ధుల్ని చేస్తూంటుంది. ఇలా సితార్ వాయిద్యం ప్రజల్లో ఒక నూతనాభిరుచిని సృష్టించి, ఒక ప్రత్యేక గౌరవాన్ని సంపాదించుకొంటే, రుద్రవీణయొక్క పురాతన కీర్తి, గౌరవాల్ని 'సుర్‌బహార్' అనే వాయిద్యం తన స్వంతం చేసుకుంది. ఈ సుర్‌బహార్, సితార్ కంటె కొంచెం పెద్ద ఆకారంలో వుంటుంది.

ఇతరాలైన జిథర్, లూట్ వాయిద్యాల్లోలాగే, సితార్‌కు ఒక గుండ్రటి ఆనపకాయ బుర్ర ఉంటుంది. ఆనపకాయ బుర్ర చదునుగా (flat) ఉంటే ఆ సితార్‌ను 'కంఛువా'

అంటారు. సితార్ బుర్రని 'తుంబ' అని కూడ అంటారు. ఈ తుంబకు ఒక పక్కని మెడ ఉండి, ఆ మెడ దండికి అతకబడి ఉంటుంది. తుంబ పైభాగాన్ని పలచని కర్రచెక్కతో కప్పుతారు. ఇది కొన్నింటిలో చదునుగాను (flat), మరి కొన్నింటిలో కొంచెం వంపుతో (bulgin) ఉండవచ్చు. దండిమీద కొద్దిపాటి వంపు గల మెట్లు వుంటాయి. ఈ మెట్లు కదిలేవిగా (movable frets), కావలసిన స్వర మేళానికి అనుకూలంగా మార్చడానికి వీలుగా వుంటాయి. వీటిని 'చల్‌తట్' అంటారు. ఈ 'చల్‌తట్' మెట్లు ఇప్పుడు సాధారణంగా ఉపయోగిస్తున్నారు కాని పాత సితార్లలో 'అచల్‌తట్' అంటే మెట్లు కదలకుండా బిగించినవి కూడ ఉండేవి. బాగా ఖరీదైన సితార్లలో దండి చివర ఇంకొక బుర్రకూడ ఉంటుంది. తుంబ మీద విశాలంగా వుండే పీట, ఆ పీట మీద నుంచి 5 ఇనప



46. సితార్

తీగలు బిగిస్తారు. ఈ పీట మీదే 'చికరి' అనే పేరుతో రెండు తీగలు శృతికోసం బిగిస్తారు. ఇవికాక పెద్ద పీటకు కిందగా ఒక చిన్న పీటమీద ధ్వని విస్తారం కోసం, 'తరాబ్' అనే పేరుతో 11 నుండి 17 తీగల వరకు బిగింప బడి ఉంటాయి. ఈ ఏర్పాటు చవక రక సితార్లలో కనిపించదు. పీటలు చావకర్రతో కాని, కొమ్ముతో కాని, దంతంతో కాని చేసినవై ఉంటాయి. సితార్ వాయించడానికి 'కొణపం' (plectrum) తీగతో చేసినది చూపుడు వేలుకు తొడుగుకుని, వేలును ముందుకు, అవతలికి కదుపుతూ మీటి వాయిస్తారు. ఇక్కడ 'చికరి' తీగల్ని కేవలం శృతికోసం వాయిస్తారు కాని, వీణలో లాగ, తాళానికి కూడ వాయించడం సితార్ సాంప్రదాయంలో లేదు. (చిత్రం : 46)

నాదం కోసం విల్లుపయోగించే వాయిద్యాల్ని, వాటి ప్రారంభ దశను తెలుసు కోవడంలో అనేక క్లిష్టతరమైన సమస్య లెదురయ్యాయి. ఎన్నో రకాలైన మూలాధారాలు, నిదర్శనల్ని బట్టి, ఎన్నో అభిప్రాయాలు ప్రతిపాదింపబడి , చర్చించబడి, వాటిని

కొంతవరకు ఆమోదించి, తిరిగి వాటిని నిరాకరించడం జరుగుతుంది. పండితులంతా ఆమోదించిన మూడు ముఖ్యమైన సాంస్కృతిక ప్రదేశాలు, ఈ విషయ నిర్ధారణ కోసం ఇది వరలో సూచింపబడ్డాయి. ఆ ప్రదేశాల్లో ఒకటి యూరోప్‌లోని నార్డిక్ ప్రాంతం (Nordic Region), రెండు మన భారత దేశం, మూడు పశ్చిమ ఏషియాలోని మధ్య ప్రాంతం (Central West Asia) ముఖ్యమైనవి. ఇంతవరకు పాశ్చాత్య పండితులు, వీటిలో మొదటి దాన్ని, ఆఖరు ప్రాంతాల్ని బాగా పరిశోధించి పరిశీలించారు కాని మన దేశం విషయంలో కావలసిన విషయ సేకరణకాని, పరిశీలనకాని సరిగా జరపలేదు. అయితే పరిశీలనఆవశ్యకతను, మన దేశ ప్రాముఖ్యతను వారంగీకరిస్తూనే ఉన్నారు. ఈ మధ్య వెలువడ్డ ఒక ఉత్తమమైన సంగీత గ్రంథంలో, గ్రంథకర్త విల్లు వాయిద్యాల ప్రారంభదశంతా మన దేశంలోనే జరిగిందనడానికి ఆధారాలున్నాయని చెపుతూ, వెంటనే మన దేశంలో కనబడే పురాతన విల్లు వాయిద్యాల బొమ్మలు 17వ శతాబ్దంనుంచే కనిపిస్తాయని చెప్పి, – అట్టి్రకితం బొమ్మలేమీ లేనట్లుగా – వాటి ఆధారం సరియైనది కాదని ఆ విషయాన్ని నిరాకరించి వదిలి పెట్టాడు. మన దేశంలోని విల్లు వాయిద్యాల కుడ్య చిత్రాలు ఇంకా 7 శతాబ్దాలకి ముందుగా చిత్రించిన వనడానికి ఎన్నో ఆధారాలున్నాయి. మన దేశంలోని గిరిజనులు, జానపదులు వాయించే విల్లు వాయిద్యాల రకాలు ఆఖరికి స్థూలంగా లెక్కవేస్తే 50 వాయిద్యాలకి పైగా కనిపిస్తాయి. పైన చెప్పిన గ్రంధకర్తగారు కనీసం ఈ విషయాన్నయినా తమ గ్రంథంలో చెప్పలేకపోయారు.

7వ శతాబ్దంనుంచీ విల్లు వాయిద్యాలు మన గ్రంథాల్లో చెప్పబడుతూనే ఉన్నాయి.తర్వాత వచ్చిన గ్రంథాల్లో విల్లు వాయిద్యాలను పేర్కొనడం, వర్ణించడం కూడా జరుగుతోంది. వయోలిన్ యొక్క ప్రారంభ దశను సూచించే వాయిద్యాలనేకం మన గిరిజనుల వద్ద, జానపదుల్లోను కనిపిస్తూనే ఉన్నాయి. ఈ రకం 10వ శతాబ్దానికి చెందిన శిల్పచిత్రాలు మన రాష్ట్రంలో విజయవాడలోను, మైసూరు వద్ద వున్న 'అరకేశ్వర' దేవాలయంలోను చూడవచ్చు. 'సరింద' వాయిద్యం వంటి వాయిద్యాలు బెంగాల్‌లో, విష్ణుపూర్‌లోను, సారంగి వంటి వాయిద్యాల్ని మన పశ్చిమ దేశంలోను శిల్పచిత్రాల్లో కనిపిస్తున్నాయి. ఇన్ని నిదర్శనాలు, ఆధారాలు మనవద్ద వుడడం వల్ల భారత దేశంలో విల్లు వాయిద్యాల పరిచయం ఈనాటిది కాదని, కనీసం 11 వందల సంవత్సరాల నుంచి వస్తూందని మనం ధైర్యంగా చెప్పొచ్చు. ఇంకొక విషయం, పరిచయం ఉందని సంతోషిస్తే సరిపోదు. ఆ వాయిద్యాల బొమ్మలు, శిల్పాలు, శిల్పచిత్రాలు మొదలైన వెక్కడ లభిస్తాయో, అవి ఎన్ని రకాలున్నాయో, మొదలైన విషయాల్ని పరిశీలించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది, ఇలాంటి పని జరిగితేకాని ప్రపంచ సంగీత చరిత్రలో మన దేశానికి ఎంత ముఖ్యమైన పాత్ర ఉన్నదో సరిగా అర్థంకాదు. (చిత్రం : 47)

వయోలిన్ ఆకారంలో, ఆ నిర్మాణంతో పోలికలున్న వాయిద్యాలు లేని ప్రాంతాలు

మన దేశంలో ఎక్కడా లేవు. ఈ రకం వాయిద్యాల్లో ధ్వని కోసం ఏర్పడ్డ విభాగం సాధారణంగా ఒక కొబ్బరి చిప్ప లేక పలచటి కర్రచెక్కతో చేసిన పెట్టె (coconut



47. కింగ్రి

shell or small wooden chamber) వాయించేవాని భుజంమీద ఆనుకుని ఉండి, వేళ్ళతో వాయించే దండి కింది భాగంలో చేతికందుబాటులో వుంటుంది. కుడిచేతిలో విల్లు పట్టుకుని వాయిస్తూ ఎడంచేత్తో తీగమీద వేళ్ళుంచి వాయిస్తారు. ఈ

రకం వాయిద్యాల్లో చెప్పుకోదగ్గవి, – మణిపూర్ ప్రాంతపు 'పేనా' అనే వాయిద్యం; ఒరిస్సాలోని 'కెన్రా' 'బాణం' అనే రెండు వాయిద్యాలు; పశ్చిమ దేశంలోని 'రావణహత్త' అనే వాయిద్యం; మన రాష్ట్రంలోను, మహారాష్ట్రలోను 'ప్రధాన్' జాతివారు వాయించే 'కింగ్రి' అనే వాయిద్యం; కేరళలోని 'పల్లవులు' వాయించే 'వీణకుంజు' అనే వాయిద్యం ముఖ్యమైనవి. వీటిలో కెల్లా సరియైన ఉదాహరణ గోండు జాతివారిలోని ప్రధానులు వాయించే 'కింగ్రి' వాయిద్యం తెలుసుకోదగినది. ఈ గోండు జాతివారొకానొక కాలంలో మధ్యప్రదేశ్‌లోను, మహారాష్ట్రలోను, ఆంధ్రలోను పరిపాలకులుగా వుండి ప్రస్తుతం వెనుకబడిపోయి వున్న బహు సఖ్యాకమైన జాతి. వీరి సాంప్రదాయంలో ప్రధానులన్నవారు వీరికి పూజారులు; కులాచారాల్ని పాటిస్తూ, మత కార్యాల్లోను పెళ్ళిళ్ళలోను ఉత్సవాల్లోను చావు సమయాల్లో కూడ, పాటలు పాడి వారి కులగౌరవాన్ని, సాంప్రదాయాల్ని వర్ధిస్తూంటారు. ఈ ప్రధానులుపయోగించే ముఖ్యమైన వాయిద్యాల్లో, ఒకటి 'పెప్రే' అని రెండు ఊడ్‌లతో వుండే నాదస్వరం; రెండోది ఢోల్ అంటే డోలు; మూడవది 'కింగ్రి' వారి కత్యంత ప్రియమైన వాయిద్యం. అది ఎలా కనిపెట్టబడిందో ఒక కథ కూడా చెపుతారు. వీరి పురాణగాథలు కూడా కొంచెం తేడాగా ఉంటాయి. పాండవుల్లో 'కనిష్టు'డైన భీమన్న, ఒకానొక సమయంలో దుర్మార్గుడైన రాక్షసుణ్ణి సంహరించేడట. 'మంకో' అనే ఆ రాక్షసుని కూతురు ఏడుస్తూ కూర్చుందట. అదే సమయంలో 'తోటి' అనే వాళ్ళింటి చిలుక తనకి రావలసిన 'భత్తెం' కోసం వచ్చిందట. మంకో తన దగ్గిర ఇవ్వడానికి ఏమీ లేదని వాపోతూ, దగ్గిరున్న నిప్పులోంచి సగం కాలిన పుల్లను తీసి 'ఇదుగో తీసుకో! ఈ పుల్లతో 'కింగ్రి' తయారు చేసుకుని వాయించుకుంటూ బ్రతుకు. నీకు మన గోండులందరూ దూడల్ని, ఎద్దుల్ని, బట్టల్ని, ధాన్యాన్ని, బహుమతులిస్తారు' అని చెప్పి ఆ పుల్లను ఆ తోటి ఒడిలో పడేసిందట. ఈ కింగ్రి వాయిద్యానికి ఒక చతురపు పెట్టె (resonator) ఉంది, అది మేక చర్మంతో కప్పబడి ఉంటుంది. దండికి ఒక వెదురు కర్రను ఈ పెట్టె లోపల దూర్చి అమరుస్తారు. ఈ దండి చివర మూడు పూటీలు ఉంటాయి. 3 గుర్రపు వెంట్రుకలు విల్లులో కడతారు. దీన్ని వాయించడానికి ఆ చతురపు పెట్టెను గడ్డంతో అదిమి పట్టుకుని, కిందికి సాగివున్న దండి మీద ఎడం చేతి వేళ్ళతో వయొలిన్ వాయించినట్లు వాయిస్తారు. దీని విల్లుకు చిన్న గజ్జెలు కూడ కట్టబడి ఉండి, విల్లుతో వాయించేటపుడు అవి గూడ తమాషాగా ధ్వనిస్తూంటాయి. (చిత్రం : 48)

గుజరాత్, రాజాస్థాన్‌లలోని 'రావణహత్త' లేక 'రావణహస్త' వీణ వాయిద్యం, అటుక్రితం చాలాకాలం నుంచీ ప్రచారంలో వుండే విల్లు వాయిద్యాల్ని, ప్రస్తుత వయొలిన్ వాయిద్యాన్ని కలిపే ఒక ముఖ్యమైన 'గొలుసు' అని చెప్పవచ్చు. రావణ హస్త వీణ అని దీనికి పేరు ఎలా పెట్టారో తెలియదు గాని 7వ శతాబ్దంలో మొదటిసారిగా దీన్ని చెప్పారని తెలుస్తూంది. ఈ రోజుల్లో పశ్చిమ దేశంలో అది సాధారణంగా కనిపించే

ప్రచారంలో వున్న వాయిద్య మనాలి. దీనిలోని ముఖ్యాంశం కొబ్బరి కాయను సగం కంటె కొద్దిగా పైభాగానికి కోసి ఆ చిప్పను తోలుతో కప్పి చేస్తారు. ఈ చిప్పలోనికి కింగ్రి వాయిద్యంలో లాగే ఒక వెదురు దండిని దూర్చి తయారు చేస్తారు. దీనిలో తంతులు,



**48**. బనమ్

ఒకటి ఇనప తీగ, ఇంకొకటి రెండు, మూడు గుర్రపు వెంట్రుకలతో పేనిన తాడు. ఇది గాకుండా ధ్వని విస్తారం కోసరం 'తరాబ్' కూడ ఉంటుంది. కింగ్రిలో లాగే దీని విల్లు ఇంకా పొడుగ్గా వుంది. రెండు, మూడు చిరుగంటలు కూడ (jingle bells) కట్టబడి ఉంటాయి.

ఇంతవరకు వర్ణించిన ఈ కింగ్రి, రావణహస్త వీణ వాయిద్యాల్లో, ధ్వని చేసే పెట్టెలు (resonator box) పైని పెట్టుకుని అంటే భుజాన్ని ఆనించి, గడ్డంతో అదిమి పట్టుకుని వాయించే రకాలు. ఈ రకంలోనే 'పేనా', 'బణం', 'కెన్రా', 'పుల్లవన్ వీణ' మొదలైన వాయిద్యాలన్నీ వస్తాయి. వీటిలో ఇంకో రకం, ధ్వని పెట్టె కిందఉండి, వాయించే దండి భుజం దగ్గిరకి వస్తుంది. ఈ రకానికి చెందే వాయిద్యాలు, 'కమైచా', 'సరిందా', 'సారంగి' మొదలైనవి.

కమైచా వాయిద్యాల్ని గురించి మనం ప్రత్యేకంగా గుర్తుంచుకోవలసిన విషయం, అది మన దేశానికి, పశ్చిమ ఏషియా, ఆఫ్రికాలకి గూడ వాయిద్య చరిత్రలోని సంబంధాన్ని గుర్తు చేసే చిహ్నం. వాయిద్య చరిత్రలో ఒక్క రావణహస్తని తప్పిస్తే, కమైచా ప్రపంచంలోని విల్లు వాయిద్యాల్లో కెల్లా బహు పురాతనమైన వాయిద్యం. ఇప్పటికి తెలిసిన సమాచారాన్ని బట్టి 10వ శతాబ్దం నుంచీ ఈ వాయిద్యం

ఈజిప్టులోను, మన సింధు రాష్ట్రంలోను కూడ బాగా పరిచయమైన వాయిద్యం. అందరూ ఒప్పుకునే విషయం, 'కమాన్' అనే మాట అరబిక్-పెర్షియన్ మాట అని, దాన్నుంచే 'కమాన్చా' అనే మాట వచ్చిందని, ఏకాభిప్రాయం. అయితే ఇది సింధు రాష్ట్రం నుంచి ఈజిప్టు పశ్చిమ ఏషియాలకి వెళ్ళిందా లేక అటునుంచి మన దేశానికి వచ్చిందా అనేది వివాదాంశం. అలాగే పురాతన 'కమాన్చా' వాయిద్యం, ఇప్పటి 'కమైచా' వాయిద్యంతో ఆకారంలోను, నిర్మాణంలోను, వాయించే విధానంలోను ఒకే రకంగా వుండేదా అన్న విషయం కూడా వివాదాంశమే. ఈ విషయాలకి సమాధానం మనకి దొరికితే విల్లు వాయిద్యాల చరిత్రలో మనం ఎన్నో విషయాలు గ్రహించవచ్చు. ఇప్పుడు మనకు కనిపించే కమైచా వాయిద్యం పశ్చిమ రాజాస్థాన్‌లోని 'మాంఘ్నియర్' (Monghniar) ప్రజలు విరివిగా వుపయోగించే లూట్ రకం వాయిద్యం. ఈ పశ్చిమ రాజాస్థాన్ ప్రస్తుతం పాకిస్థాన్‌లో కలిసిపోయిన సింధు రాష్ట్రానికి సరిహద్దులో వున్న ప్రాంతం. కమైచా వాయిద్యంలోని గుండ్రటి పాత్ర (bowl), దానితో వున్న మెడ, దండి అన్నీ కూడా ఒకే కర్రతో చేసినవి. ఇక్కడ అతుకులు లేవు. రెసొనేటర్ పాత్ర భాగం చర్మంతో కప్పబడి ఉంటుంది. దండి భాగాన్ని కర్రచెక్కతో కప్పుతారు. ఇందులో నాలుగు ముఖ్య తంతులు, వాటి కింద సన్నని పీటమీద ధ్వని విస్తారం కోసరం కొన్ని తంతులు ఉంటాయి.

మన దేశ ఉత్తర సరిహద్దు పర్వతాలలోని గిరిజనుల వద్ద బీహార్ రాష్ట్రంలోని గిరిజనుల వద్ద, 'సరింద' అనే వాయిద్యముంది. దీని ఆకారం ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ వింతైన ఆకారం. ఇంతవరకు చెప్పిన లూట్ రకాల వాయిద్యాల ధ్వని విస్తారం ఒక గుండ్రటి లోతైన కుండ లేక పెట్టెలవంటి వాటితో జరుగుతోంది. కాని సరింద వాయిద్యంలోని పెట్టె రెండు విభాగాలుగా వున్నట్లు కనబడుతుంది. పై భాగం చూడ్డానికి విశాలంగా తెరుచుకున్న 'పక్షి రెక్కల్లాగ' కనిపిస్తుంది. కింది భాగం బాగా సన్నమైపోయి, 'పేర్' (Pear) పండు ఆకారంలో వుంటుంది. దీన్ని మాత్రం చర్మంతో కప్పుతారు. పై భాగం తెరిచి ఉండి, దండి దానికి పైవైపునే ఆరంభమవుతుంది. దండి చిగురునున్న తంతులు రెండు



49. సరింద

విభాగాల్ని దాటి కింద వున్న పీట మీద నుంచి ఇంకా కిందికి బిగించబడి ఉంటాయి. ఈ తంతులు ఇనప తంతులుగాని, గట్ తంతులు గాని, పేనిన నూలు తంతులు గాని ఉండొచ్చు. (చిత్రం : 49)

ఇంక విల్లు వాయిద్యాల్లో అతి ముఖ్యమైన 'సారంగి' వాయిద్యాన్ని గురించి తెలుసుకోవాలి. సంగీత కచ్చేరీల్లో ఉపయోగించే సారంగి వాయిద్యం గుల్లగా వుండే ఒకే కర్రతో చేయబడింది. కింది భాగం సన్నని 'నడుం' లాగ కనిపిస్తుంది. దీని మొత్తం పొడుగు సుమారు 60 సెంటిమీటర్లుంటుంది. కింది భాగం సన్నగా వుండి చర్మంతో కప్పబడి ఉంటుంది. కర్రచెక్కతో కప్పిన పైభాగం చదునుగా వుండి విశాలమైన దండిగా ఉపయోగిస్తుంది. చర్మంతో కప్పిన నడుం వంటి కింది భాగం ధ్వని పెట్టెగా పని చేస్తుంది. దీనిలోని ముఖ్య తంతులు 4 సాధారణంగా గట్ తంతులుంటాయి. హిందూస్థానీ సంగీత వాయిద్యాలన్నింటికీ ఉన్నట్లే దీనిలో గూడ 'తరాబ్' తంతులున్నాయి. ఈ వాయిద్యాన్ని వాయించే విధానం ముఖ్యమైన విషయం. స్వరాలు పలికించడం కోసరం వేళ్ళ కొసలతో తంతి మీద వాయించడం కాక, వేలి గోరుతో తంతిని తాకుతూ వాయిస్తారు. ఈ విధానం మరే వాయిద్యంలోను కనిపించదని చెప్పాలి. ఈ వాయిద్యం జానపదుల్లోను శాస్త్రీయ సంగీతంలోను కూడ ఉపయోగిస్తున్న వాయిద్యం. జానపదులు వాయించే సారంగి కూడ ఇదే రకంగా వుంటుంది. అయితే 'మందర్‌బహార్' అని జానపదులుపయోగించే వాయిద్యం సారంగి ఆకారంలోనే పెద్ద సైజులో వుంటుంది. ఈ మందర్ బహార్ ధ్వని చాలా లోతుగా, పెద్ద ధ్వని (bass sound) తో వుంటుంది. (చిత్రం : 50)

సారంగిని గురించి ఒక మాట చెప్పాలని పిస్తుంది. ఇది జానపదుల్లోను, శాస్త్రీయ సంగీతంలో గూడ ఆదరింపబడే మంచి లూట్ రకం వాయిద్యం. అయితే దీని ఆదరణ హిందూస్థానీ సంగీతంతోటే పరిమితై పోయింది.గాని కర్ణాటక శాస్త్రీయ గానంలో దీనికేమీ ఆదరణ లేకుండా ఉంది. జానపద సాంప్రదాయంలో పుట్టి, నిర్మాణంలో కొద్ది మార్పులతో ఎంతో విశిష్టతని సంపాదించి, శాస్త్రీయ సంగీతంలోగూడ వుపయోగపడే వాయిద్యాల్లో ఇలాంటి వాయిద్యం మరొకటి లేదని చెప్పాలి. ఇది పూర్తిగా మన దేశీయ వాయిద్యం అని కూడా చెప్పాలి. దక్షిణాదిని దీని కింకొక విధంగా ప్రయోజనం ఉంది. తేవారం గానం చేసే 'ఓదువర్' గాయకులు దీనికి స్వాగతం పలికి ఎంతగానో ఆదరించడం మనం సంతోషించదగ్గ విషయం. తేవార గానం బహు పురాతనమైన సాంప్రదాయ గానం. వయొలిన్ వంటి పాశ్చాత్య వాయిద్యాన్ని స్వంతం చేసుకున్న కర్ణాటక శాస్త్రీయ సంగీతం పూర్తిగా మన దేశీయ వాయిద్యమైన సారంగిపై ఒక విధమైన విముఖత చూపడం కొంత అబ్బురంగానే ఉంటుంది. కొంత కాలం క్రితం వరకు సారంగిని ఉత్తరాదిని భోగం మేళాల్లోనువయోగించే వారని తెలుస్తోంది. సారంగి వాయించే సారంగియాల్ని చాల చిన్న చూపు చూసేవారిని చెవుతారు. కాని ఇవుడా పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఈ నాడు సారంగి మన దేశంలో గాక ఇతర దేశాల్లోగూడ గౌరవాన్ని,



50. సారంగి

ఆదరణని పొందుతూంది. సారంగియాల్లో జాతీయ గౌరవాన్నందుకొన్నవాళ్ళు, ఖండాంతరాల్లో గూడా ప్రసిద్ధులైన వాళ్ళు ఉన్నారు.

జానపదులు వాయించే సారంగి వాయిద్యాలనేక రకాలు చిన్న చిన్న వ్యత్యాసాలతో ఉన్నాయి. అయితే వీటిని వాయించే విధానం అంటే గోరుతో తంతిని తాకుతూ వాయించడం చాలా దూరం వరకు వ్యాపించి యుగోస్లావియాలో, గ్రీసు దేశంలోకూడా కనిపిస్తూంది. జానపదులు వాయించే రకాల్లో, గుజరాతన్ సారంగి, జోగి సారంగి, సింధి సారంగి, ధని సారంగి మొదలైనవి కొద్దిపాటి తేడాలతో కనిపిస్తాయి. వీటిలోనుంచే శాస్త్రీయ సంగీతంలో వాయించే రకం పుట్టి వుండాలనిపిస్తూంది.

ఈ సారంగిని, సితార్‌ను కలిపిన వింతైన సృష్టి 'దిల్రుబా' అనే వాయిద్యం. దీన్ని బెంగాల్‌లో 'ఎస్రాజ్' అని కూడా అంటారు. దీని 'రెసొనేటర్' అనే ధ్వని పెట్టె సారంగి వలె వుంటుంది. దండి బాగా పొడుగ్గా వుండి మెట్లు దీనిమీద కట్టడి సితార్‌లో వలె వుంటాయి. రెసొనేటర్‌ను కిందనుంచి, సారంగి వాయించినట్లు దీన్ని విల్లుతో వాయిస్తారు. దీని నాదం మృదువుగాను మనోహరంగాను సారంగి వాయిద్యంకంటె బాగా

ఉన్నప్పటికీ శాస్త్రీయ సంగీత కచ్చేరిల్లో ఇది బాగా అరుదుగానే కనిపిస్తుంది. గాని ఇదేమీ జానపదుల వాయిద్యమని చెప్పలేము. లలిత సంగీతానికి దీన్ని తరుచుగా ఉపయోగిస్తున్నారు. బెంగాల్‌లో ఎస్రాజ్ పేరుతో ఇది బాగా ప్రసిద్ధిగా వుంది. (చిత్రం : 51)



51. తార్ సన్నాయి

విల్లు వాయిద్యాలు ఇలాగ భౌగోళికంగా వేర్వేరు ప్రాంతాల్లో, విభిన్న జాతుల్లో, విభిన్న సంస్కృతుల్లో దేశమంతటా కలిసిపోయి ఉన్నాయి. అవి ఎంతో ప్రసిద్ధంగా

ఉన్నటికీ వాటి ప్రారంభ దశ, చరిత్రమొదలైన విషయమంతా గూడా మన కింకా కొరతగానే ఉందనిపిస్తుంది. ఇది మన దేశంలో మట్టుకే కాదు, ప్రపంచ మంతటా ఈ విధమైన కొరత కనిపిస్తుంది. ఏడు శతాబ్దాల క్రితం ఒక పెద్ద పండితుడు చెప్పినట్లు 'విల్లు వాయిద్యాల ప్రారంభ చరిత్ర మనకింకా విదదీయని సమస్యగానే' మిగిలిపోయింది. అది మనం కూడా అంగీకరించవలసిన మాట.

Laser Typeset by Quick Photo composers, New Delhi and
Printed at M/s. Central Electric Press, Naraina Ind. Area New Delhi.